# ఆంధ్రుల
# కీర్తన వాఙ్మయ కళాసేవ





కళాప్రపూర్ణ, ఆంధ్ర సరస్వతి,
సాహితీ రుద్రమ, ఉభయభాషా ప్రవీణ
ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

Andhrula Keertana Vangmaya Kalaseva - Contribution of Andhras in the field of Art through their Musical compositions.
by Dr. Utukuri Laxmikantamma

---

ప్రథమ ముద్రణ : సెప్టెంబరు, 1982
ప్రతులు : 1000



వెల: రూ. 12/-

ప్రతులకు :
డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ
బాపట్ల, గుంటూరు జిల్లా.

ముద్రణ :
మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్
1-1-694/2/ఎ గాంధీనగర్,
హైద్రాబాదు - 500 380.

# నాదసుధ

చారిత్రికముగా ఆంధ్రజాతి, అనేక రంగములలో, ఘనప్రశస్తిని, ఘన యశస్సును పొందియుండుట జగమెఱిగిన సత్యము.

విశేషించి జగజ్జీవితమునకు చైతన్యవంతమైన మనుగడ నిచ్చిన శిల్పము, చిత్రము, నాట్యము, సంగీతము, సాహిత్యము మొదలగు లలిత కళారంగమున ఆంధ్రు లెనలేని సేవచేసి యుండిరి.

అనల్పమైన ఈ కళాసేవయందు ఆలోచనామృతమైన సాహిత్యరంగమున ఆంధ్రు లెంత విస్తృతమైన, అనర్ఘమైన సేవసల్పి యుండిరో, ఆపాత మధురమైన గానకళారంగమున కూడ అంత మహనీయమైన సేవ చేసియుండిరి.

"మద్భక్తాయత్ర గాయంతే తత్ర వసామి నారద" అని వాక్రుచ్చిన భగవానుని, గానకళాప్రీతి నెఱింగియేమో యనునట్లు, ఆ గానకళారాధనా తత్పరమైన చేతన తోడనే, బహుభంగుల విస్తరించి తేజోవంతముగా, తెలుగుల మాగాణమున ఆంధ్రులు శ్రీకృష్ణ పరమాత్ముని మధుర మురళీరవళి యట్లు నర్తించిన గానకళా ప్రక్రియల రూపమున నాదోపాసన గావించి యుండిరి. అనంతమై, అఖిలమై, అనశ్వరమై, సృష్టికి మూలమై సృష్టియందంతటను బెరసికొనియున్న ప్రణవనాదమును, తుంబురనారదాది దేవర్షులు, నందీశ్వర, భరతాది మహర్షులును గానరూపముగా మలచి, జగతికి ప్రసాదించిరి. అదియును భగవదారాధనా రూపముగా మాత్రమేయని స్మరించుట, అత్యంతావశ్యకము. కాలక్రమమున ఆదికవి వాల్మీకి రచించిన రామాయణ మహాకావ్యమున కుశలవులు గానము చేసిరికదా!

ఆతరువాత, తరువాత, జగత్ప్రసిద్ధులైన, నారాయణతీర్థ, జయదేవాదులు శ్రీకృష్ణపరమాత్ముని లీలా సంకీర్తనారూపముగా గానకళను ప్రచురముగా వెలయించిరి.

ఇంత పవిత్రమైన ఈ నాదకళ సర్వకళాకుశలురైన తెలుగువారిచే సింహగిరి, కృష్ణగిరి వచనరూపముగా, జానపద కీర్తనారూపముగను

ప్రారంభమై, అన్నమయ, క్షేత్రయాదులచే పదరూపమున ప్రసిద్ధినొంది, త్యాగయ్యగారి నామసంకీర్తనాపరమైన, కీర్తనగా రూపులు దిద్దుకొని, భక్త రామదాసుని సంస్కారబలమున భజనకీర్తనావేశము నొంది, తత్త్వవిదులైన మహానుభావుల అనుభూతిపరముగా "తత్త్వములు" అను పేరున విశిష్టతను సంతరించుకొని, ఆంధ్రుల గానకళా సరస్వతిగా జగదారాధనమందినది. గాన కళోపాసనాపరమైన ఆంధ్రులొనర్చిన ఎవరికిని తీసిపోనంత సమగ్రమైన ఈ సేవ మిక్కిలి ప్రశంసనీయమైనది. ఆ పవిత్రసేవను పఠిత లీగ్రంథమున నాయా ప్రకరణములలో చదివి సంతసింపగలరు.

బాల్యమునుండియు, సంగీత, సాహిత్యసరస్వతీ సమారాధనాసక్తమైన, నా ప్రవృత్తి బలమున నిరంతరముగా, ఈ కళాఖ్యాయికా గ్రంథపఠన మందత్యంతాదరము కల్గి, ఎంతో అభిలాషతో ఆ విషయములన్నియు సేకరించి, జాగరూకతతో హృదయమునకేకాక, క్రియారూపముగా కూడా పదిలపఱచుకొనుట జరిగినది. దానికే కాలక్రమమున గ్రంథరూప మిచ్చుటయు సంభవించినది.

ఇటీవల, నారచనములను ప్రచురించుకొనవలెనను నొక శ్రద్ధ నా మది నావేశించినవుడు ఈ గ్రంథమును కూడా ముద్రణారూపమున దీనిని వెలుగునకు తేవలెనని ప్రయత్నించితిని, దానికి నా అభ్యర్థనపై, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారును ఆర్థిక సాహాయ్య మొనర్చి, నా పూనికను సఫలమొనర్చినందులకు వారికి నా కృతజ్ఞతాంజలి నర్పించుచున్నాను.

సుందరముగా ముద్రించి యిచ్చిన మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్, హైద్రాబాదు వారికి, చక్కగా ప్రూఫులు దిద్దిన శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారికి, బహుప్రయాసా సాధ్యమైన ముద్రణ భారమును వహించి శ్రమకోర్చిన సోదరుడు పాండురంగయ్యకు నా ధన్యవాదములు—

తేది. 27.9.82

సోదరి

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# ఆంధ్రుల
# కీర్తన వాఙ్మయ కళాసేవ

## ఉపక్రమణము

తెలుగు సారస్వతము, నలువరాణిసమర్చనమునకై తెలుగు కళారాధకులు భక్తియుక్తులతో సమర్పించిన యొక అమూల్య గ్రైవేయకము. ఆ దివ్యసుందర కంఠాభరణమున నమర్చబడిన కావ్య, పురాణ, ప్రబంధకీర్తనాదిమణిమాణిక్యములన్నియు ననర్ఘములే. సముదార గంభీరభావోద్దీపనముగల కళాకారులచే రచింపబడిన శాస్త్ర, పురాణ, విపుల కావ్య, కావ్య, ప్రబంధములును, శతక, యక్షగాన, కీర్తన, పదనాటకములు, ఖండకావ్య, గేయ, విమర్శన, కథా, వ్యాసాదులు అను బహువిధ మణిమాణిక్యములతోకూడిన ఈ రమణీయమణిహారము ఓజఃపూర్ణమై, దివ్య తేజోవిలసితమై నాటికిని, నేటికిని, ఏనాటికిని తెలుగు సరస్వతిని దిగంత విశ్రాంతకీర్తి ప్రభా భాసితురాలుగ నొనర్పజాలియున్నది.

ఆంధ్రులకు గర్వకారణమైనట్టియు, ప్రథిత భారతీయసాహిత్యములలో నొకటియై వాసిగాంచుచున్నట్టియు నీ తెలుగు సారస్వతమునందలి కీర్తన, లేక కృతి అనుపేరుకల పదవాఙ్మయశాఖ మహా విశిష్టమైనది.

ఈ శాఖను వెలయించిన వాగ్గేయకారులకు తెలుగుప్రజ లెంతయేని ఋణపడియున్నారనిన అతియోక్తికానేరదు. వారి ప్రతిభావ్యుత్పన్నత, యట్టిది! ఆ వాఙ్మయశక్తిప్రభావము లట్టివి!

ఏ మందురా? పైన పేర్కొనబడిన వాఙ్మయశాఖలన్నియు ధీమంతులగు కవివరులచే సృష్టింపబడి తత్తత్కాలదేశీయములును,

శాశ్వతములును అగు ప్రయోజనములను దీర్చుచు పాఠకులకు ప్రజలకు బ్రహ్మానంద సబ్రహ్మచారియగు బ్రహ్మానందమును గల్పించుచునే యున్నవి. అయినను ఆ శాఖలలో నొకటి యగు కీర్తనకు లేక పదము నకు అఖండమగు నాదము అత్యంత మాధారమైయున్నది. అగుట తక్కిన శాఖల కంటె ఈ సాహిత్యమునకు చిత్తవిచ్ఛిత్తియు, ఆకర్షణయు, సుఖవిరతియు, ఆహ్లాదమును అధికఫలములుగ కనిపించుచున్నవి. కావుననే ఈ సంగీత మధికశక్తిసంపన్నమని లక్షణకారులు గ్రహించి యున్నారు.

కావుననే సకల విద్యలకు అధిష్ఠానదేవతయగు సరస్వతీదేవికి సంగీత సాహిత్యములు రెండును కుచద్వయమై యలరారుచున్నవనియు నందు సంగీతము ఆపాతమధురమనియు, సాహిత్యము ఆలోచనామృత మనియు పెద్దలు నుడివియున్నారు. రాగతాళాత్మకమై గీతిమయమైన సంగీతమొక్కటియును ఒకయెత్తు - కావ్య ప్రబంధాది సమస్తరచనా త్మకమైన ఇతర సాహిత్యమంతయు నింకొకయెత్తును పైనదనిన సంగీత శాఖయొక్క పరువును, బరువును తజ్జ్ఞులూహింపగలరు.

రాగాత్మకమై, గీతిమయమైన ఈ వాఙ్మయ శాఖ కింత మాహా త్మ్యము, శక్తియు నబ్బుటకు కారణము; నాదశక్తి దీని కాధార మగుటయే.

కావున వాగ్గేయకారుల చరిత్రను మొదలిడుటకు ముందు ఇంత ప్రభావభావితమును. పరమ పావనమును, అఖండమునైన నాదమును గూర్చియు, దానిపై ఆధారపడి సర్వాకర్షకమై వెలసిన సంగీతమును గూర్చియు ముందు ప్రస్తావించు టసందర్భము కానేరదు.

"చైతన్యం సర్వభూతానాం నిర్వృతి ర్జగదాత్మనాం
నాదబ్రహ్మ పరానంద మద్వితీయ ముపాస్మహే॥

అను శ్లోకమున చెప్పబడినట్లు చరాచర సృష్టిజాలమంతయు నాదసంజ నితమైనది. శబ్దగుణకమైన ఆకాశము సృష్టికి కారణభూతములగు పృథి వ్యాది పంచభూతములలో తొల్లింటిదగుట యు నిట గమనింపదగినది.

ఈనాదము ప్రణవోద్భూతము. ప్రణవమునుండి సప్తస్వరములునూ వానినుండి సామవేదము సముత్పన్నమగుటచే సామవేదము సంగీతము నకు మాతృకయగుటయు నందఱెఱింగినదే. అనుబంధికమైన, అవిచ్ఛిన్నమైన నాదముయొక్క భావాభివ్యంజకమగు స్ఫుటస్వరూపమే సంగీతము. కావుననే "ప్రాణానిలసంయోగము వలన ప్రణవనాదము సప్తస్వరములై బరగె"నని త్యాగబ్రహ్మ నుడివియుండెను. నాదము సృష్టి కారణమగుట యే కాదు; ఈ పాంచభౌతికమగు సర్గమున కంతకును మోక్షప్రదాయకమునదియే యైయున్నది - ఆవిషయమునుకూడ గాయక సార్వభౌముడగు త్యాగేశుడే "వీణావాదనలోలుడగు శివు మనోవిధ మెఱుగరు" - అట్టి 'సంగీతజ్ఞాన విహీనులకు" "మోక్షముకలదా" యని సందేహించియున్నాడు. ఇదియాయనకుగల సందేహముకాదు - నిశ్చయరూపమగు విశ్వాసమే.

కేవలసంగీతజ్ఞానవిహీనునకు మోక్షముకలదాయని యా పరమ భాగవతోత్తముడు, ఆమహాజ్ఞాని, ఆ సంగీతతపస్వి ఆశంకించుటకును, శంకించుటకేకాదు, నిశ్చయించుటకునూ పెక్కుకారణములు కలవు. వేదాంత సంబంధములైనవియు, నాధ్యాత్మిక సంబంధములైనవియు నగు కారణములటుండ కళాపరముగను, లౌకికముగను కొలదిగ నాలోచించినను బలీయములగు కారణములనేకములు కాన్పింపగలవు.

సంగీతము, కవిత్వము, చిత్రరచనము, శిల్పము నను నివి యన్నియు కళలు - శాస్త్రములకంటెను, విద్యలకంటెను మనోరంజకత్వ మధికముగా నుండుట చేతనే కళలు ధర్మసాధనమునందును, లౌకికానంద సాధనమునందును శాస్త్రాదులకంటె ఉత్కృష్టములుగను, ఉత్తమ ములుగను, సులభతరములుగను పరిగణింపబడుచున్నవి. మనోరంజకములౌటవలననే దుష్టుల మానసములను సహితము సున్నితముగను, సునిశితముగను మార్చివేసి మృదువొనర్పగల శక్తిసామర్థ్యములు కళలకుగలవు - ఈ పైనజెప్పబడిన యీ గుణములు అఖండనాదాత్మకమైన సంగీతమునందు అన్ని కళలకంటె హెచ్చుగనుండుయేకాక, సహజముగ భాసిల్లుచున్నవి - అందువలన సంగీతముచే దుష్టత్వము శిష్టత్వముగా

పర్యవసితమగునని మనస్సులయందలి కాఠిన్యములు, మాలిన్యములును కరగి, మానవములురాగ రసితములై, మృదులములై, ఆర్ద్రములై ఉత్ఫుల్లములౌనవన్నమాటయేకదా. నిర్మలాంతరంగములందు పరమాత్ముడు సాక్షాత్కరించుటయును, మలిన రహితమనస్కులకు మోక్షాసక్తి సులభముగ కలుగుననుట అతిశయోక్తి కాదుగదా. కావుననే త్యాగరాయార్యులు "సంగీతజ్ఞాన విహీనునకు మోక్షముకలదా?" యని యాశంకించినాడు.

అంతమహోన్నతశక్తి కల నాద విజ్ఞానసంపద యే సంగీతమన జెల్లును "శిశుర్వేత్తి, పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అను సూక్తికి నిదర్శనముగ అలంతులగు శక్తుల నుదహరింపవచ్చునా? తెలివితేటలు కలిగి, నాగరకతకలిగిన వారినెట్లైన నలరింపవచ్చును. కాని అమాయకత్వమునకు చిహ్నమైన శిశువును. అజ్ఞానమునకు కేంద్రమైన పశువును, విషజిహ్వయయ్యును, పరిశుద్ధతకును, తీవ్రతకును, సంపూర్ణమై నిష్కళంకమగు రాగభోగలాలసతకును సంకేతమైన ఫణీంద్రునకును సమానముగ రససిద్ధిని కల్గించుటనిన సామాన్యమా? కాదు. పరిశుద్ధమైన సంగీత మొక్కటియే నాదశక్తి సహాయముతో నింత దుష్కరకార్యము ను సాధింపగలదు. కావుననే "ఏకం సంగీత విజ్ఞానం సాక్షాన్మోక్ష ప్రదాయకః" మ్మని పెద్దలునుడివిన నుడి సార్థకమైనది.

కావుననే నాదాత్మకమైన ఈ సృష్టియందలి జీవారాసులకు సంగీతము సహజప్రవృత్తిగ నేర్పడియున్నది - 'ననాదేన వినాగీతం, న నాదేన వినాస్వరం, ననాదేన వినా రాగం, తస్మాన్నాదాత్మకం జగత్" అను శ్లోకము నీయర్థమునే స్ఫురింపజేయు చున్నది. కష్టసుఖములలో నేది సంభవించినను ప్రాణి తన భావావిష్కృతిని నాదాత్మకముగను, ఒక్కొక్కయెడ రాగస్వరూపమునను వ్యక్తీకరించును. అంతియేకాదు. తనదగు సుఖదుఃఖానుభవావస్థలలో రాగాత్మకమగుగాన విజ్ఞానము నాశ్రయించి జీవరాశి దుఃఖవిరతిని, ఆనందాతిశయమును సాక్షాత్తుగ ననుభవించి ఒక విధమగు ఉపశమనమును సంతృప్తిని, ఆశ్వాసమును బడయుచున్నది - కావుననే సంగీతము తనకు సహజ ప్రవృత్తియైనదని

జీవకోటి గర్వపడుచున్నదనియు చెప్పనగును - "కూనరాగముతీయని మనుజుండును, కూతపెట్టని జంతువును నుండబోద"ను సామెత నీపట్టున స్మరించు టసంబద్ధముకాబోదు.

సృష్టియందు విజ్ఞానాధిక్యముచే ఉన్నతుడైన మానవుడు నాగరికతయు, విజ్ఞానమును పెరిగినకొలది సృష్టికి సహజ ప్రవృత్తియైన ఈ సంగీతమును అనేక విధముల సంస్కరించి 'కళ'గా రూపొందింప జేసినాడు.

ప్రాథమిక స్థితియందు కేవల రాగస్వరూపమై అవ్యక్త రూపముతో గాసట బీసటగానున్న ఈ గానార్ణవమును మథించి తమ తమ సుఖదుఃఖానుభవ రూపములైన భావములకు వాగ్రుపమిచ్చి, యావాక్కులకు సంగీతమును పొదివి సంగీతమయ స్వరూపమీయగా, తయారైనదే "పదము" అనవచ్చును. ప్రాథమిక మానవులు సహితము సంతోష సమయములయందలి యానందానుభవములను, కోపతాపములుకల్గు వేళలయందలి ఉద్వేగావేగాదులను, విచారవేళలయందలి దైన్యభావాదులను గేయరూపమున వెలిబుచ్చుచుండెడి వారను విషయము తెలిపినదేకదా. అవియే జానపద గేయములను పేరున తెలుగున బహుళతర ప్రశస్తినందియుండెను. ఈ గేయములే కీర్తనయొక్క ప్రాథమిక స్వరూపములు - సాహిత్య పరిచయము కలిగిన పండితులు లేక పంస్కృతమైన విజ్ఞానచైతన్యములుకల ప్రబుద్ధులు తమ నిర్వేదానందాద్యనుభూతులను సాహిత్యదృష్టిని సంస్కరింపబడిన వాక్కులతో గేయరూపమున వెలిబుచ్చినపుడు తయారైన పదపరిణామ స్వరూపమే 'కీర్తన' యనవచ్చును. కాగా కళగా రూపొందిన సంగీత విజ్ఞానోదధియందు ప్రాదుర్భవించిన అమృత భాండారమే కీర్తన - తదావిష్కర్తయగు ధన్వంతరియే వాగ్గేయకారుడు - మొత్తముపై గేయము, కీర్తన, కృతి, పదము, అనునవన్నియును సమానార్థకములని గ్రహింపవచ్చును - కాని, సంగీత శాస్త్రమున కొన్ని కొన్ని విభాగములకు ప్రత్యేకముగా నీనామములను సంకేతించుట గమనార్హము. వాక్కును గేయమును సమాన

ప్రతిభతో స్వయముగ సృష్టించువాడే వాగ్గేకారుడు. లక్షణకారులు "వాక్చ, గేయంచయస్సకురుతే వాగ్గేయకారః" అని నుడివియున్నారు.

కీర్తనకు ప్రాథమిక స్వరూపములైన, జానపదగేయ వాఙ్మయమునందలి పదముల పుట్టు పూర్వోత్తరముల నొకింత తడవుదము. తుమ్మెద పదములు, పర్వతపదములు, ప్రభాతపదములు, కోత పదములు, ఊతపదములు, శంకరపదములు ఆనందపదములు, గొబ్బి పదనములు, నివాళిపదములు, వాలేసుపదములు, రోకటిపాటలు, వెన్నెల పదములు, వెన్నెలవిడిపాటలు, పెండ్లిపాటలు, గొండ్లిపాటలు, గోష్ఠి పాటలు, జాజరపాటలు అని ఇవి పెక్కు తెరంగులుగా కానంబడుచున్నవి. ఇందు దేవుని సంకీర్తన సమయమున (భజనలలో) పాడునవి గోష్ఠి పాటలు, నృత్యసమయములలో పాడబడునవి గొండ్లిపాటలు - కష్టము చేయునపుడు ముఖ్యముగా బరువులు లాగునపుడు ఆలాపంపబడునవి ఊతపదములు - నాగరకులములవారు శుభసమయములయందలి పేరంటములలో పాడుకొనునవి జాజరపాటలు - ఇంకను సంతోషముగా వెన్నెల రాత్రులలో వినోదకాలక్షేపార్థము పానుకొనునవి వెన్నెల పదములు మొదలైనవి. కష్టముచేయువారు, మోటలులాగువారు, దంచువారు విసరువారు, పేరంటములలో, భజనకూటములలో, గోష్ఠివేళలలో, వినోదకాలక్షేపములలో పాల్గొనువారు, వారు వీరననేల సర్వులును తమ జీవితములను సుఖమయముగను, సులభముగను వెళ్ళబుచ్చుటకును పాట నాశ్రయించెడి వారని పై పేరులవలన మనము చక్కగా ఊహించుటకవకాశము గల్గుచున్నది. ఇంకను మతసంబంధమగు సంగీతపు పునాదులను మఱల ప్రస్తావింతును అనేకవేల వత్సరములనుండి నాగరకతకల్గి, విజ్ఞానమయ జీవితము గడపి తక్కిన దేశీయుల కాదర్శప్రాయముగానే కాక కన్నెబిడ్డగా మసలిన తెలుగువారి చరిత్ర యిట్టిదనిన నందసంభవమేమియులేదు. సుఖభోగలాలసులై, సంపన్నులై రసికత్వమున మహోత్కృష్టస్థితి నందిన తెలుగుల జీవిత చర్యలకు సంగీత ముపబలకముగా నైనదనిన నాశ్చర్యమును లేదు - అంతియేకాక సహజమధురమై, నిసర్గమనోహరమైన తెలుగుభాష విశేషించి ఇతర భాషలకంటె సంగీతము

నకు మిక్కిలి అనుకూలమై వివిధరాగతాళ పద్ధతులకు, సుకుమార భావ ప్రదర్శనములకు సైతము సహజముగ అవకాశ మిచ్చి సంగీతము గీతిమయ రాగతాళాదులలో ఒదిగిపోవు స్వభావగతి కలదియై యుండుటకూడ ప్రాచీనకాలమునుండి తెలుగు ప్రజల జీవితము రాగాత్మకమై, వారి నిత్యవ్యవహారము, సంగీతముతో బెరసిపోవుటకు కూడ మూలకారణ మైనది. కావుననే దక్షిణాపథమునందరి ఇతర భాషీయులును తెలుగుభాషతోడి సంగీతమునే పాడుచు దానినే అభిమానించి, ఆదరించి, అభివృద్ధికి దెచ్చియుండిరి కుప్పుస్వామి, 'కోయంబత్తూరు' Comparetive study of Indian music అనే గ్రంథంలో తెలుగు సంగీతమే అనాదియని పేర్కొనెను సంగీత విజ్ఞానమునందలి యాంధ్రుల విశిష్టతకు, వారి ప్రత్యేక కృషికిని నిదర్శనముగ చాల పూర్వకాలముననే "ఆంధ్రి" యను పేర నొక రాగముండుట నీశ్లోకమువలన తెలిసికొనవచ్చును. "విభావినీ తు వేరాళీ, వేగవంతీతు పంచమా, 'ఆంధ్రీ' గాంధారికాచైవ సత్యుర్మాలవ పంచమా" అనునది దీనికి నిదర్శనము. తెలుగుజాతి యందు కాలక్రమమున విజ్ఞాన మభివృద్ధి గాంచినకొలది తెలుగులు, యక్షగానము లను పేర గేయనాటకము లాడెడివారు - ఈ దృశ్యప్రయోగములయందు వివిధ గేయపద్ధలు ప్రదర్శింపబడుచుండెడివి - వానిలో కొన్నింటికి సంత్కృతము మూలమని మున్ముందు తెలియగలదు.

అయితే ఆంధ్రభాష యం దంకితమై ఆంధ్రులచే సృష్టింపబడిన యీ సంగీతమును "కర్ణాటక సంగీతము"ను పేరున పిలుచుటచే కొందఱిది కన్నడదేశీయులకు చెందిన సంగీతమా! యని శంకించుచున్నారు. కాని శ్రీనాథాది మహాకవులును ఆంధ్రకర్ణాట పదములను సమానార్థములగు రూపాంతరములుగ వ్యవహరించి యుండుట చరిత్ర ప్రసిద్ధమైన విషయమే కావున తెలుగు సంగీతమును కర్ణాటకసంగీతమని వాడినంత మాత్రమున నావిజ్ఞానము కన్నడులది కాదనియు తెలుగువారిదే యనియు తలంచుటలో నెట్టి విప్రతిపత్తియు నుండరాదు.

సరసకళాభిజ్ఞులగు తెలుగు ప్రజల యాదరణము నందును, సకలకళాపోషకులగు తెలుగు ప్రభువుల పాలకత్వమునను, రసస్నిగ్ధ

హృదయ సంస్కారులగు తెలుగు వాగ్గేయకారుల సంకల్పబలమునను ఈ సంగీత కళ క్రమముగ నభివృద్ధినొందుచు ఎప్పటికప్పుడు నూత్న వినూత్న పరిణామముల నందుచు వచ్చినది. అట్టి పరిణామములయందు తేరిన అంతిమ స్వరూపమే కృతి - కీర్తనకును కృతికిని శాస్త్రీయముగ నొకించుక భేదముకలదు - అయ్యది మున్ముందు సమయోచితముగా ప్రస్తావింపబడగలదు-

తెలుగు సంగీత వాఙ్మయమునందలి మొదటిదశయగు జానపద గేయ వాఙ్మయమును తొల్దొల్త ప్రస్తావించి యుంటిమి - రెండవ దశ యగు 'కీర్తన'నుగూర్చి ముచ్చటించుకొందము - 'కీర్తించునది - అనగా పొగడునది - అని యీ పదమున కర్థము - తమకంటె అధికులను స్తుతించుట లేక - ప్రశంసించుట యిందుద్దేశింపబడిన విషయమై యుండవలెను. ఇవి ప్రభువుల పరముగ నుండవచ్చును - లేదా ప్రభు రాజపరమేశ్వరుడగు భగవత్పరముగ నుండవచ్చును - "మేటియై చను భక్తకూటముల యందు పాటలను కీర్తనలుగాగట్టి పాడెడువారు" అనుటవలన నిది ప్రసిద్ధమగుచున్నది - ఈ విధముగా ప్రకీర్తింపబడిన కీర్తనలలో భగవత్సంకీర్తనమే హెచ్చుగా కానబడుచున్నది - ప్రభుకీర్తనమనునది సృష్టిలో ఒక అంగమగు మానవులయందును కొంతమందికి మాత్రమే విధాయక ధర్మము - పరమేశ్వర కీర్తనమనునది సృష్టికంతకును సర్వాంగీణమైన పరమధర్మమగుట కీర్తనలలో హెచ్చుభాగము భగవత్పరముగ నుండుటలో వింతయేమియునులేదు-

ఇక సామాన్య జీవితమునందొక భాగముగ నల్లుకొనిపోయిన పదములు, గేయములు ఏకాలమునాటికి కీర్తనలుగా మారినవి? అను ప్రశ్నమునకు ప్రత్యుత్తర మిచ్చుటతోనే వాగ్గేయకారుల ప్రశంశనీయు ప్రారంభమగుచున్నది - అనాగరకులును, పల్లెకారులునగు సామాన్య ప్రజలు తమ యనుభూతులను తమ వ్యవహార భాషయందు పొదిగి రాగమయముగ వెలువరించుటయే కదా పదస్వరూపము? అట్టియెడ

"జొన్న చేనికాడ సొగసుకత్తెను జూచి

నిన్నటేలనుండి నిదురరాదు........" మున్నగు శృంగారాత్మక పదములయందుగాని,

"ఆడజన్మకన్న గోవిందారామ అడవిలో చెట్టేమేలు" అను మున్నగు ఆడువారి కాలక్షేపపు పదములయందుగాని,

"చిన్ననాడబ్బాయి సిరిమొగముజూచి
సిగ్గుపడి చంద్రుడాడు పొడవజాలాడు
మఱునాడు ఆబ్బాయి మాటల్లువిని
మాణిక్యాలతోటి పొడువవచ్చెను"

మొదలైన జోలపాటలలోకాని, కుశలాయకము, లంకాయాగము వీరుల కథలు మొదలైన స్త్రీల పాటలలోకాని సంస్కారమెఱుగని సహజభావోద్రేకము, వ్యాకృతి దోషసంయుతత్వము కనబడుచున్నవి అంతియకాక ఒక విధమైన గతి లేక ఊతము మాత్రమె ఇందు ప్రధానముగ కానవచ్చుచుండును. దీనికి మాత్రాచ్ఛంద మాధారము ఇంకొక ముఖ్య విశేషమేమనగా ఇవి అంతగా రాగ ప్రధానములుకాక ధాతువుకంటె - అనగా సంగీతప్రత్యామ్నాయ మగు స్వరరాగములకంటె - మాతువునకే ప్రాధాన్యమిచ్చు వ్యావహారికసాహిత్య పదములై యుండుటయు విజ్ఞులు గ్రహించియుందురు. ఇవి ఊతము ప్రధానముగా కలవగుటచే ఇందు తాళమునకును ప్రాధాన్యములేదు. ఇట్టి పదములను పండితులగు వాగ్గేయకారులు ఈ రచనా విభాగమును స్వీకరించి కొద్దిగ ధాతువును పెంపొందించి మాతువునకు ప్రాధాన్యము తక్కువ కాకుండగను, సాహిత్యముచితమగు వ్యాకరణ సంస్కారమును పొందియుండునట్లును ఇంకను రాగ, తాళ, భావముల విషయమై పెక్కు సంస్కారములు కలుగునట్లును జాగ్రతవహించి 13వ శతాబ్దినాటికి పదమును కీర్తనగా తీర్చిదిద్దిరి- ఇట్టి కీర్తన వెలువడుటకు ముందుగా సై యుండునేమో 13వ శతాబ్దిలో తాండవ కృష్ణమాచారి - 'కృష్ణకవి' అను పేరున 'కృష్ణగిరి వచనములు' అను సంకీర్తనములు వ్రాసిరి - తాళబంధము, ఛందస్సు లేని చూర్ణికలును, వీరు వ్రాసిరి. తాళగంధి వచనములు అనికూడా వీనికి

పేరుకలదు - అనగా వచనములు అని యర్థమేమో ఇప్పట్ల 'తాళ ప్రమాణము కడుచలువై యుండి' అనువాక్యమును కలదు. దీనిని బట్టి వీరి కాలమునాటికి పదమునకు తాళ మేర్పడిన దేమో కాని పల్లవి, అనుపల్లవి, చరణము అను విభాగమేర్పడలేదు? ఒక వేళ ఏర్పడినను అది యింకను చరిత్రకారుల దృష్టి కందక కాలగర్భమునసే మఱుగువడి యుండెనో? ఈ కృష్ణగిరి వచనములైనను పూర్తిగా లభ్యమగుటలేదు- అచ్చటచ్చట చెదురుగా భాష తెలుసుకొనదగినంత కొద్దిగా సంప్రాప్తమగుచున్నదట - అదియైనను అముద్రితము - ఇంకను మున్ముందీ ప్రాథమిక పరిణామములను మఱల ప్రస్తావింతము.

## ప్రథమ వాగ్గేయకారుడు

ఇట్లు సంకీర్ణ స్వరూపముతోనున్న పదమును సంస్కరించి క్రొత్తరూపులు తీర్చిన వాడు తాళ్ళపాక అన్నమాచార్యుడు స్పష్టమగు పద్ధతిని రాగతాళము లేర్పఱచి, పల్లవి, చరణము అను విభాగమొనర్చి ధాతువును పెంపొందించి, సాహిత్యమును శిష్టముగా సంస్కరించి, ప్రప్రథమముగా సంకీర్తనములు వ్రాసిన ఘనయశస్వి; ఈయన! ఈ మహాతేజస్వి 1424 మొదలు 1503 వఱకు జీవించిన భాగ్యశాలి. జానపద గేయముగా ప్రజాజీవన స్రవంతియందు సుళ్లుదిరిగిపోయిన పదము, లేక గేయము, స్వయం వ్యక్తియగు కీర్తనగా నవతరించిన కాలము 15వ శతాబ్దమని యిప్పటికి తేల్చుకొంటిమి - ఈ కాలమునుండి సంగీత వాఙ్మయమునకు మంచిరోజులు సంప్రాప్తిచినవి - ఇప్పటినుండియే కీర్తన మంచి పరిణామమునొంది కడకు శ్రీత్యాగరాజు కాలమునాటికి మహోన్నతదశ నందినది - ఈ స్థితికి ప్రభువుల పోషణకూడ కొంతకారణము కాకపోదు - నారాయణ కవిచే కర్ణాటభాషయందు వ్రాయబడిన "రాఘవేంద్రవిజయము"ను కావ్యమునందు ప్రస్తుతింపబడిన "కృష్ణాధ్వరి" యను పేరుకల విద్వాంసునికడ శ్రీకృష్ణదేవరాయలు సంగీతమును, ముఖ్యముగ వీణావాదనము నభ్యసించెనని తెలియుచున్నది. ఇంతేకాక మహారసికవతంసుడైన యా ప్రభురాయలు "తన స్నానసమయము నందు కూడ కిన్నెరకంఠము కల పూబోండ్లు మనోహరగానము చేయవలె

నను నియమము నేర్పరించెను. అట్లుగానమొనర్చినగాని యాయన తన నిత్యకృత్యములు తీర్చెడివాడేకాడని 1514లో 'బార్బోసా' యను చరిత్ర కారుడు వ్రాసెను ఇట్లు ప్రభువుల పోషణను బడసిన వెనుక సంగీతకళ యచిరకాలముననే యతిశయముగా నభివృద్ధి నొందెనన్న యబ్బుర మేమున్నది?

ఇక అన్నమయ్య విషయ మారయుదము. పదవాఙ్మయమున నీతడొనర్చిన సంస్కరణమునుబట్టి పదమునకు కీర్తనరూపము సంప్రాప్తించినదని విమర్శకు లనుటయే కాని ఆ నాటికి ఆ పేరు వ్యవహారమున సిద్ధించినదా లేక కీర్తనము, పదము నొక యర్థమున వ్యవహరించు చుండిరా యని సందేహము! ఏల నందురా ఇంత మార్పు తీసికొనీ వచ్చిన తాళ్ళపాక అన్నమయ్యకు "పదకవితా పితామహు" డనియే బిరుదము. వారి పదములకు 'సంకీర్తనము' లని పేరు. ఈయన పోతన సమకాలికుడు. కడప జిల్లా నందవరీక బ్రాహ్మణుడు, తాళ్ళపాక నివాసి. ఈయన కుటుంబమంతయు కవి కుటుంబమే. అందును పదములకు దగ్గఱగా నుండి యొకవిధముగా పదములనియే చెప్పదగిన ద్విపద వీరి కుటుంబమున కాణాచి యైనది. ఈ అన్నమయ్య, కీర్తనలనే కాక ద్విపద కావ్యములను రచించెను. ఈవిషయము ముందింకను వివరముగా గాంచెదము. ఈయన సతీమణి 'తిమ్మక్క' 'సుభద్రా కళ్యాణ'మను ద్విపద కావ్యమును రచించెను వీరి వంశము వాడే తాళ్ళపాక చిన్నన్న 'అష్టమహిషీ కళ్యాణము' ను ద్విపదగ రచించెను. పదము గదలినచో నింత కవితా పరిమళములు గుబాళించు ఈ కుటుంబమునకు కుదురు తాళ్ళపాక అన్నమయ్య. వీరి కీర్తనా రచన మంతయు తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్తవమే. మొత్తము 32 వేల కీర్తనల నీయన రచించెను. అందిప్పుడు 12 వేల కీర్తనలు మాత్రమే రాగిరేకులపై తిరుమల దేవస్థానమున భద్రపరుపబడి యున్నవి. అందు కొన్ని కీర్తనలను శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు స్వరపరచి, ఫణితు లేర్పరచి పునరుద్ధరించుచున్నారు. లభించిన వానిలో ఎనిమిదివేలు శృంగార భక్త్యాత్మకములు. 4 వేలు ఆధ్యాత్మికములు. అకాలము నాటి

అభిరుచిని బట్టి పరికించినచో కేవలాధ్యాత్మిక ప్రపత్తికంటె శృంగార భక్త్యాత్మక సంకీర్తనమే ప్రజల అభిరుచికి హెచ్చుగ పాత్రమైనట్లు కనబడుచున్నది. తమ యిష్టదైవతము నుద్దేశించి గుణకీర్తనగానము చేయుచు తమ లౌకిక శృంగారానుభవములనే ఆ పరదైవముల శృంగార క్రీడా వినోదపరములుగ సంభావించి - శృంగార భక్తి సంపూర్ణభావము దొలుకాడ భజించుటయే వీని ప్రధానోద్దేశము. ఈ పదములయందలి ప్రధానభావములు నిట్లే చెలువారుచుండును - ఇక వీరి కీర్తనలోని సంగీతశాస్త్ర పద్ధతులనుగూర్చి యొక్కింత ప్రస్తావింతము. శుద్ధశాస్త్రీయ రాగప్రస్తావము, నిర్దుష్టమైన తాళము. ఒద్దికగల లయ, పల్లవి, చరణ ములు అను విభాగములు వీరి కీర్తన రచనలో బాగుగా పాటింప బడినట్లు కనబడుచున్నవి. అనుపల్లవి మాత్రమిందులేదు. విశేషించి వీరి రచనలో అంత్యముద్రా నిర్వహణ మొకటి కనబడుచుండును. ఈ యంత్యముద్రా నిర్వహణము అప్పటికి బహుళ ప్రచారములోనున్న కొన్ని జానపదగేయముల సాంప్రదాయానుసరణమైయున్నది.

చూడుడు 'సీతసమర్త'యను ప్రాతదగుస్త్రీలపాటలోని అంత్య ముద్రా నిర్వహణమును:- "వీరరసమ్మున శివవిల్లు రూఢిగ ఖండించీ వేడుకతో వైదేహిని పెండ్లాడివచ్చెనే రామచంద్రా, సువ్వీ సువ్వాలలో, సువ్వీ సువ్వాలలో, ఇందు క్రిందగీతలుంచిన 'రామచంద్రా' అనునది యీపాటకు అంత్యముద్ర. ఇక 'సువ్వీసువ్వాలలో' అనునది ఇది సమర్త పాటకావున చిమ్మిలి దంపుచు పాడవలెనని - సూచించుచు దంపుళ్ల పాటల కుంచు అంత్యముద్రనిందున అంకితము సేయుటైనది - ఇవి ప్రతి చరణము చివరను పాడవలయును.

ఇట్లే అన్నమాచార్యులుకు అంత్యముద్రా నిర్వహణవిధిని పాటించిరను నంశము

"చక్కనితల్లికి చాంగుభళా
చక్కెరమోవికి చాంగుభళా" అను

నిట్టి కొన్ని కీర్తనలనుబట్టి మనకు తెలియును.

తెలుగుభాషకు ప్రధానమును సహజలక్షణమునగు యతి ప్రాస విధియు వీరి కీర్తనలలో గనబడు ప్రచురలక్షణము.

శ్రీ తిరుమలేశుని సంకీర్తనాత్మకమైన ఈ కీర్తనలలో నొక భాగము అలివేలుమంగాంబికాస్తవముగల కీర్తనలు కాన్పించు చున్నవి:

"పలుకుతేనెల తల్లి పవ్వళించెను
కలికి తన విభుని కలసినదికాన"

ఇట్టి పదము లెన్నింటినో యుదాహరింపవచ్చును. ఇందలి యతిప్రాస నియమముచే కల్గిన నాదముయొక్క పౌనఃపున్యమును, మృదులమైన శృంగారభావ సమారంభమును, చల్లని తెలుగుపలుకుల జిలిబిలి సోయగమును పాఠకులు గుఱుతించియుందురు. అంతేకాదు చేయుచున్న రచన యందొక పవిత్రతాభావ గురుత్వము, పరువములు గురియ, నెల్లెడలను బొండుమల్లియల పేర్పువలె వెల్లివిరిసియుండును.

ప॥ జవ్వాది మెత్తినది తన
జవ్వసమె జన్నె వెట్టినది.

చ॥ ముద్దుమాటలది చెక్కు
టద్దముల కాంతియలరినది
గద్దరి చూపులది తన
వొద్దిక చెలియమీద నొరగుచున్నది ॥జ॥

ఆహిరి:-

ఇంతగాజేసెగా యింతి కన్నులనగవు సంతరించగరాని చనుదోయి బిగువు.

ఆహిరి:-

ఏమిసేయగవచ్చు నిట్టుండు భాగ్యవశ
మా మనియు దాగూడె నక్కటా చెలికి

చ॥ తుడువరే కమ్మగస్తురి బొట్టు నొసలెల్ల
కడుగ్రాగి పొక్కెనదె కటాకటా చెలికి
కడుగరె శిరసెల్ల క్రాగి జవ్వాదిచే
జడగట్టె ముంగురులు చెల్లబో చెలికి॥

విరహాగ్ని సంతప్తమానమైన శరీరావస్థయిందు బాగుగా వర్ణింపబడినది. చూచితిరా ఈకీర్తనలయందలి ప్రశాంతగమనము! నిండుగా మెండుకొని దరులొరసి గభీరగమనమున పారు గోదానదీమతల్లి కదలివచ్చినటుల దోచునె కాని కవిత్వమున చక్కిలిగింతలుపెట్టు శిల్ప చమత్కారము గానరాదు.

అయితే ఆధ్యాత్మిక భాగమున నెక్కుడు భావవైవిధ్య మగపడును.

చేరి మ్రొక్కరో నరులు శ్రీమంతుం డితండు
కోరి వరములిచ్చు కొండవంటి సింహము

మున్నగు కీర్తనలయందు ఈశ్వరుని కేవల గుణకథాసంస్తుతియును,

తెలిసినవారికి తెరువిదెమరిలేదు
నలినాక్షుం బొగడెడు నామములలో నున్నది-

చ॥ ఆకాసానలేదు మోక్షమటు పాతాళమునలే
దీకడ భూలోకమందు ఎందులేదు
పైకొని ఆసలెల్ల పాఱదోలి వెదకితె
శ్రీకాంతు బొగడెటి చిత్తములోనున్నది

మున్నగు కీర్తనలయందలి తేట తెల్లనుగ తెలుపబడిన సరళమగు ఆధ్యాత్మిక బోధయును, నామస్తుతి మహిమయును,

నేడే హరిసేవలయితే నిత్య భోగములు
పోడిమి దెలుసుకోవె బుద్ధిటెంగి జీవుడా-

చ॥ ప్రక్కన మనసులోన పాలుద్రాగినట్లనే
చక్కని మాయలలో సంసారభోగములు
నిక్కినిక్కి నీళ్ళలో నీడచూచినట్లనే
దిక్కుల కర్మఫలము దివ్యభోగములు॥

మున్నగు కీర్తనలలోని ఆత్మోపదేశములును, ఇంకను వివిధములగు భావములను పరికించినచో నీవిషయము తెల్లము కాగలదు. "జో అచ్యుతానంద జోజోముకుంద రార పరమానంద రామగోవింద" అను జోలపాట వీరిదె.

ఈపదముల యందలి భావమును, వాడిన పదములును శైలియును మిక్కిలి సరళములు, సులభగ్రాహ్యముగ నున్నవనుట సువిదితమే కదా? ఏదోయొక ప్రశాంతవనాటవులలో నిశ్చలముగ కూర్చొని వీతరాగుడై కనులు మూసికొని శ్రీహరిని ధ్యానించు తాపసోత్తముని భంగి యీ పదములయందలి ధార ఆవేగోద్వేగములును, విలాసవిభ్రమాదులును లేక ప్రశాంతముగ సాగిపోయినది. అప్పటికి దేశవ్యవహారములోనున్న రాగములనే, బాణీలనే స్వీకరించి మొదటినుండి చివఱవఱకు ఒకటేమట్టులో - ఒకే విధముగ పాడుటకు వీలగు వరుసలో - పాడుటకనువగు చరణములు రచింపబడియుండుట, ధాతువుకంటె మాతువునకే ప్రాధాన్యముండుట, ఎక్కువగా సులభగ్రాంధిక భాషనే స్వీకరించుట, కవితా శిల్పాది చమత్కారములకు కాక భావ వ్యక్తికె హెచ్చు ప్రాధాన్యమిచ్చుట అనునవి వీనియందలి ప్రధాన లక్షణములు - అన్నమాచార్యుని రచనా సౌభాగ్యమంతయు నట్లె దైవారుచుండును.

వీరి తరువాత వీరి రెండవ కుమారుడు తిరుపతి వెంగళయ్యయు, వీరి మనుమడు చినతిరుమలయ్యయు యీ పద్ధతుల ననుసరించుచునే కీర్తన రచనను సాగించిరి. వారి రచనలలోని అందమగు నొక ఆధ్యాత్మిక కీర్తనను గాంచుడు:-

మోవుల చిగురుల చిందువేదము
ఆవుల మందలలోని ఆ మా వేదము

చ॥ నాటికి నాడే మాచదువు

మాటలాడుచును మఱచెడి చదువు...." మున్నగు కీర్తనలలోని ఆధ్యాత్మిక భావ సందేశములను గాంచునపుడు అన్నమయ్య కీర్తనల యందుకంటె కొంచెము పరిణతిగాంచిన భావసౌందర్యము కలదా? యని పించును. కాని అన్నమయ్య రచనలలోని శృంగారాత్మక కీర్తనలు ఇంత కంటె భావసౌకుమార్యముతో సొంపులొలికి యున్నవి - ఎట్లైనను కుడి యెడమలుగాఉన్న వీరరచనలలో తారతమ్య మారయుట మిక్కిలికష్టము.

శ్రీ అన్నమాచార్యులు కీర్తనభారతి కర్పించిన మఱియొక గొప్పసేవ; ఆయన సంస్కృతమున కీర్తన లక్షణమను లక్షణ గ్రంథ మును రచించుట - దానిని వీరిమన్మడు చిన తిరుమలయ్య తెనిగించెను, వారి రచన ఆలక్షణ గ్రంథమున కుదాహరణములే-

వీరి తరువాత 17వ శతాబ్దియందు తంజపురిని పరిపాలించిన రఘునాధనాయకుడు కొన్ని అపరూపరాగములలో నూతన పద్ధతిలో కీర్త నలు రచించెనట - మేళతాళములను సృష్టించిన చతురుడట - ఈనాయక రాజచూడామణియొక్క సేవ మిక్కిలి ప్రశంసనీయమైనది.

అంతేకాక సప్రామాణికము లగు చతుర్దండి సంగీత లక్షణ శాస్త్రములను రచింపగల ధీశాలియగు వెంకటమఖి, ఈ ప్రభువరేణ్యుని శిష్యుడు - ఇంత ప్రజ్ఞాశాలియగు నీమహాభాగుని రచనలు కానరాకుం డుట శోచనీయము.

## క్షేత్రయ్య

వీరి తరువాత 1633, 73 సం॥రములలో తంజాపురిని పరిపా లించిన విజయనాయకభూపతికి, సమకాలీనుడైన క్షేత్రయ్యయొక్క కీర్తన సాహిత్యసంపద పేర్కొనదగియున్నది. ఈతడు కృష్ణాజిల్లాలోని మువ్వగ్రామ నివాసి, ఆగ్రామదైవమగు 'మువ్వగోపాల' ముద్రాంకిత ముగా 4,500 పదములు రచించెను. ఇప్పుడు కొన్నివందల పదములు మాత్రమే లభించుచున్నవి. ఈ క్షేత్రయ్యనుగూర్చి సుబ్బరాయ దీక్షితుల

'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'లో కొన్ని జీవితవిశేషములు తెలియవచ్చుచున్నవి. ఒక మహాయోగి వలన గోపాల మంత్రోప దేశమును పొంది, మువ్వపురి గోపాలుని ఆలయమున ఆ మంత్రమును జపింపగ, శృంగార రసమూర్తియగు గోపాలదేవుడు ప్రత్యక్షమై క్షేత్రయ్యను అనుగ్రహించి పదరచనా ధురీణతను ప్రసాదించెననియు, ఆ వెనువెంటనే 'శ్రీపతి సుతుబారికి' అను పదముతో, తన తొలుతటి రచనను అతడు వెలువరించి, తదాదిగా వేలకొలది పదముల రచించె ననియు మాత్రమే ఆ గ్రంథమున కలదు. కాని క్షేత్రయ్యను గురించి, ఈ కాలమున ఎక్కువ పరిశోధనను సాగించిన విస్సా అప్పారావు గారు, సాంప్రదాయిక గాథలను, క్షేత్రయ్య రచనలను సునిశితముగ పరిశీలించి, ఆ పండితుని జీవితగాథను కొంత స్పష్టము చేయగలిగిరి. క్షేత్రయ్య యొక్క తొలుతటి పేరు మొవ్వ వరదయ్య యనియు, కృష్ణా జిల్లాలోని మొవ్వ గ్రామమే అతని స్వస్థలమనియు, సంగీత సాహిత్య నాట్యాదులను అభ్యసించెడి దినములలో, తన సహపాఠి యగు దేవదాసిని ప్రేమించి, ఆమెపైగల తన ప్రేమను వెలువరిం చుచు తొలుతటి పదములను రచించెననియు, కడకు ఆమె ప్రబోధము వలననే గోపాలస్వామిపై పదరచనకు పూనుకొని, విరక్తతను ఆర్జించి మొవ్వ గోపాలునికి అంకితముగనే జీవించినంతకాలము పద రచనను కొనసాగించెననియు, పదరచన చేయుచు క్షేత్రాటన చేయుట వలననే క్షేత్రయ్య అనుపేరు వరదయ్యకు కలిగి కడకు రూఢతను పొందెననియు అప్పారావుగారు నిర్ణయించిరి. ఆ నిర్ణయము ఇప్పుడు బహుజనాంగీకృతిని ఆర్జించినది.

ఇది ఎటులున్నను, శృంగార ప్రధానములయ్యును, అంతర్గర్భిత ముగ అధ్యాత్మ విద్యాబోధమునకు వినియుక్తములైనవి క్షేత్రయ్య పదములు. ధాతుకల్పనలో ఈయన వేసిన ముందంజ తరువాతి

సంకీర్తనకారులెందరికో మార్గదర్శకమైనది. ఇప్పటి కర్ణాటక సంగీతపు రాగములకు ఎన్నింటికో విస్పష్టరూపమును కల్పించిన మహాపండితుడు క్షేత్రయ్య.

ఆతడు రచించిన పదములందు లాలిత్యము ఎల్లెడల పొంగిపొరలుచుండును. ఎలప్రాయపు జవరాలి చుబుకములవలె, కనుబొమవంపుల వలె,కడకంటి చూపులవలె, కెందమ్మి పెదవులవలె లేతలేతలగు, అలతిపద ప్రయోగములే యంతటను వెల్లివిరిసి నునుకాంతుల నీనుచుండును. అట్లని గాంభీర్యము బింకము చెడెనందుమా ? ఆమాట యనరాదు. ఏదియో యొక ఆలౌకికమగు జిగిబిగిగల కూర్పు శైలియంతట నలమి కొనియుండును– "నిరుపమానంద శయ్యపై నీవు లేకుంటె నిముసము యుగమౌనె" ? "లేమరో మాముద్దు గోపాలుడెంతైన లెస్సయుండితె చాలునే"–"వేమారు దూరేవిది తగవా బావిలో నీరు, వెల్లువ పోవునటవె ఎంతటి దిటవె" "మగువ తన కేళికామందిరము వెడలెన్...." మున్నగు ననేక పదములలోని కూర్పుపేర్పులను గమనించినచో ఈ యశిథిలబంధిత బాగుగా మనకంట బడగలదు. ఈతని రచనయందలి యింకొక మహత్తరగుణము ఆనితరంలభ్యమగు శయ్యాసౌభాగ్యము ! ఏదియైన నొక్కపదమును కదిలించి దాని బదులింకొక యర్థవంతమగు పదమును చేర్చెదమన్నను నారచన యంగీకరింపమియే యది– "పదవినిమయాస హిష్ణుతాశయ్య" యని దీనిని లక్షణకారులు మహాకావ్యలక్షణములలో నొకటిగ పేర్కొని యున్నారు.

అన్నమాచార్యునివలె నీతడును శృంగారభక్తిపరమగు రచనయే కావించెను. కాని యిద్దఱి రచనయందును ఓపినంత భేదమగపడును. అన్నమయ్య కావ్యమునగల శృంగారము లలితలలితము, కాని ఈతని

కావ్యమున గల శృంగారము ముదురుపాకము. అయిన ఇర్వుర ప్రబంధములయందును కైశికీరీతియే, సుకుమారశయ్యయే. ద్రాక్షాపాకమే. కాని యాతనికంటె ఈతని పదరచనయందలి మాధుర్య గుణవిశేషము ఉక్తిచాతుర్యమును గమనింపదగినవి. ఈతడు వాడినవి కూడ దేశీయ పదజాలమే కాని మెత్తమెత్తనగు నా పదముల కూర్పునందలి యలౌకిక సౌందర్యము ప్రశంసింపదగినది. ఇక సాహిత్యదృష్టి నొప్పరికింతము. అన్నమయ రచనకంటె కవితాశిల్ప చాతుర్య చమత్కారాదు లిందు హెచ్చు. ఉపమాద్యలంకార చిత్రణమునకొక్క మచ్చు:

ప. ఇన్ని విధముల పూజించేరసామి
ఇంతినను గూర్పుమా

అనుపల్లవి. నిన్నెంతగా వేడుకొనినందుకు
నాకు నెంజిలి దీర్చుమా నాసామి ॥ఇన్ని॥

చ. (1) కన్నెమోమునే కనుగొన గలిగిన
పున్నమి ఒక్క పొద్దుండేర స్వామి
కన్నుల ముద్దాడగలిగిననే జంట
గల్వపువ్వుల పూజించేర స్వామి ॥ఇన్ని॥

(2) సన్న నూగారంట గలిగిన నాగుల
చౌతివ్రతములు సలిపేర స్వామి
చన్నులంట గలిగిన బంగారు
కలశము శిఖరముపై నుంచేర స్వామి ॥ఇన్ని॥

ఇందలి అలంకారవైచిత్ర్యమును, గంభీర భావసమున్నతిని పరికించియే యుందురు. ఇట్టియెడ మహాపండితులగు వారి తలలను

దన్నునై పుణ్యము గాంతుము. పూజించేర, సలిపేర, పొద్దుండేర-మున్నగు దేశీయ వ్యావహారిక ప్రయోగములను కావలసిన రసస్ఫోర కత్వమునకై స్థానమెఱిగి ఎంత సొంపుగా వాడెనో గమనించితిరే కదా! రసవిషయమును గూర్చి నేదడప బనియే లేదుకదా! అయినను కొన్ని కొన్ని పదములలోని ధ్వన్యాత్మకమగు పరమాద్వైత భావమును, భాగవత తత్త్వమును గమనించిన క్షేత్రయ్య పరమజ్ఞానియని తెలియగలదు. కాని పరమభక్తుడైన క్షేత్రయ్య ఇంత పచ్చి శృంగారమును వర్ణించెనేమా యను తలంపు మనసును బాసి చనదు. "శృంగార రసమంజరి" యను నలంకార శాస్త్రమున కు దాహృతిగా, లక్ష్యగ్రంథముగా రచించెనని తెలిసికొనినపుడు మాత్ర మొకింత సంతృప్తి కలుగవచ్చును. ఏమైనను తట్టుకొనలేని శృంగా రమే!

అనుపల్లవిని చేర్చుటొకటి వీరి రచనలలోని విశేషము. అన్నమాచార్యుని కీర్తనల నీతడు పరికించియే యుండె ననుటకు ప్రబలకముగా ఒక చక్కని నిదర్శనమును చూపవచ్చును. "పలుకు తేనెలతల్లి పవ్వళించెను" అని అన్నమాచార్యులు జగన్మాత ముద్రిత నిద్రాసౌందర్యమునభివర్ణింపగా

"మగువ తన కేళికామందిరము వెడలెన్....
వగకాడ, మాకంచి వరద, తెల్లవారెననుచు ।మ।

చ. సొగసి సొగయని వలపు సొలపుజూపులతోను
వగవగగల ఘనసార వాసనలతోను
జిగిమించుకెమ్మోవి చిగురుకెంపులతోను
సగమూతుచముల విదియచందురునితోను ॥మ॥

అను గీతమును లోకమాత యొక్క ఉత్థానమందలి సమ్మోహ శృంగారమును మోహన రాగమున మనోమోహనముగా నీతడు వర్ణించెను. ఇది కంచి వరదరాజస్వామి సన్నిధిని చెప్పినది.

"వేడుకతో నడచుకొన్న విట రాయడే
ఏడు మూడు తరాల యెందునగాని
యెవతెను గూడుకొవి మువ్వగోపాలుడు
కృపజూపెనో యిపుడు–"

అను పదమొకటి మేరువు పదమని సర్వార్థ సారగ్రంథము పేర్కొని యున్నది.

ఇంతటి రచనాపాటవము కల మనీషి సాంస్కృతిక పద భూయిష్టమగు రచననేల చేయ యత్నింపలేదో యను సందియము పొడమవచ్చును. కాని రాగ రసార్ద్రమై భక్తిభరితమై సున్నితమైన హృదయసంస్కారము కల ఈ పరమ భాగవత శిరోమణిని తెలుగు పలుకుబడిలోని యొయారము, నయగారము, తీయందనము, మెత్తందనము లోగొనినంత సాంస్కృతిక సమాసోక్తిలోగొనగజాలకపోయినదేమో. కీర్తనలలో వెనుకటి కాలముకంటె సంగీతమునకు క్షేత్రయ్య కొంచెమాధిక్యమిచ్చిరి ప్రసిద్ధములైన సుమారు నలుబది రాగములలో పదునెనిమిది క్షేత్రముల దైవతముల ముద్రలతో నివి యంకితములై యున్నవి.

సరస సంగీత సాహిత్య పాండిత్య నికషమై యలరారిన రచనా సౌమనస్యమాతనిది ! పలుకు పలుకున తేనియలొలుక, తీయతీయగ నాత్మేశునితో పలికి పలుకరింప జేసుకొనగలిగి, యాతని సలరింప జేసుకొనగలిగిన అదృష్టశాలియాతడు ! లోకముతో నాతనికేమి పని ?

ప్రేమ సమాధిలోనున్న క్షేత్రయ సమాధిభాషతో నేమేమియో యాలాపించెను. కృష్ణ సంయోగ మహదానంద సంవేదన మనుపదము నను స్పందించెను. ఆతడొక మహానటుడు ! ఆతడొక సిద్ధగాయకుడు!

ఈ కీర్తనలను బహుళశ్రమకోర్చి లోకముప్రాపున వ్యాపన మొనరించిన మహోదయులు శ్రీ విస్సా అప్పారావు పంతులుగారు. తెలుగుల పెన్నిధియనదగు నీ యనర్ఘ కావ్యరత్న తేజమును అన్య భాషీయులకును ప్రసాదింపవలసియున్నది. కాని యది యెంతో వలంతులకేకాని యింతింత మాత్రపుటలంతులకు వలనుకాని పని. సుకుమార భక్తి భావావేశమునకు 'మీరా' యట్టి యనన్య భక్తులును, మృదుమధుర పదవిన్యాసమునకును, శృంగార బహుళతకును జయదేవుని యట్టి రసజ్ఞుడును దీనికై పని పూనవలసినదే. లేక మఱల క్షేత్రయ్య యవతరింపవలెనో, లేక కళాప్రచలితమైన సుందరాంధ్ర వసుందర నింకొక క్షేత్రయ్య కలండేమో విచారింపవలెను.

క్షేత్రయ్య వెనుక రాజాస్థానముల నాశ్రయించి వారి అభిరుచు లను బట్టి శోభనగిరివారు, గట్టుపల్లెవారు, వేణంగివారు, సారంగపాణి, ఘనం శీనయ్య మొదలగు కేవల శృంగారాత్మకములగు పదరచనముల గావించిరి. ఆ ప్రబంధములు మధురభావభక్తి పూర్వకములని యూరక పైపై మాటలుగా మనస్సంతృప్తి కొఱకై పేరుపెట్టవలసినదే కాని యంతకంతకు దిగజారి పోపోనీళ్లకుంబల్చనైన నీచశృంగారాభిరతి వాని యందలి కావ్యవస్తువై వాని స్థానమును మిక్కిలి దిగజార్చినది. వీనిని వాఙ్మయ చరిత్రయందు 'జావళీలు' అని పేర్కొనిరి. నాయక రాజుల తర్వాత దక్షిణాపథము నేలిన మహారాష్ట్ర ప్రభువుల యొక్క-ముఖ్యముగ షాహాజీ యొక్క- యాస్థానమున నీమాదిరి రచనములు హెచ్చుగ ఆదరింపబడినవి.

మనదేశమునందు సంగీత సాహిత్యములతో కూడిన పదరచన అనాదిగా సాగుచునేయున్నను, ధాతువుకంటె- అనగా సంగీతము కంటె- మాతువునకే ప్రాధాన్యము హెచ్చుగాకల రచనలే కానవచ్చు చున్నవనియు, కేవల నాదరచనలు అనగా సంగీతమునకు ప్రాధాన్యము నిచ్చు రచనలు తక్కువయనియు ముందే తెల్పియుంటిని. భగవత్సం కీర్తనమునందును, ప్రభుగుణ కీర్తనమందును ఉన్న కాంక్షను బట్టి యట్లు సాహిత్య ప్రధాన రచనలు వెలువడినవి. మతభేదమును బట్టి వివిధ మత ప్రచారముల కొఱకు కూడా ఇట్టి రచనలాకాలమున అవసరములైనవి. వైష్ణవ మత ప్రచార సందర్భముగా ఆళ్వార్ల శ్రీ సూక్తులు మున్నగునవి యిట్టి రూపమునే పొందియున్నవి. ఒక్కొక్క యెడ సంపూర్ణముగ ప్రచారోద్దేశమును మనమున నిడుకొని వారు సంగీత, రాగ, తాళ పద్ధతులను విసర్జించిరనియే చెప్పవచ్చును. కాని సామాన్య జనుల హృదయములకు హత్తుకొనుట కొఱకు మాత్రము ఊతమునకై సహాయపడి సాహిత్యమునకు శోభనిచ్చునంత సంగీత మును మాత్రము గ్రహించుచు వచ్చిరి. కాని వీరికంటె శైవసమయా చారుల గేయరచనలు ఇంతకంటె మెఱుగుగా నగపడుచున్నవందురు. కొందఱు శైవులు కేవలము పాటయుగాక, పద్యమునుగాక గద్య మునుగాక అన్నిటి గంధముకల 'వచనము'ల నుపయోగించుటయు మానకపోయిరి. వీరి పద్ధతిని జూచి వైష్ణవులును కొందఱీ విధానము ననుసరించిరి. 'తాళగంధి వచనము' లను పేర మున్ను నేను పేర్కొ నిన రచనాపద్ధతి యిదియే. 'సింహగిరి వచనము'లను పేరును వీనికి గలదు. ఇవితప్ప రామానుజ మతప్రబోధము సేయు పాటలు తెలుగున నంతగా గానరావు.

ఇది యిట్లుండ మధ్వమత ప్రచారము చేయవలసి వచ్చి శ్రీపాదరాయస్వామి, వ్యాసరాయస్వామి, ఆయన శిష్యుడు

పురందరదాసు మొదలగు మహామహులు నీతి తత్వ ప్రచారపరముగా తమ మతసందేశములను పాటల రూపమున కన్నడభాషయందు సాగించుచు మాధ్వవైష్ణవ సాంప్రదాయమున "దాసకూటము" లను శాశ్వత సంస్థలను నెలకొల్పిరి. వీరు ఈ పద్ధతియందు మనోహరమగు బాణీలతో పాటలను సృష్టింప నారంభించిరి. పురందరదాసుని కీర్తన లెఱింగిన వారికెల్లఱకు నిది యనుభూత విషయమే. "జగదుడిసిదశోదా" మున్నగు కీర్తనల బాణీ కడుంగడు మనోహరమై శ్రోతల నానందపరవశులను గావించుట యాంధ్రులకు కూడ తెలియును. కన్నడ భాషయందీపద్ధతి రచనల గావించిన వారింకను గాన్పించుచున్నారు. దాసకూటము వారి లక్షల సంఖ్యలకు మీరిన "దేవర నామము" లను పాటలను, 'నిజగుణ శివయోగి' యను నాతని 'కైవల్యపద్ధతి' యను పేరుగల తత్త్వములును నిందులకు పరమ నిదర్శనములు. ఇది యిట్లుండ పదునైదవ శతాబ్దమున శ్రీ ఆదిశఠగోపయతీంద్రుని విశిష్టాద్వైత మత సంప్రదాయ ప్రచారము తెలుగు నాట బహుళవ్యాప్తి నొందసాగినది. మన ప్రథమ వాగ్గేయకారుడైన అన్నమయ్య యీ యతీంద్రునికడనే విశిష్టాద్వైత సిద్ధాంతోపదేశము నొందినాడు. అంతేకాక సహజముగా గానకళాపచేళియమగు హృదయ సంస్కారము కల అన్నమయ్యను ఆకాలమునాటి శ్రీ పాదరాయస్వామి కర్ణాట గేయరచనలాకర్షించి యాపద్ధతి రచనల కాతనిని ప్రేరేచినవి. మనోజ్ఞమగు బాణీలతో ఎదములల్లిన పురందరదాసుడీ అన్నమయ్యకు శిష్యునివంటివాడు. అన్నమయ, క్షేత్రచార్యుల రచనలలో గొప్ప భావ భేదమున్నది. అది వారివారి స్వభావగతమైనది. అన్నమాచార్యుల జీవితము కేవలాధ్యాత్మికవాసనా సంస్కృతమైనది. ఆయన శృంగార కీర్తనలు రచించినను అయ్యవి యేమాత్రమును నిషేధింపదగని సాత్విక భావోపేతములై, ఉద్వేగ రహితములై, సరళముగా సాగిపోయినవి.

మొత్తముపై వీరిర్వురును భజనకూట పద్ధతిని పదములు రచించిన మహానుభావులు. అందు తాళ్లపాక అన్నమయ్య పదములు 'సంకీర్తనములు' అను పేరున ప్రసిద్ధమైనవి. క్షేత్రయ్య నుండియే మధురభావభక్తి శృంగారమను పేర భగవత్పరమను మహాదర్శము నుండి దిగద్రోచి కేవల మనుష్యపరముగ శృంగార కీర్తనలు వ్రాయుట మొదలైనది. ఇక వీరిని విడిచి రామభక్తాగ్రగణ్యుడైన రామదాసును దర్శింతము.

## కంచెర్ల గోపనామాత్యుడు
## రా మ దా సు

తెలుగునాట పరమ భాగవతశిఖామణిగా, రామభక్తాగ్రగణ్యుడుగా ప్రఖ్యాతిని బడసిన కంచెర్ల గోపనామాత్యుని కీర్తనలు సంగీత వాఙ్మయమున నొక ప్రత్యేక స్థానము నొందదగినవి. గోల్కొండ నవాబుగ తానీషా పరిపాలించుచుండగా భద్రాచలము తుకిడీకి చేరిన నెలకొండపల్లి యందు లింగనమంత్రి యను సద్బ్రాహ్మణ గృహస్థుడుండెను. ఆతనికిని కామాంబ యను నాతని సతికిని ఈశ్వర వర ప్రసాదముగ పుత్రోదయమయ్యెను. ఆ బిడ్డకు 'గోపన' యను పేరిడి గారాముగా బెంచుచుండిరి. ఆ బాలుడు బాల్యమునుండియు రామభక్తుడై ఆదర్శముగ కాలము గడుపుచుండెను. ఆ బాలుడు కాలక్రమమున సంప్రాప్త యౌవనుండై సద్వంశ్యురాలైన 'కమల' యను బాలికను వివాహమాడి సుఖజీవనము చేయుచు పున్నమి చందురుబోలు నొక బాలునిం బడసి యెట్టి లోటును లేకుండ, దాన ధర్మముల జేయుచు, అతిథి అభ్యాగతుల నాదరించుచు ఆదర్శగృహస్థని పేరుబడసెను. ఆతని మేనమామలు అక్కన్న, మాదన్నలను నిర్వురు తానీషా కొలువున కుదురుకొని ఉద్యోగము సేయుచుండిరి.

ఇట్లీ సంసారము సవ్యముగ జరిగిపోవుచుండ 'కబీరుదాసు' డను నొక పరమయోగి యాగ్రామమున కేతెంచెను. గోపన యంతకు క్రితమే రామ నామామృతపానము సేయుచు సంసార భవసాగర మీదుటకు తెప్పను జూపి పుణ్యము కట్టుకొను సద్గురుదెవరాయని యహరహము వెదకుచుండెను. అప్పటికే యతడు తన యనుభావక ములను కీర్తన రూపమున వెల్వరించు శక్తి కలవాడై యుండెను. గోపన తన కుమారుని నూయెలనుంచి-

"రామరామ జోజో ఘనశ్యామల నిభ
దేహసౌందర్య జోజో"

యని రామభక్తిపూర్వకముగ నొకప్పుడు పుత్త్రినే సాక్షాత్‌రామ పరబ్రహ్మముగ భావించి జోలలు పాడెడువాడు. మఱియొకప్పుడు—

"శ్రీరాముల దివ్యనామస్మరణ జేయుచున్న చాలు
ఘోరమైన తపములను కోర నేటికే మనసా"

అని యాత్మోపబోధమొనరించు కొనుచు సంసారాంధకూపమున బడకుండ జాగరూకత వహియించుచుండెడివాడు.

ఇట్లుండ నొక పుణ్యదివసంబున సంతత రామనామమరంద పానతుందిల హృదయారవిందుడగు కబీరుదాసుని భవ్యసందర్శనము గోపనామాత్యునకు లభించెను. అంత గోపన వంచనలేని మహాత్ము డీతడని యెంచి చెంత నిలుచుండెను. అంత కబీరుదాసుండును గోపన కడ మూర్తములై యున్న వినయ వివేకాదులను, శాంతస్వభావమును గుఱుతించి యాతడు రామభక్తాగ్రగణ్యుడు కాదగినవాడని గ్రహి యించి, ఆతని నుద్ధరించి భవసాగరోత్తరణము సేయించుట తన

కర్తవ్యమని భావించి, రామనామోపదేశమున కింత సత్పాత్రము దొఱకెను గదా యని సంతోషించి గోపన్నను చేరబిలిచి యాతనికి 'రామనామ తారక' మంత్రము నుపదేశించి 'రామదాసుండ'ని యన్వర్థ నామమొసంగెను. వెంటనే రామదాసు, గృహీతమైన రామనామ మంత్ర బలంబున సద్యోవిగళితపాపుండై, వికసిత దివ్యచేతనుండై, ద్విగుణీకృత కవితా తన్మయితభావుండై సర్వమును మఱచి సర్వమంగళవిగ్రహుండగు రఘువంశస్వామి సన్నిధి పెన్నిధిగ తన కాక్షణమంద సంప్రాప్తమైనట్లు మురిసి, ఆనంద తన్మయత్వమున మునిగి పరవశుండై ఇన్నినాళ్లకు గదా తన కోరిక ఫలించి, సద్గురుడు కటాక్షించి భవసాగర తారకమంత్రము నుపదేశించెను ? ఇన్నినాళ్లకు గదా జన్మము చరితార్థమైనదని సంతృప్తుండై వివేకోత్ఫుల్ల హృదయమున ఉజ్జ్వల గతితో ఉరకలువేయు నానందమున సుప్పొంగి గంతులిడుచు ధన్యాసిరాగమున గొంతెత్తి యిట్లు పాడెను.

"తారకమంత్రము కోరిన దొరికెను ధన్యుడనైతిని ఓరన్నా
మీరినకాలుని దూతలపాలిటి మృత్యువయని నమ్మికయున్న
||తా||

చ. ఎన్ని జన్మముల నెంచి చూచినను ఏకోనారాయణుడన్న ||తా||

— — — — — — —

చ. ఎన్ని జన్మముల చేసిన పాపము లీజన్మముతో విడునన్న
అన్నిటికిది కడసారి జన్మము సత్యము ఇకపుట్టుటసున్నా||తా||

ఇది మొదలు, మొదలే రామభక్తుడైన గోపన జీవితవిధానము ఇంకను భక్తిభావముతో బెరసికొనిపోజొచ్చెను. సంసారమున నున్నది లేనిది కూడ గమనించక యాతడు నిత్యము రామనామస్మరణామృతపానమున దనివిసనక తత్పదరాజీవ భక్తిమధుసేవనమున మత్తుడై తత్కీర్తన రచనాపరాయణుడై కాలముబుచ్చ దొడంగెను.

ఇట్లు కాలము జరుగుచుండ రామదాసునకు సంసారము గడచుటే కష్టమగు కాలము సంప్రాప్తించినది. అపుడాయన రామచంద్రు నర్థించుచు చేసిన యీ గీతమెంత స్వభావసిద్ధమై, సహజ సౌందర్యాలంకృతయగు పసిబాల వలె ఎట్టి యందములు చిందుచున్నదో గమనింపుడు :—

"ఏ తీరున నను దయజూచెదవో యినవంశోత్తమ రామా
నాతరమా భవసాగర మీదను నళినదళేక్షణ రామా॥
మురిపెముతో నాస్వామివి నీవని ముందుగ దెల్పితి రామా,
మఱువక యిక నభిమానముంచు నీ మరుగుజొచ్చితిని రామా॥
క్రూరకర్మములు నేరక చేసితి నేరములెంచకు రామా
దారిద్ర్యము పరిహారము సేయవె దైవశిఖామణి రామా॥

నిజమైన ఆర్తితోకూడిన ఈ భక్తికవిత్వావేదనము వితయగునా? తర్వాత నిత్యదానాదిక క్రతు నిర్వహణముతో రిక్తుడైన గోపనకు అక్కన మాదనలు తమ ప్రభునికడ నుద్యోగ మిప్పించి భద్రాచలం పరగణాపై తాశీల్దారుగ నియమింపజేసిరి. నరనాథుని కొలువు సేయుచున్నను జగన్నాథుని కొలువే తిరమని నమ్మి—

"నరహరిని నమ్మక నరులను నమ్మితే నరజన్మమీడేరునా?
చెరకులుండగ వెఱ్ఱి చెరకును నమలితే జిహ్వకు రుచి పుట్టునా
మనసా॥

యని క్షణక్షణమును ఆత్మపరిశోధన చేసికొనుచునే యుద్యోగ ధర్మము నిర్వహించుకొనుచు భద్రగిరి రామదేవునకు కైంకర్యము చేయుటకై అప్పుడే వసూలైన ఆరులక్షల తాసీలు ద్రవ్యమును విచ్చల

విడిగా ఖర్చుచేసెను. వెంటనే కొందఱు గిట్టనివారు తానీషా కడకు పోయి రామదాసునిపై చాడీలు చెప్పి మనస్సు విఱిచివైచిరి. వెంటనే నవాబు జవానులను బంపి రామదాసును పిలిపించి ప్రభు ద్రవ్యము విషయమై నిక్కచ్చి చేసి యడిగెను. రామదాసు తాను నిర్దోషిననియు, ప్రభుద్రవ్యమంతయు భగవత్కైంకర్యమైనదనియు, ఏడురోజులు గడువిచ్చిన తీర్చగలనననియు మనవి చేసికొనెను. నవాబు రామదాసుని గోల్కొండ కోటయందలి బందిఖానా యందుంచెను. అనేక విధముల బాధించెను; బెదిరించెను. ఆ బాధలకు తాళజాలక పాపమా పారుడు పలువిధముల నా పరాత్పరుని వేడుకొనుచు నెన్ని కీర్తనలతోనో కీర్తించెను–

అబ్బబ్బ దెబ్బలకు దాళజాలనురా జబ్బుసేయకమాయబ్బరారా–
అబ్బబ్బ మేనుబ్బడంగె, గొబ్బుగొబ్బున రావేమి నిబ్బరముగ
బ్రోతువని యుబ్బుచుంటి॥
దబ్బరగాదురా యొకడబ్బైన నేనెఱుగ నాయబ్బతోడుగ నాకీ
దెబ్బలేలరా ॥అ॥

యని రోదించుచు బొబ్బలువెట్టెను. లాభము లేకపోయెను. ఇంకెన్ని విధములో విలపించి పలవించెను. కాని యాపన్నరక్షకు డాతని మొఱ్ఱల నాలింపకపోయెను–

గడువు ముగియవచ్చినది. గోపన్నకు దన ప్రాణములు భద్రముగ నుండగలవను నాశ నశించినది. వీరిడియై, కడకు, మతిమాలి, గతిదూలి అస్తవ్యస్తమైన భావములతో నా దేవదేవుని నిందించుటకు పూనుకొనియెను. ఆయావేశమున పలికిన పలుకులెంత యొప్పిదములో యొప్పరికింపుడు :–

"ఇక్ష్వాకు కులతిలక ఇకనైన పలుకవా రామచంద్ర
నను రక్షింపజూడవే రాజీవదళనేత్ర రామచంద్ర
చుట్టూ ప్రాకారమ్ము సొంపుగ గట్టిస్తి.........
ఆ ప్రాకారానికి బట్టె పదివేల వరహాలు.........
సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకమ్ము.........
ఆ పతకానికి బట్టె.........
మీతండ్రి దశరథ మహారాజు పెట్టెనా,
మీమామ జనకమహారాజు పంపెనా ?
అబ్బ తిట్టితినని ఆయాసపడబోకు....
ఇంతసొమ్ము దిని ఇటులూరకుంటివా........"

యని ఉగ్రభక్తితో కచ్చిదీర పిచ్చలించి యడిగెను. మఱల మతిదెచ్చుకొని యా దేవదేవు నిట్లు నిందించితినేయని పశ్చాత్తాపపడి మఱల అభ్యర్థింప దొడగెను. ఇది విధము కాదని సీతమ్మను బ్రతిమాలుకొన నారంభించెను. చూచితిరా స్వభావ పేశలత !

"నను బ్రోవమనిచెప్పవే సీతమ్మ—నను బ్రోవమని చెప్పవే
నను బ్రోవుమని చెప్పు నారీశిరోమణి జనకుని కూతుర జనని
జానకమ్మ ॥న॥

చూచితిరా! జానకి నర్థించుటలో రాముని సంబంధమొలక జనకుని కూతుర యనుచున్నాడు. ఇట్లెన్ని విధములనో ప్రార్థించి, బ్రతిమాలి, భంగపడి, భయపెట్టి యాదీనమందారుని మనస్సును కఱగించెను. కడకు రామలక్ష్మణులు రామదాసుని భటుల వేసము దాల్చి నవాబున కారులక్షల పైకము చెల్లించి రామదాసుని చెర విడి

పించిరి. కథానకము శోభనాంతమైనది. జరిగినది తెలిసికొని తానీషా తాను భాగవతాపచారమొనర్చి నందులకు పశ్చాత్తాపపడి రామదాసుని పాదములపై వ్రాలెను. రామదాసుడు "అంతా రామమయం ఈ జగమంతా రామమయ"ముగా గాంచి సంతోష కందళిత హృదయుడై సర్వేశుని మహిమల దలంచి యా ప్రభుపరమేశుడే తానీషాను మన్నించునని సెలవిచ్చి తాను రామజోగియై "రామజోగిమందూ కొనరే పామరులారా" ॥రా॥ యనుచు వాడవాడల రామనామ ప్రచారము చేయుచు జీవితశేషమును గడిపి నిరవధిక సుఖములందెను.

అమాయికమును, నిష్కల్మషమును, ఉద్రేకపూరితమును నగు తెలుగుల సహజప్రవృత్తికేమాత్రమును పొచ్చెములేని ప్రతినిధి రామదాసుడు. ఈతని కీర్తనలలో ఎక్కువభాగము 'నాదనామక్రియ' రాగములో నున్నవి. ఈతని తర్వాత నుండియే మామూలు వాడుక భాషలో సూటిగ భావములను వ్యక్తీకరించుచు వేదాంతతత్త్వములు వ్రాయుట మొదలైనది. తరువాతి తత్త్వములలో 'నాదనామక్రియ' రాగము హెచ్చుగా వాడబడుట గమనార్హమైన విషయము. 'నాదనామక్రియ' పామరులు కూడా అలవోకగా పాడుకొనుటకు వీలగు సరళీరాగము.

## మునిపల్లె సుబ్రహ్మణ్య కవి

కాలము సరిగా తెలియదుగాని రామాయణము నంతను 'అధ్యాత్మ రామాయణకీర్తన' లనుపేర రచించిన సుబ్రహ్మణ్య కవీంద్రుని గూర్చి యిప్పటిననే ముచ్చటింపవలసియున్నది. ఏమందురా, వీరి రచనలలో ఇంతవఱకు పేర్కొనబడినవారి రచనలలో కంటె సాహిత్యభాగము మిక్కిలి హెచ్చు. ఒక్కొక్కచో దండకము చదివినట్లో రాగముతో వచనము చదివినట్లో తోపింపజేయు కీర్తనలు కూడ కలవు. అయితే ఈ పాటల వరుసలు

మాత్రము త్వరలో నోటికి కుదిరి సాధ్యపడునవి కావు. ఈ కీర్తనలకు మాతృక సంస్కృతమునందు విశ్వామిత్రునిచే రచింపబడిన ఆధ్యాత్మ రామాయణమని పెద్దలందురు. కొండవీటి చేదత్రాళ్లవలె మిగుల నిడువైన చరణములు కల్గిన ఈ కీర్తనములను రాగపద్ధతిని పాడుట కష్టమేకాక, ఒకప్పుడు పాడువారికిని విసుగు జనించుచుండును. అయితే ఎత్తుగడలన్నియు చాలా ధీర గంభీరముగను, దర్పముగను ఉండును. చరణముల నడకయు నల్లే ఖదనుదొక్కు పంచకల్యాణిగతి వలె నుండును. ఆగతియే కీర్తనలకు ప్రత్యేక గుణము ఆ గతిచేతనే ఆబాలగోపాల మాకర్షితులై యివి వినుచు చొక్కిపోవుదురు. అయితే ఈ కీర్తనల నందఱు విని యానందింప వలసినదే. కాని రామదాసు కీర్తనలవలె పాడజాలరు. పూర్వము ప్రతియింటను ముఖ్యముగ కొంత వయసు కైవ్రాలిన స్త్రీలును, పండితులును, పౌరాణికులును చాలా విరివిగను, ధారాళముగను పనిపాటలు చేసికొనునపుడు, ఉబుసుపోక కాలక్షేపములకు, సారసభా సమావేశములప్పుడు భజన గోష్ఠులప్పుడు, వనితామణుల పేరంటములప్పుడు పాడుచుండెడివారు. తెలుగునాట నివి యింత ప్రచారము నొందుటకు కారణము, ఇందలి యాధ్యాత్మిక భావసంపదయును, సాధారణముగ తెలుగువారికి గల రామకథాప్రీతియునై యుండవచ్చును. కాని యిప్పట నీపాటలను పాడువారే యరుదుగ నున్నారు. ఈకీర్తనల కూర్పు ఎంత విడివిడిగా పేలవముగా వచనముగా కనబడునో పాడుటలో అంత బిగువుగా సుదృఢబంధముగా కాన్పించును.

ధన్యాసి, ఆదితాళముతోడి ప్రారంభకీర్తనను గమనింపుడు.

నమశ్శివాయ తే నమో భవాయ.

అ.ప॥ సమానాధికరహితాయ శాంతాయ స్వప్రకాశాయ
ప్రమోదపూర్ణాయ, భక్తౌఘపాలనాయ ॥న॥

చ. గంగాభంగతరంగ, సంగతజటాజూటాయ
సంగీతలోలాయ శుభసంగతాయ
అంగజాన్తరంగాయ భంగాయ స్ఫటికోప
మాజ్ఞాయశేషశైలాధీశమిత్రాయ ॥న॥
ఇట్టి చరణములెన్నో కలవు.

భైరవిలోని మూడవ కీర్తనను గాంచుడు :—

"వినవే సత్యవాణి—అలివేణి—నీరజపాణి—

అ.ప. ననుగోరిభజియించి, నను మదిలోనుంచి
ననువరదుడనని సంశయము లేదు
మునుపు ఇటులిదియడుగ రెవ్వరును మహాయోగి వరసంఘా
వనము జీవన మమృతసేవనము జన్మపావనము ॥వి॥

చ. శ్రీరామునకు నమస్కారము జేసియని
వారణనాత్మతత్త్వము నీకు వివరింతు
నారాఘవుడు శౌరియజ్ఞానహారి జి
తారి శ్రీవిహారి మాయాధారి
తారకకీర్తి సత్యజ్ఞాన స్ఫూర్తి వి
దారితార్తి దేవతా చక్రవర్తి. చిదానందమూర్తి
యైరాజిలు శ్రీహరి మాయకెల్లనాధారమైనందువల్ల,
మోహముకల్ల
శౌరి ప్రకృతియాది నిజమాయారూఢి జగములుసృజియించి య
నారతము నభముగతివె విలోను పూర్ణతనుబూను ॥వి॥

ఇట్లు శివుడు గౌరితో రామాయణము సెప్పుచు నడుమ నడుమ ఆధ్యాత్మిక తత్త్వమును గూర్చికూడ ప్రస్తావ ప్రబోధములు సలుపుచున్నట్లు గ్రంథమంతయు నడచును.

వాలి వధావిషయమున బాణహతుడై వాలి, "నాచే నీకపకారమేమి ....బోయవై పొంచి యేసిన కీర్తియేమి?" అని వాలి శ్రీరాము నడుగగా రాముడు "తమ్ముని సతి నతిబలాత్కారమున బట్టిన పాతకు నిను జంపిన బాపము లేద" నిన, వాలి స్రుక్కి హరికి మ్రొక్కి "యిక దప్పులు లేవు శ్రీపతివి" అని సంతృప్తి వడియెనట. ఇట్టి కల్పనలెన్నో యిందు గలవు. ఏమైనను ఈ కృతియందలి అద్వితీయ పాండిత్య ప్రతిభయు అసామాన్యనిర్వహణ సామర్థ్యమును కృతికర్తయొక్క గొప్పదనమును తెలుపుచున్నవి.

ఎంత పెద్ద వచన చరణమైనను పూర్తిగా యతిప్రాస నియమము పాటింపబడినది. దుష్ట సమాసములు కాని, వ్యవహారభాష కాని యెందును గానరాదు. మిక్కిలి సంస్కృతములును శుచిర్భాయములు నగు పదవాక్యపద్ధతి యొక ముత్యాలపేర్పువలె నిందు అందగించినది. పాటల వరుసలో సంగీతము తక్కువగుటచే వేదాధ్యయనములోని ఉదాత్తానుదాత్త స్వరముల వలె మంద్ర మధ్యస్థాయిాల ప్రచారము కల గమనము కనబడును. తెల్గునాట వీనికి గౌరవపూర్వక ప్రచారము కలదు.

# రెండవ అధ్యాయము

## త్యాగయ్య (1759-1847)

గానకళావతారమూర్తియు, పుంభావ సరస్వతియు, సంగీత భారతియు ననదగు శ్రీ త్యాగేశుని జననముతో సంగీత వాఙ్మయమున గొప్ప పరిణామము కల్గినది. కాని కేవలము పూర్వులకువలె సాహిత్యము ప్రధానముగా గానక, సంగీతమునకు హెచ్చు ప్రాధాన్యము నిచ్చి ధ్వనిపూర్ణమగు సంగ్రహ రచనతో సాహిత్యమునకును ఉత్తమత్వమును చేకూర్చి సంగీత వాఙ్మయమున నూతనాధ్యాయమునకు బీజావాపమొనర్చిన మహా కళోదయుడీయనయే.

శ్రీ త్యాగేశులు సంగీతమహోదధియైన నారదు ననుగ్రహమును బడసి స్వరార్ణవ మర్మములను గ్రహించిన మహానుభావులు. తాను స్వయముగా గొప్ప సాధకుడై శ్రీరామచంద్ర పరబ్రహ్మనిష్ఠ దైవతముగా, నిలవేల్పుగా నిత్యముపాసించి తత్కారుణాసిద్ధి బడసిన పరమ భాగవతోత్తముడు. వాల్మీకి, వ్యాస. జయదేవ, పోతన, వేమనాదుల వలె ప్రాచీన ఋషిపరంపరకు చెంది, లోక సంగ్రహార్థము తనువు గైకొని భువినతరించిన కారణజన్ముడు. అట్టి రససిద్ధుని, తపస్సంపన్నుని రచన లద్వితీయములును, అసాధారణములు నగుటలో నాశ్చర్యమేమియును లేదు.

ఈ మహాభాగుడు 18వ శతాబ్దమున దక్షిణాపథ మందలి తిరువాయూరు గ్రామమున వసించెను. ఆ కాలమున "శరభోజి"యను మహారాష్ట్రరాజు రాజ్యపాలకుడుగా నుండెను. త్యాగయ్య జనకుడు రామబ్రహ్మము. తల్లి సీతాంబ. మాతామహులు పేరొందిన వైణికులు. తన కీర్తనలలో నెక్కడను మానవ నామస్మరణము సేయనని ప్రతినగొని రచనానిర్వహణము సేసిన త్యాగయ్య "సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాకు తండ్రి" అను కీర్తన యందును వెలువరించి పితరులను దైవత్వస్ఫూర్తితో సంస్మరించెను. ఇంతేకాక "దొరకునా ఇటువంటి సేవ" అను కీర్తనమున 'రామబ్రహ్మ తనయుడే త్యాగరాజు' అనికూడ చెప్పుకొని యుండెను. కాని యిచ్చట కూడ శ్లేషాలంకార సంయోగమున నది శ్రీరామ దేవుని పితృగౌరవమున పాటించుటే యైనది- త్యాగయ్య బాల్యమునుండియు శ్రీరామభక్తుడై తనకు పూర్వ వాగ్గేయకారులైన జయదేవ, పురందరదాసు, అన్నమాచార్య, రామదాసాదుల కీర్తనలతో భజనధ్యానముల జేయుచుండెడివారు. కాని వారు అపర శారదామూర్తులై జన్మించి యుండుటచే నప్పుడప్పుడు, నడుమ నడుమ పూజాసమయమున ఆశుధారగా "నమో నమో రాఘవాయ" యని దివ్యనామ సంకీర్తనముతో నప్పరమేశుని సంకీర్తించుచుండెడివారు. ఇట్లు వారు ఆశువుగ రచించు దివ్యనామ కీర్తనములను తండ్రియగు రామబ్రహ్మము చాటుననుండి విని వానిని తాళపత్రములపై వ్రాసి గ్రామములోని గాయకులకు, పండితులకు చూపెడివారు. ఆగ్రథనము నందలి మహత్త్వమును గాంచి ఎల్లరును ఆశ్చర్య నిమగ్నమానసులగుచుండెడివారు. అప్రతిమాన ప్రతిభుడైన ఆ బాలుని మహత్త్వమును గాంచి తండ్రి యా బాలుని యా గ్రామ వాస్తవ్యులును గొప్పగాయకులు నగు శొంఠి వేంకటరమణదాసులకడ శిష్యులుగా నప్పగించిరి. పసివాడగు త్యాగయ్య యాయనకడ శిష్యత్వ మొనప్పుచు తనకు గీతికా రచనము ససిగా కుదురువడలేదేయని

నిరంతరము విచారించు చుండెడివారు. అంత నొకనాడు దివ్యమౌని యగు నారదుడు రామకృష్ణస్వామి యను నామము వహించి త్యాగయ్య కడకేతెంచి యా బాలునకు బుజ్జగించి రామతారక మంత్రోపాస్తి నేసి పంచనదీశ్వరాలయమునకు గొంపోయి స్వరార్ణవమను మహత్తరమగు సంగీతశాస్త్ర గ్రంథము నిచ్చి యంతర్ధానమొందెను. అప్పుడు త్యాగరాయడు నిజమెఱింగి తన యదృష్టమును కడు పొగడుకొని నిరంతర రామనామ మంత్రజపరతుడై మోక్షసాధన మొనరింప దొడంగెను. తనకు నారదమౌని తారక మంత్రోపదేశము నేసిన సద్గురుడౌటచేతనే విజయశ్రీ రాగమునందు "వరనారద నారాయణ స్మరణానంద అనుభవముగ .....శరదిందు నిభాప ఘనా నఘసారము గాను బ్రోవుమిక" అను కీర్తనతోడను, ఇంకను పెక్కురాగముల యందును నారద పరమగు స్తుతులతోడను నా గురుఋణ మీగ యత్నించిరి.

అది మొదలు గేయరచన మారంభించి వారు 24 వేల సంఖ్యకల కీర్తనలు రచించిరట. వాల్మీకి కృతమగు రామాయణము 24 వేల శ్లోకములు కలదౌట వీరును శ్రీరామదేవ సంకీర్తనమును 24 వేల కీర్తనలతో గావించి మించిరనియందురు. ఇంతేకాక వారి జీవితకాలమున వారు దీక్షబట్టి 96 కోట్ల రామనామము జపించి వ్రాతపూర్వకముగను రామకోటి వ్రాసితరించిరి. భాగవతము వారికి మిక్కిలి ప్రీతిపాత్రమైన పారాయణ గ్రంథరాజము- వారి కీర్తనారచన, కడు సంగ్రహము, విస్పష్టము, రమణీయము, విశుద్ధమునై చెలువారినదే కాని, యటనట, పోతనగారి భాగవత పఠనఫలమో యనునట్లుగ, అలంకారాత్మకముగ, "రామవందనం, రఘునందనం-భక్తచందనం ........" "ద్యుమణికులార్ణవ విమలచంద్రుడనివై, హృత్కుముద సుమముల, త్యాగరాజ సుతునిపై చల్లరె" అనియును రచించిరి- గార్హస్థ్యధర్మమున వీరు అనేక కష్టనష్టముల భరింపవలసిన వారైరి.

ప్రథమకళత్ర వియోగమునొంది 'కమలాంబ' యను సాధ్వీరత్నమును మఱల నుద్వాహమైరి. అన్నగారగు జప్యేశుడజ్ఞానియై ఆయన భక్తి మార్గము నొల్లక కడునిడుమలకు గురిసేసెను. ఒకనాడు రాజ్య పాలకుడైన శరభోజి వీరి మహామహిమలను విని తన యాస్థానమున కలంకారము గూర్చుడని యభ్యర్థించుచు అనర్ఘమణి మాణిక్యో పాయనముల మహామంత్రుల చేతికిచ్చి పిలువనంపించెను. కాని స్థిర చిత్తుడై, భక్తిగంభీరుడై, ఈశ్వరాశ్రయధీరుడై యున్న త్యాగేశు నా యాకర్షణము లేమియు కదిలింపలేకపోయెను. ఆ ప్రలోభనముల పొడగాంచి యా సిద్ధుడపుడు పాడిన కళ్యాణకృతి యెంత మనోజ్ఞ మైనదో గమనించిన వారికే తెలియును :—

నిధి చాలసుఖమా, రాముని సన్నిధిసేవ సుఖమా,
నిజముగ బల్కు మనసా ॥ని॥
మమత బంధనయుత నరస్తుతి సుఖమా
శమదమమను గంగాస్నానము సుఖమా,
సుమతీత్యాగరాజుని కీర్తన సుఖమా"

యని యాత్మపరీక్ష చేసికొని యీ లౌకిక "తుచ్ఛసుఖముల్ మీసాలపైదేనియ" లని నిశ్చయించి త్రోసివైచెను. ఈ ఘట్టముతో లౌకికోపభోగములాశించి అట్టివాని ప్రాప్తికై తల్లక్రిందులు తపస్సు చేసినను దొరుకని రాజాశ్రయ మప్రయత్నలభ్యమై లభించి సిరి తనంత వెదకికొనిరా మోకాల్ల దొలగదన్నెనేయని తలంచి మూఢుడై యన్నగారు తమ్మునిపై మిగుల కోపించి యారాత్రి త్యాగయ్య పూజావిగ్రహములను తీసికొనిపోయి కావేరీ నదియందు పారవైచెను. తెలతెల్లవారుచునే త్యాగయ్య జరిగిన పనిని దెలిసికొని పూజ్యుడగు జ్యేష్ఠసోదరుడగుట తన యన్నగారి నేమనజాలక, నిత్యోపాసనలంద నియు శ్రీరామ విరహమోర్వక సంతత ధారలుగా కన్నీరుగార్చుచు "హరినేనెందు వెదకుదు......" మున్నగు కీర్తనలతో పలవించి

పలవించి, విలపించెను. కడకా విగ్రహముల యునికి దెలిసికొని "రార మాయింటిదాక" అని ఆనందబాష్పోద్విగ్నమానసుండై స్వామి వారిని పల్లకింబెట్టి యూరేగించి యింటికి తీసికొని వచ్చి తన పూజా మందిరమున వేంచేపు జేసెను. అదిమొదలు అన్నగారును తమ్ముని ప్రభావమెఱిగి తమ్ము నాదరించుచుండెడివారు. శరభోజి మహారాజు వలె మళయాళప్రభుడగు స్వాతి తిరునాల్ అను వాగ్గేయకారుడగు ప్రభురత్నము కూడ వారి సందర్శన భాగ్యమభిలషించి వారిని తన దేశమున కాహ్వానించెనట. కాని ఇంత మహత్త్వ సంపన్నుడయ్యు తిలోంఛవృత్తిని జీవించు నిరాడంబరుండును, రామ సేవాభాగ్య సంపన్నుండైన త్యాగయ్య యట్టివారికి లోబడునా ? కాని సాధుసత్తము లెవరేని యేతెంచిరన్న స్వయముగా నడచి యెదురేగి వారిని మన్నించెడు వాడు. అంతియేకాక శిష్యులచే నాకర్షితుడై వారికి అనేకాగమ విద్యా, శాస్త్రములలో ప్రధానముగ సంగీతమున శిక్షణనిచ్చెడువాడు. ఎందఱో తన్ను పరీక్షింప వచ్చి భంగపడి తుదకు తన్నాశ్రయింప వారినెంత మాత్రము చుల్కన సేయక ఆదరించి ఛాత్రులుగ గైకొని గురుకులమున వారిని పోషించి విద్యాభిక్ష యొసంగెడు నిగర్వచూడామణి. అంతేకాక అతిథ్యభ్యాగతులను, పేదసాదలను పోషించిన ఉదారగృహమేధి. సిద్ధ జీవనుడు. త్యాగయ్య మధుర భావభక్తి యెంతో లలితమైనది. తన జీవనసర్వస్వమైన రఘువీరుని తనకు పతిగా భావించి "ఎందు కౌగలింతురా, రామ ఎంతని నే మన్నింతురా రామ" అని యా నీలమేఘశ్యామ సుందరాకారుని సుకుమార దేహము తనయాలింగనములచే నలగిపోవునేమోయని జంకి తనకు గల మోహపారవశ్యమును, ప్రణయభరమును సంయమన మొనర్చుకొని సుకుమార శరీర, నా ప్రణయసర్వస్వమా, శృంగారరసాధిదైవతమా నా ప్రేమలు సఫలమగునట్లు నాకుతుకంబీడేరునట్లు 'నిన్ను ఎందు కౌగలించుకొందునురా' యని యభ్యర్థించిన ఉత్తమ ఇల్లాలైనా డా మహనీయుడొక

క్షణమున! ఆ రఘుకిశోరునకు ముద్దుల మఱందియై "మా జానకి చెట్ట బట్టగ మహారాజువైతివి" అని మేలమాడెను. ఒక దివ్యానుభావాను వేళవేళలో నా జగత్పతికి, జగత్పితకు తానొక తల్లి ననుకొని 'ఉయ్యాల లూగవయ్యా శ్రీరామ' యని జోలలు బాడిన మాతృ మూర్తియు నీ మహామహుండే. అనితర లభ్యమైన భక్తివాల్లభ్య మున దానేమి సాధింపజాలకపోయెను? చలన రహితుడైన వేదాంతియై, పరమార్థతత్త్వము నందలి నిజమర్మ మెఱింగి "ఉండేది రాముడొకడే ఊరక చెడిపోకె మనసా" యని ప్రబోధమొనర్పజాలిన పరదేశికు డౌట కాయనకే చెల్లినది.

అంతేకాక పెక్కు తీర్థక్షేత్రముల కేగి యాయా పరదైవత ములపై బహుసంఖ్యాకము లగు కీర్తనలం జెప్పెను.

"వినతాసుత వాహనుడై వెడలెను-కాంచీవరదుడు",
"తెర తీయగరాదా నాలోని- తిరుపతి వెంకటరమణ !
మత్సరమను ॥తె॥
అనునవి యీ శ్రేణికి చెందినవి.

ఇట్లు చరితార్థుండైన ఈ కళోదయుని జీవిత విశేషముల నెన్ని వేసగి ప్రొద్దులలో ముచ్చటించినను దరుగువడవు, అట్టియెడ ఇంక సంగీత విజ్ఞానఖని యగు నాతడు కీర్తన వాఙ్మయమున కొనర్చిన సేవను, అందు గావించిన సంస్కారములను ప్రస్తావింతము.

సాహిత్యమున కంటె నాదమున కెక్కువ ప్రాధాన్యమిచ్చి సంగీతప్రధానములగు కీర్తనల రచించుటకు శ్రీకారము చుట్టెనని మున్నే వాకొని యుంటిమి. నాదోపాసన చేసి ఎందఱో తరించిరని వీరు పెక్కు కీర్తనలలో తన భావమును వెలిబుచ్చిరి. 'నాదతను మనిశం' అను 'చిత్తరంజని' కీర్తనయు, 'నాదోపాసన' అను కీర్తనయు, నింకను పెక్కు కీర్తనలు నిందుకు నిదర్శనములు.

ఈ నాదప్రధానత- వీరి రచనలోనైనను ప్రథమముననే కానంబడదు. ప్రాథమికదశలో బాల్యమునందు రచించిన 'దివ్య నామముల'లో నిదిలేదు. శుద్ధసావేరి యందలి "దరిని తెలుసుకొంటి త్రిపుర సుందరిని తెలుసుకొంటి" అను కీర్తన మిక్కిలి మనోహరమై యున్నది. అయినను అందును ఇంత రాగప్రధానత కానరాదు. కేదార గౌళయందలి 'కరుణాజలధీ, దాశరథీ' అను కీర్తనము బొత్తిగా అధ్యాత్మ రామాయణకీర్తనవలె నున్నది. శహనలోని "గిరిపై నెల కొన్న" అనునదియు, ఆహిరిలోని "ఆరయ శ్రీరఘు' అనునదియు సంపూర్ణమగు వికాసము చెందిన గీతరాగాత్మకమైనవిగా కానంబడును. ఇట్లు క్రమవికాసము గాంచిన కీర్తన ; పల్లవి, అను పల్లవి, చరణము అను సంపూర్ణవిభాగము నొంది పలువిధములగు సంచారభావములకెడ మిచ్చు సంగతుల ప్రచురతకలిగి 'కృతి' యనుపేర ప్రసిద్ధికెక్కినది వీరి రచనల మూలముననే. చరణముల యందును అన్ని చరణముల కొకేరీతి వరుసకాక వరుసలుమార్చు విన్యాసము తీయదగిన అవకాశము కల్పించెను. ఇంకొక ముఖ్యవిశేషమేమన పల్లవికి, చరణములకు సంగతులు వేసి విషయభావములు హృదయమునకు హత్తుకొనునట్లు ఊది పాడుట యనునది వీరినుండియే ప్రారంభమైనది. ఇవి మనోధర్మ సంగీతమునకు చెందిన లక్షణములు. ఈ ధర్మమున గాయకుడు స్వతంత్రజ్ఞాన మార్జించుట కవకాశముండును. అయితే ఈ ధర్మము వీరిలో మితముగ నుండి స్వతంత్రజ్ఞానమును గూర్చి యింపు గల్గినది. అతీత, అనాగత గ్రహముల చాకచక్యము ప్రదర్శించుటకును, గమ కాదుల భేదములు చూపుటకు గూడ యీపద్ధతి రచనయందవకాశము కలదని నిరూపించిన రచనలివియే. అనేక విశేష రాగములయందును, సామాన్య రాగములయందును, మూలమూల రాగముల యందును, కృతుల నొనర్చి ఆయా రాగములలోని ప్రధాన గుణములను, కళా స్థానములను, సమ్మూర్ఛనాదులను, సౌందర్య మాధుర్యాదులను

పూర్తిగ విస్ఫురింపజేసిన కళాశీలి యీయన. ఒక్క ఆనందభైరవి యందు మాత్రము వీరిరచన లేదందురు. దానికిని తగినంత కారణము కల కథానక మొండుకలదు. కూచిపూడి భాగవతులొకరు "మధురా నగరిలో" అను జావళీ వ్రాసి తిరువాయూరున కేగి యచ్చట ఆపద మభినయించుచు శ్రీ త్యాగేశు నాహ్వానించిరట ఆ ప్రదర్శనము గాంచి రసవివశుడై వారిని చాల ప్రశంసించి యాగీతరచనకు సంతసించెనట. అంత వారు "మహానుభావా ఎంతో కష్టపడి మేమీ పదమును రచించి యభినయించు కొనుచుంటిమి. ఇది మిముబోంట్ల ప్రశంసల నంది యున్నది. తమరుగనక ఆనందభైరవిలో కృతి రచియించితిరా ఈ పదము ఊరును పేరును లేకుండ పోవును. కావున దయచేసి ఆనంద భైరవిలో మాత్రము కృతిని రచింపవలదని బ్రతిమలాడుకొనిరట. అంతనా ఘనౌదార్యశీలి అట్లేలెమ్మని వారికభయ మిచ్చెనట. ఇంకొక విశేషమేమన కొన్ని కొన్ని రాగములలో ఒక్కొక్క రాగమున, 10, 15 కీర్తనల వఱకు వీరి రచన లగపడుచున్నవి. అయినను అందొక్క కీర్తనకైనను ఎత్తుగడ యందు కాని, నిర్వహణమునందు కాని, అంత్యమునందు గాని, పోకడయందు గాని ఏమాత్రమును పోలిక లేకుండునట్లు నడిపించిన సిద్ధహస్తుడు. గతివిన్యాస వైవిధ్యము చూపి ఒక్కొక్క రాగమునకు గల వివిధ, విచిత్ర విశేష శక్తులను ప్రదర్శించి, సమగ్ర రాగస్వరూప సౌందర్య వ్యక్తిత్వములను తన కీర్తనలద్వారా ఆయా రాగములకు ప్రదత్తము చేసిన సృష్టికర్త.

వీరు రచించిన 24 వేల కీర్తనలలో అనేక విభాగములు గలవు. దివ్యనామ సంకీర్తనలు, ధూపదీప నైవేద్యాద్యుపచార కీర్తనలు. ఉత్సవ సాంప్రదాయ కీర్తనలు, మేలుకొలుపు, పవ్వళింపు, ఆరగింపు సేవాది కీర్తనలు, మంగళహారతి కీర్తనలు, వసంతోత్సవ కీర్తనలు అను ననేక శాఖల విభజన మొనర్చెను. ఇందన్నింటికంటె మానసికో

ద్బోధన మొనర్చుచు విరచించిన కీర్తన లతిలోక రమ్యములై, మిక్కిలి యుదాత్తములై, సముచితములై యున్నవి. 'మలయమారుత రాగము' నందలి "మనసా ఎటులోర్తునే నా మనవిని చేకొనవే........ దినకర కులభూషణుని దీనుడవై భజనసేసి దినము గడుపుమనిన విన వదేల గుణవిహీన........ ॥మన॥" అనునది మకుటమనదగిన కృతి రత్నము. ఇంకను ఇట్టి కీర్తనము లెన్నియో కలవు. ఇవికాక తన సొంత గొడవలను, సంసార ఛిద్రములను స్వామికి నివేదించుకొను కీర్తనలును గమనింపదగి యున్నవి.

"సంసారులైతేనేమయ్యా శిఖి
పింఛావతంసుడెదుట నుండగ"

అను కీర్తనమునందలి సమర్థన మొకటి యిందులకుపఌలకము. తన అన్నగారు తనతో ఆస్తి విభాగముచేసికొనినపుడు మిగుల దుఃఖించి "దినము నిత్యోత్సవమున....అనుదినము నారుల మేలు నోర్వక రెండు సేయవలెనంచు బలికితినా ?" అని మానసిక శోధ నొనర్చు కొనుచు మహా భాధపడుట యిందు కాననగును.

రాగభావరసోచితముగా విలంబకాల, మధ్యమకాల, ద్రుతకాల కీర్తనలు రచించెను. సేవకుని కోరికపై వానికి సులభసాధ్యమగు రీతి 'నీ సేవచే నిత్యానందుడనైతి' నని యొక కీర్తన రచించి వానికి నేర్పెను. ఇట్లన్ని తరగతులవారికి ఆబాలగోపాలమునకు పనికివచ్చు నట్లు కీర్తనల రచించుటొకటి వీరి రచనలయందలి విశేషము.

పాండిత్య ప్రకర్షను పరిశీలించవలెనన్న ఘనరాగ పంచరత్న ములు, తిరువత్తియూరు పంచరత్నములు, కోవూరు పంచరత్నములు నని పదునైదు కీర్తనలు ప్రసిద్ధి నొందినవి.

అందు ఘనరాగ పంచరత్నములు :—

| | | |
|---|---|---|
| 1) జగదానందకారక— | నాట | ఆది |
| 2) దుడుకు గల— | గౌళ | ఆది |
| 3) కనకనరుచిరా— | వరాళి | ఆది |
| 4) సాధించెనే మనసు— | ఆరభి | ఆది |
| 5) ఎందరో మహానుభావులు— | శ్రీ | ఆది |

తిరువత్తియూరు పంచరత్నములు :—

| | | |
|---|---|---|
| 1) సుందరి నిన్ను— | బేగడ | రూపకము |
| 2) సుందరి నీదివ్య— | కళ్యాణి | ఆది |
| 3) దారిని తెలుసుకొంటి— | శుద్ధసావేరి | ఆది |
| 4) సుందరి నిన్ను వర్ణింప— | ఆరభి | చాపు |
| 5) కన్నతల్లి నిన్ను— | సావేరి | ఆది |

కోవూరు పంచరత్నములు :—

| | | |
|---|---|---|
| 1) నమ్మివచ్చిన— | కళ్యాణి | ఆడి |
| 2) కోరి సేవింపరావె— | ఖరహరప్రియ | ఆది |
| 3) శంభో మహాదేవ— | పంతువరాళి | రూపకం |
| 4) ఈ వసుధ నీవంటి— | శహాన | ఆది |
| 5) సుందరేశ్వరుని— | శంకరాభరణం | ఆది |

నివియై యున్నవి. ఇందు శివస్తుతియు, దేవీస్తుతియును నుండుటే తని సమబుద్ధికి నిదర్శనము. ఇవి యన్నియును కాక 'అఠాణా' రాగము లోని "ఏల పరాకు జేసెదేల బాలకనకమయచేల...." అను కీర్తన

మిక్కిలి ప్రసిద్ధమైనది. ఇందలి అంత్యప్రాస నియమమును, చరణ ములు దీర్ఘమైనను నందలి మనోహరత్వమును గావించును. ఈకీర్తన ప్రప్రథమముగా త్యాగరాజు రచించెనని కొందఱందురు. 96 కోట్ల రామనామ జపము ముగిసిన వెనుక రచించెనని కొందఱంద్రు. ఏమైనను శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణ సహితుడై విశ్వామిత్ర ముని యాగమును గాచుటకై కోదండపాణియై యేగుచున్నట్లొక నిమేష మాత్రము దర్శనమీయగా త్యాగరాయస్వామి ఆ సందర్శనమునకు ఆనందపరవశుడై దివ్యమంగళకరమగు ఆ దృశ్యమంతలోనే అదృశ్య మాయనే యని మివుల చింతింపుచు మఱల నట్టి దర్శనమిమ్మని యా పరంధాముని వేడుచు పాడిన కృతి యది. ఇందలి గమనము మహా ప్రశస్తమైనది. వేలసంఖ్యను గల ఇట్టి కీర్తనముల నెన్నని ఎత్తి చూపగలము ?

శృంగారాత్మక సంకీర్తన మీయనయందు రూపొందినంత లలితముగ నింకే వాగ్గేయకారుని యందును పరిణతి నందలేదు. దీనిని గూర్చి మున్నే కొలదిగ ప్రస్తావించి యుంటిమి. "రార సీతారమణీ మనోహర, నీరజనయన ఒక ముద్దీర," అను కీర్తనను,

"వద్ద యుండెదే బహుమేలు వారిజాక్ష
లిద్దంపుమోముగలరంగ, అనుపమ మోహనాంగ
బంగారుపూల పూజింతు, బాగుగా నిన్ను సేవింతు
శృంగారించి కౌగలింతు, చిరకాల మారాధింతు"

అను కీర్తనను "చేతులార శృంగార మొనరించి చూతును...."మున్నుగా గల కీర్తనల పరిశీలించిన నీ యంశములు విశదము గాగలవు. ఉదార శృంగార కల్పనల దేశమున కుడుగరలిడి మార్గదర్శియైన తిక్కనార్య

డీపట్టున జ్ఞప్తికి వచ్చును. అంతేకాక అత్యధికమును, పరమపవిత్రము నగు లలిత ప్రణయ భావుకుడైన త్యాగయ్య తల్లిగా, తండ్రిగా, సైదోడుగా, గురుడుగా గూడ నా పరస్వరూపుని పట్ల తన్ను భావించు కొని యనుక్షణ మానందమున పులకించి పోయెనని

"శ్రీరామ జయరామ శృంగారరామయని చింతింపరాదె
ఓ మనసా॥
తళుకుల చెక్కులముద్దుబెట్ట కౌసల్య మును తపమేమి జేసెనో
తెలియదు॥
దశరథుడు శ్రీరామరారాయని బిలువ........
తనవెంట గొనిపోయె....కౌశికుడు...     ॥శ్రీ॥

మున్నుగా గల కీర్తనలను బట్టి తెలియుచున్నది.

"ఎద్దునకేమి దెలియు నటుకులరుచి"
'సోమిదమ్మ సొగసుకాండ్ర గోరిన
సోమయాజి స్వర్గార్హుడౌనె,
'కారు బారుసేయువారు గలరే నీసరి'
"తనతలు పొకరింటికి తీసిపెట్టి తాకుక్కలతోలురీతి"

మున్నగు వాక్యరచనల జేసిన త్యాగయ్యగారి లౌకిక సాంఘిక నీతి విచక్షణత లోకానుభవజ్ఞత చక్కగా అవగాహనము కాగలదు. అంతే కాదు ఉత్తమవర్ణమగు బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానమునకు దూరులై పాతిత్యమొందియు దామే యుత్తములమని అహంతతో మాట్లాడు రీతిని "బ్రాహ్మణీకము బాయ నీచుల బ్రదుకాయె యీ కలిలో బ్రాహ్మ మైన బల్కుచున్నా" రనియు భగవద్భక్తి శూన్యులయ్యు నూరక కర్మ పరతచే మోక్షము సాధింపదలచిన వారిని కూటమార్గస్థులను కాబోలు. యజ్ఞాదులు సుఖమను వారికి సములజ్ఞానులు గలరా"యనియు

పెక్కు తెరగుల లోకములోని దుర్వృత్తమును కూటప్రవృత్తిని వెడలగాసి జంకుగొంకులు లేక విమర్శించి విడిచిపెట్టెను. ఇట్టియెడ వేమనార్యు డొక్కడే వీరికి సాటిగా గన్పట్టును.

ఇక సంగీత విషయమున పరిశుద్ధత, అకళంకత శ్రద్ధా జాగరూకతలు విశేషించి స్వరశుద్ధత, శ్రుతిలయాత్మకమగు నాదజ్ఞానము చాలా అవసరములని పెక్కుసారు లతియభినివేశముతో హెచ్చరించెను. అంతేకాక సంగీత జ్ఞానవిహీనునకు మోక్షము లేదనియు, నాదోపాసకులకు యుక్తి సులభసాధ్యమైనవనియు నాడిన పల్కులు మున్నే వింటిమి.

సొగసుగా మృదంగతాళము జతగూర్చి చొక్కజేయు ధీరు
డెవ్వడో,
నిగమ శిరోర్థము కలిగిన నిజభక్తితో. స్వరశుద్ధముతో ॥సొ॥
నిద్దుర నిరాకరించి, ముద్దుగ తంబురబట్టి, శుద్ధమైన స్వరముతో
పద్దు తప్పక భజియించే........
"మద్దెల తాళగతులను దెలియక మర్దించుట సుఖమా"

మున్నగు కీర్తనలెన్నో దీనికి దృష్టాంతములు.

రామభక్తి సామ్రాజ్య పట్టభద్రుడై, స్వయముగా దానే నాదసుధారసలోలుడై తనివిసనని అమరగాయక సార్వభౌముని రచనమున కేవలము సాహిత్య మర్యాదలగూర్చి తడపుట 'స్తనశల్యపరీక్షయే' కాగలదు. అట్లని సాహిత్య విషయమున త్యాగరాజుని పండితునిగా దలంచునంత యపచార మింకొకటి లేదు. అట్లనువారిదిక్షంతవ్యము కాని దుస్సాహసమే యనవలెను. అలతి పొలతి మాటలలో అతి విశాల గంభీరార్థముల నిమిడ్చిన యీ సంగ్రహ రచనాకారుని నైపుణ్యమింకే వాగ్గేయకారునకును సాధ్యము కాలేదనుట అతిశయోక్తి కానేఅదు.

"దినమణి వంశతిలక లావణ్య దీనశరణ్య" మున్నగు కీర్తనల యందలి కాంతి ఓజస్సుతో గూడిన రచనము—

"తెలిసి రామచింతనతో నామము సేయవే ఓ మనసా
తలపులన్ని నిలిపి నిముసమైనను తారకరూపుని నిజ
తత్త్వములను ॥తె॥

మున్నగు కీర్తనల యందలి ప్రసన్నతాగుణ సంయుక్తమై విశదమగు నర్థము నొసంగు సంగ్రహరచనయు

"దాశరథీ నీ ఋణము దీర్ప నాతరమా పరమపావన రామా
ఆశదీర దూరదేశములను ప్రకాశింపజేసిన రసికశిరోమణి
భక్తిలేని కవిజాలవరేణ్యులు భావమెఱుగలేరని కలలోజని
భక్తి ముక్తి కలుగునని కీర్తనముల బోధించిన త్యాగరాజ
కూర్చిత"॥

మున్నగు కీర్తనముల యందలి కథాకథననైపుణి.

"మురిపెము గలిగెగదా రామసన్నుతకరివరద శ్రీరామ
ఈడులేని మలయమారుతముచే
గూడిన కావేరీతటమున........
సకల సుగంధరాజసుమములు, సలలితములగు కోకిల
సునాదములు
శుకముఖ సనకాదులసన్నుతమైన సురతరువులు గలిగి"

మున్నగు కీర్తనలలోని ప్రకృతివర్ణనయు,

'ఏలావతారమెత్తుకొంటివి ఏమి కారణము రాముడై
ఆలము సేయుటకా, అయోధ్యపాలన జేయుటకా,

యోగులను జూచుటకా భవ రోగులను బ్రోచుటకా, శత
రాగరత్నమాలికలు రచించిన త్యాగరాజునకు వర మొసంగుటకా॥

"అలకలల్లలాడగ గని ఆరాణ్ముని ఎటు పొంగెనో"

అను కీర్తనములందలి తూగును, సహజముగ విరిగిపోవు యతిప్రాసల సొంపును, అకృత్రిమముగ యతిప్రాసము లేర్పడు నట్లెంచుకొని అర్థమునకు వెలితిరానీయని పదముల కూర్పు చెడంగును తిలకించితిరా? సహజకవులై కావ్యములు రచించిన కవిశ్రేష్ఠుల కావ్యరచనాచణత్వ మందు చక్కగా ప్రతిబింబించుటలేదా ?

త్యాగరాయని వెనుక నాతని ననుసరించుచు నీ సాంప్రదాయ మున నింక ననేకులు ఇట్టి కృతిరచన మొనర్చిరి. వారి రచనలగూర్చి ప్రస్తావించుటకు ముందు త్యాగరాయల ఇతర గేయరచనముల గూర్చి యొక్కింత యారసెదము గాక.

## త్యాగయ్య — ప్రహ్లాదభక్తివిజయము

గానకళాసార్వభౌముడగు త్యాగయ్య ప్రహ్లాదభక్తివిజయమును గేయప్రబంధముగా రచించెను. ఇందలి కథ భాగవత కథయే. కాని కల్పనమునం దొకింత మార్పు చేసి ఆతనికి భక్తపాత్రకు మఱింత యౌచిత్యమును చేకూర్చిరి.

ప్రహ్లాదు డొకప్పుడు సముద్రతీరమున నృసింహమూర్తిని గూర్చి తపమొనర్చి, యెంత తపించినను నాస్వామి దర్శనభాగ్య మొదవలేదని పరితపించెను. అంత సముద్రు డాబాలుని భక్తికి మెచ్చి నరసింహదేవుని దర్శనము ప్రహ్లాదునకు శీఘ్రముగా కలుగునట్లు సహాయము చేసెను. తుదకెట్లో స్వామి ప్రత్యక్షమై మఱల వత్తునని చెప్పి

యంతర్ధానమయ్యెనట. అంత ప్రహ్లాదు డార్తుడై స్వామి దర్శనము కొఱకై పలవించి ఆర్తితో విలపింపగా స్వామి మఱల దర్శనమిచ్చి యా బాలభక్తుని సంతృప్తి గావించెను.

ఇందొక తత్త్వబోధ యిమిడి యున్నది. ప్రపథమమున నృసింహస్వామి దర్శనమిచ్చినది సాగరప్రభుని బలముననే కాని ఆతని బలముపై కాదు. కాని ప్రహ్లాదుని భక్తి పరిపక్వత నొంది ఎవ్వరి సహాయము లేకుండగనే ఈశ్వర సాక్షాత్కారమునొంద జాలినదిగా నుండవలెను. అందుకై స్వామి మఱల వత్తునని చెప్పి వేంచేసెను. ఒకమాఱు భగవత్సందర్శనామాధుర్యమును రుచిమఱిగిన నాతడు మఱింత తీవ్రమగు నార్తితో తిరిగి యా దివ్యమంగళ విగ్రహ సందర్శనార్థమై విలపించెను. "మద్భక్తాయత్రగాయంతే తత్రైవ సామ్యహమ్మ"ని సెలవిచ్చిన భక్తసరతంత్రుడు ఈతని యార్తిని దీర్పకుండునా ? యాతని భక్తిపుటమందిన మేలిమి బంగారమువలె విశుద్ధమై పరిపక్వత నందగనే స్వామి యాతనికి సందర్శనభాగ్య మిచ్చి సంతుష్టునిచేసెను. ఇది యిందలి పరమార్థతత్త్వము. ఇందు ఆతని రూపమున విలపించినది, పలవించినది త్యాగయ్యగారేనని వేరే నుడువనక్కఱలేదు.

"అందుండక వేగవచ్చెదనని, నాపై నానబెట్టి పోరా
మందరధర నీవాప్తులతోగూడి మఱచితే ఏమిసేతునే॥

చ॥ కనకవలెనను వేళలేకున్న గన్నరుకాలువగా బాఱునే

— — — — — — —

చ॥ పరమభక్తియు నాప్రాయములెల్ల దనుజులపాలు గాబోనానే
వరదశ్రీ త్యాగరాజార్చిత పదయుగ, వారిధి ముందరనే ॥అం॥

అను కీర్తనమున "మఱల వచ్చెదనని చెప్పి స్వామి వెడలి

పోగా ప్రహ్లాదుడార్తితో విలపించుట యిందుపవర్ణితమైనది. తుది చరణమున "నీవు రాకున్న పరమభక్తియు నాప్రాయములెల్ల దనుజుల పాలౌను" అట్లు గాకుండుటకైన నాకు నీ సందర్శనభాగ్య మొసంగి పవిత్రీకృతుని గావింపవా ? యని వేడుకొనుటయు గాననగును. 'ఎట్లు కనుగొందునో శ్రీహరిని నే' నను కీర్తనమున 'మలయని మద మున దెలియకుంటిని గాని, యలనాడే సదయుని ననుసరించక పోతినే! యని వగజెందెను. తుదకు స్వామి సాక్షాత్కరించి తనను కౌగలించు కొనగా "ఏనాటి నోముఫలమో ఏదానబలమో శ్రీనాధబ్రహ్మకైన నీదు సేవ దొరకునా ? తనకు గలిగెను ॥ఏ॥

చ॥ ఆదిదేవప్రాణనాథ నాడంకముననుంచి పూజింప తన ॥ కే॥

యని బ్రహ్మానందమున, దనిసెను. నృసింహస్వామి భక్తుని భక్తికి ప్రీతుడై "అడుగు వరములనిచ్చెదను, అడుగడుగునకు నిన్నే తలచుచున్నాను. అద్భుతమైన భక్తికి సొక్కినాను-

చ॥ ధనకనకముల నెన్నైననీకు.... ॥అ॥

అని వరము లడుగుమనగా ప్రహ్లాదుడు నీ భక్తిసామ్రాజ్యము దక్క వేరొండు వలదని ఐహిక భోగములను నిరాకరించెను. ఇట్లున్నదీ ప్రబంధము.

## నౌకా విజయయాత్ర

ఇక నౌకావిజయయాత్ర యందలి విశేషములనారయుదము. ఇది యక్షగానము.

ఒకనాడు గోపికలు శ్రీ కృష్ణుని దీసికొని వినోదార్థము నౌకా విహారమున కేగిరి. అంత శ్రీకృష్ణుడు తమ వశమాయెననియు తమతో సాటివారు లేరనియు వారు గర్వించిరి. నావ యమున నట్టునడిమికి

చేరఁగానే వారికి గర్వభంగము చేయదలఁచి లీలామానుష విగ్రహుం డైన శ్రీకృష్ణపరమాత్మ నావకొక రంధ్రమును గల్పించెను. అంతట నదిలోని నీరు మెలమెల్లగా నావలోనికి జొచ్చి నావ మునిగిపోవునను భయము కలిగెను. అంత శ్రీకృష్ణుడు గోపికలతో మీమీ వస్త్రముల నూడ్చి రంధ్రమును గప్పుడని సలహానిచ్చెను. వారు ముందుగ సందే హించియు చేయునది లేక రైకలూడ్చి యడ్డువెట్టిరి. కృష్ణ మాయచే అందులకును నది యాగకపోవునప్పటికి చీరెలు విప్పి యడ్డువెట్టవలసిన దిగా శ్రీకృష్ణుడు సూచించెను. గోపికలాపనిసేయుటకు కడులజ్జించియు చేయునది లేక తుదకు చీరెలూడ్చిరి. అంత రంధ్రము మాయమైనది. ఇది ఇందలి కథ.

ఇందు సంభోగశృంగార మతిమాత్రముగా వర్ణింపబడినది. గోపికలు కొందఱొకచో గూడి కృష్ణునితోగూడ నౌకా విహారయాత్ర సల్పవలెనని ముచ్చటపడి, "శ్రీకృష్ణుడు చిన్నవాడే ఇంతమంది స్త్రీల మతనిని గొంపోయి మఱల భద్రముగ నిల్లు సేర్పగలమా ! ఏమైన ప్రమాదము జరిగిన నారడియై తలవంపులగునే" యని తమలోదాము చర్చించుకొనిరట :-

"ఆడువారమెల్ల గూడి మనమాడుదాము హరిని వేడి

చ॥ కమలనేత్రుని బాసి సుఖమా, ఓడ గట్టుజేర్ప మనతరమా॥ఆ॥

చ॥ పసిబిడ్డ గాదటనమ్మా వీడు భయపడునో తెలియదమ్మ
తల్లితోడి చాడిబల్కుదురే మన తలలువంపింప దూరుదురే

చ॥ యువతులార మీలోనే మీరు యోచింప ప్రొద్దుపొయ్యాని

చ॥ చాలుచాలిటురారమ్మ ఓడ సలిలమందు ద్రోయరమ్మ"

అని చర్చించియు నెట్టకేలకు కృష్ణునితోగూడి వెడలిరి.

తరువాత నావలో గోపికలు తమవంటి సామాన్య స్త్రీలకు కృష్ణునంతటి మహానుభావుడు వశుడై పోయెనని

"ఎవరు మనకు సమానమిలలో నింతులార నేడు

.... .... .... .... ....

... ... .... ... .... .... ... గో

కులమున త్యాగరాజనుతుడు మనవలల దగిలిపోయె ॥ఎ॥

ఇంక మనలమించువారు లేరని విఱ్ఱవీఁగి పోయిరి.

కపటనాటక సూత్రధారియగు కృష్ణుడు మందహాసము సేయుచు "మున్ముందు బ్రహ్మాండ నాయకుడనగు నన్ను ఆడువారము తీసికొని రక్షించగలమా యని సందియమందిరి. తర్వాత విశ్వేశ్వరుడనైన నేను తమవలలో చిక్కితినని గర్వించుచుండిరే. ఆహా వీరియహంభావ మేమి ? అజ్ఞానమేమి ? వీరికొక గుణపాఠము నేర్పవలెనేయని యాలోచించెను. ఆలోచించి పెనుతుఫాను గల్పించి యందు నావకు బెజ్జము పడునట్లు గావించెను. ఇక యా గోపికల తత్తరము బిత్తరము చెప్పదరము గాదు. ఇక స్త్రీ సహజమగు తొందరపాటుతో, గందరగోళపడి

"అల్లకల్లోలమాయెనమ్మ యమునాదేవి మా
యార్తులెల్ల దీర్పుమాయమ్మా...
మొల్లలచే బూజించి మ్రొక్కెదము బ్రోవుమమ్మ
మారుబారికి దాళలేక యీ రాజకుమారుని దెచ్చితిమిందాక
తారుమారాయె బ్రతుకు తత్తళించునదెందాక ॥అ॥
సొమ్ములెల్ల నీకొసగెదమమ్మా, యమునాదేవి యీ
సుముఖుని గట్టుజేర్పవమ్మ
యెమ్మెకానిని బలిమిని నేలదెచ్చితిమమ్మ ॥అ॥

అని పలువిధముల పరిదేవనము సేయసాగిరి. కొంటెకృష్ణమ్మ నవ్వుచు రవికెల దీసి రంధ్రమున కడ్డుపెట్టుడని సలహానిచ్చెను. సిగ్గు పడియు వారు కడకట్లే యొనర్చిరి. కృష్ణమాయచే నా యత్నము వృథా యయ్యెను. అంత మఱలాతడు చీరలూడ్చి యడ్డుపెట్టుడని సలహా నిచ్చెను. అంత గోపికలకు కృష్ణునకు నీరీతిని సంభాషణము జరిగెను.

"ఇందుకేమి సేతుమమ్మ కృష్ణుడెంతో మాటలాడెనమ్మ
మగువలంటె ఇంతవాదా కృష్ణ మానమే ప్రాణముగాదా

కృ॥ గుసగుసలందేమివచ్చు ఇప్పుడుసురుంటే ఊరుబోవచ్చు
గో॥ వనితలగని ఎవ్వరైనా కృష్ణా వంచనగా బల్కదగునా
కృ॥ హఠముసేయ వేళగాదు ఆత్మహత్యగాని వేరులేదు ॥ఇం॥
గో॥ నగ్నముగా నిల్వవశమా కృష్ణ నలుగురిలో నీకు యశమా ,,
కృ॥ నామాటలు విని మీరువేగ నన్నుగట్టుజేర్చబోనీరు ,,

అని కృష్ణుడు నిష్ఠురములాడెను. అంతట గోపికలు తమ వస్త్రములూడ్చి బెజ్జమునకడ్డువెట్టిరి. బెజ్జము గప్పవడినది. నీరు కట్టినది. శ్రీకృష్ణపరమాత్మ తన దివ్యాకృతిని జూపి వారిని కరుణించెను. సంతుష్టాంతరంగలై వారెల్లఱును భద్రముగ నిండ్లుజేరిరి. ఈ రమణీయకథానకమును తన దేశీయరచనచే మఱియు నెంత రమణీయముగా చిత్రించెనో త్యాగయ్య కాంచితిరేకద. యక్షగానమగుట నిందు పద్యములు వచనములు నన్నియు నున్నవి.

ఇట్లు పలువిధములగు రచనా సామర్థ్యములు కల సర్వజ్ఞుడీ మనీషి. దీనిలో కడపటి "మాకులమున కిహపరమొసగిన" అను మంగళహారతి తెలుగునాట మిక్కిలి ప్రసిద్ధమైనది.

ఈ సర్వంకష ప్రజ్ఞావిలాసునకు వెనుక ఈ మార్గముల ననుసరించి రచన లొనర్చిన మహనీయులలో శ్యామశాస్త్రియు, ముద్దుస్వామి దీక్షితులును ప్రధానులు. సంగీత త్రిమూర్తులలో త్యాగరాజస్వామి తరువాతివారు వీరిర్వురే.

## శ్యామశాస్త్రి

సంగీత త్రిరత్నములలో నొకరగు శ్యామశాస్త్రి 1763వ సంవత్సర ప్రాంతమున తంజావూరు జిల్లాలోని తిరువారూరులోనే జన్మించిరి. వీరు 'శ్యామకృష్ణ' యను ముద్రతో పెక్కు కృతులు రచించిరి. మధురమీనాక్షిపై రచించిన నవరత్నమాలికలు కడుహృద్యమైనవి. రచన కదళీపాకము. ఆనందభైరవిలో వీరి కృతులు పెక్కులు కానవచ్చుచున్నవి. ప్రసిద్ధ వాగ్గేయకారులైన వీరి రచనలును తెలుగునాట మిక్కిలి ప్రచారమున నున్నవి.

మధురమీనాక్షిపై రచించిన నవరత్నమాలికలలో మాధుర్యమునకు కడుప్రసిద్ధివహించిన 'పున్నాగవరాళి' లోని కీర్తన

"కనకశైల విహారిణి, కామకోటి బాలే సుశీలే ॥క॥

అ.ప॥ వనజభవ హరినుతే, దేవీ, అంబా
హిమగిరిజే లలితే అంబా
వనిత మాం పరిపాలయ – శంకర వనితే
సతి మహా త్రిపురసుందరి ॥క॥

చ॥ శ్యామలాంబికే భవాబ్ధితరణే
శ్యామకృష్ణ పరిపాలితజననీ

కామితార్థ ఫలదాయకీ, కామాక్షీ
సకలలోక జననీ ॥క॥

సాంస్కృతికోక్తి సన్నుతములై మధురసములు చిప్పిలుచుండు నిట్టి కీర్తనలు వీరివి పెక్కులు కలవు ఇందు శాస్త్రీయ లక్షణములగు గమకాదులకును, లాలిత్యమునకు సమప్రాధాన్య మీయబడినది. కీర్తనయందు "మాం పరిపాలయ" అను క్రియావచనము తప్ప తక్కినవన్నియు సంబోధనములే. అయిన కేవల గమకములతో కూడిన ఈ రచనలయందు రాగస్వరూపము హెచ్చుగా ముద్రింపబడుచుండును. హరికేశ ముద్రతో కీర్తనలు రచించిన ముత్తయ్య భాగవతార్ యొక్క సావేరిలోని "మూలప్రకృతి రూపే" అను సంస్కృత కీర్తనయు నిట్టిదే. అయితే ఈ పై కీర్తనలోని సౌందర్య మా కీర్తనకు లేదు. కేవల సంబోధనముల పట్టికయే యైనను నీ కీర్తన యందలి కూర్పు, ముత్యాలకోన యందలి పేర్పు వలె మనోహరముగా నున్నది. శ్యామశాస్త్రి తెలుగున రచించిన కీర్తనలు నిట్టే కదళీపాక రమణీయము లైనవి. 'శంకరాభరణ' మందలి—

"సరోజదళనేత్రి. హిమగిరిపుత్రీనీ పదాంబుజములే సదా
నమ్మినానమ్మ శుభమిమ్మా శ్రీ మీనాక్షమ్మ ॥స॥

చ॥ సామగాన వినోద నీగుణధామ 'శ్యామకృష్ణ'నుత
శుభ శ్యామలా దేవి నీవు గతిరతి కామకామ్యదకావవే నీవు ॥స॥

ఇదికాక 'దేవీ నీపాద' అను కాంభోజి కీర్తనయు, 'తల్లీ నిన్నే నెఱ నమ్మినాను' అను కళ్యాణి కీర్తనయు, 'మఱి వేరేగతి యెవ్వరమ్మా' అను ఆనందభైరవి కీర్తనయు వీరి యెన్నదగిన కీర్తనలుగా కాన్పించుచున్నవి. వీరు దేవీపాదభక్తులు. సాహిత్యమునకు తక్కువ ప్రాధాన్యమునిచ్చి హెచ్చుగా రాగమయస్వరూపములుగా కీర్తనలు రచించుట యీ కూర్పులలో కాననగును. ఉన్న సాహిత్యమైనను 'నిన్నే నెఱ

నమ్మినాను, నన్ను బ్రోవవే' ఇత్యాదికముగానే ఉండును. కాని వేరే భావింపవలసిన అర్థములేమియు నుండవు.

## ముద్దుస్వామి దీక్షితులు

వీరి తరువాత సంగీత త్రిమూర్తులలో నొకరైన ముద్దుస్వామి దీక్షితుల వ్యవసాయము పేర్కొనదగినది. వీరి రచన లన్నియు హెచ్చుగా సంస్కృతభాషా గ్రథితములు. ద్రావిడాంధ్రములలో కూడ కలవు. శైలి కఠినమయ్యెను బహు రమణీయమైనది. వీరివి లెక్కకు మిక్కిలియగు కృతులు గలవు.

తరంగిణి రాగము నందలి "మాయే, త్వం యాహి మాంపాహి తుంగాహిమా" అను కీర్తనయు నింకను 'గురుగుహ' ముద్రతో నున్న పెక్కు సంస్కృత కీర్తనలును వీరివే. వీరు పెక్కు దైవతములపై కృతులు రచించిరి. కృతులను ప్రారంభించుచు ప్రప్రథమమున పాఠముచెప్పు "శ్రీ గణనాథంభజరే" అను ఈ శమగోహరి కీర్తన వీరిదే. తెలుగు కీర్తనలు వాడుకలో లేవు.

## సుబ్బరామశాస్త్రి

1803–1862 వత్సరములలోని వాడు. శ్యామశాస్త్రిగారి ద్వితీయ పుత్త్రుడు. వీరు తమ అన్నికీర్తనలను స్వరసాహిత్యములతో గాని, మధ్యమకాల సాహిత్యముతోగాని రచించిరి. వీరిది కుమార ముద్ర.

'ముఖారి' యందలి
"ఏమని నే నీ మహిమ దెలుపుదునమ్మ ..."
సామజ గమన, సారస లోచన ॥ఏ॥

ముక్తాయిస్వరం రాకేన్దువదన వినుమిక నీ సరిగ దైవముగాన
పదాబ్దముల సదా వినుతిపలిపెద"

ఇది యొకస్వరసాహిత్యకీర్తన. స్వరసాహిత్య కీర్తనఅనగా కీర్తనలో పల్లవి, అనుపల్లవుల రచనమైనవెనుక కొంత గమకముతో కూడిన స్వరము రచింతురు. ఆవెనుక చరణములరచనయు, మఱల తుదియందు స్వరరచనయు జరుగును. త్యాగయ్య రచించిన 'అఠాణా' లోని 'అనుపమ గుణాంబుధియని నిన్ను నెఱనమ్మి అనుసరించిన వాఢనయ్య ॥అ॥ ఈ కీర్తనలోని చిట్టస్వరము :-

సరిసనిసని పదపమ _ పదపమ గమరిస
నిసరిస మరిపమ నిప - మపనిప సనిరిస నిగ
మరిమస రినిరిస నిప - సనిసప దమదప మరి
గగ్గరిసరి మపమపని - సనిరిసనిస నిపదని ॥స॥

గమనింపదగినది. త్యాగయ్య తర్వాత నిట్టే స్వరమును కూడచేర్చి పెక్కురు కీర్తనలు వ్రాసిరి. ఇప్పుడు పైన సూచించిన సుబ్బరామ శాస్త్రి వ్రాసిన పై కీర్తనయందు ముక్తాయిస్వరమును అనుపల్లవి తర్వాత రచించి దానికిని సాహిత్యము వ్రాయుటయే స్వరసాహిత్య కీర్తనల యందలి విశేషలక్షణము.

ఇక మధ్యమకాల సాహిత్యమనగా కీర్తనను విలంబకాలమున నడుపుచు అను పల్లవి తర్వాత మధ్యమ కాలమున స్వరము వేసి సాహిత్యమును కూడ రచించుట. ఈ స్వరమునకు, సాహిత్యమునకును సంగతులుండవు.

'రీతిగౌళ' యందలి 'జననీ నినువినా దిక్కెవరమ్మా' అను కీర్తనయు, యదుకుల కాంభోజి యందలి 'నిన్ను సేవించిన' అను ప్రసిద్ధ కీర్తనయు వీరివే. తండ్రికి తగిన కుమారుడీయన.

## పట్నం సుబ్రహ్మణ్యం అయ్యర్

1845 మొదలు 1902 వఱకు 'వేంకటేశ్వర' ముద్రతో వీరు రచించిన కీర్తనలు శతసంఖ్యలయందున్నవి. కేవల కృతులేకాక తాన వర్ణములు. జావళీలు, తిల్లానాలు మున్నగునవి కూడ రచించిరి. తెలుగు, అరవము. సంస్కృతములందును వీరి రచనలు కలవు. వీరి కీర్తనలను గూర్చి వ్రాయుటకు ముందు తిల్లానాను గూర్చి యొక్కింత తెలిసికొందము. సంగీతము శ్రుతి, రాగ, తాళ, స్వర, భావాన్వితమైనది. తాళము – లయ – సంగీతమునకు తండ్రిని బోలినవి. "శ్రుతిర్మాతా, లయంపితా" యని శాస్త్రోక్తి అట్టి తాళమును నేర్పుటకు ప్రాధాన్యము నిచ్చు శృంగార సాహిత్యముతో రచించినవి 'తిల్లానా' లందురు. 'ఫరోజు' రాగమునందలి "నాదీందీంత, తనదీం, తోంతదర, తకిటధీం, తరికిటతక॥ నాధిరికిట, తకుతోం దరికిటతక ॥నా॥

"సుదతి నీకుతగిన చిన్నది – సురతకేళికది తగియున్నదిర
సదయుడైన వేంకటేశ నినుమది సరసున రమ్మనెరా,
సమయమిదె
నాదరదీం, తొందరదీ, తధియన, రధీంత........."

తిల్లానా లిట్లుండును. తిల్లానా లన్నిటియందును, నాయికా నాయక గత-శృగార వర్ణన సాహిత్యమే యుండును. ఇవికాక 'కేదార' యందలి సమయమిదే' అనునదియు, 'కళ్యాణి' యందలి "నిజదాస వరదా" అనునదియు 'భైరవి' యందలి "నీపాదములే" అను కీర్తనయు వీరివే.

'సింధుమందారము' నందలి
"కరుణించుటకిదే సమయమయ్యా,
కరిరక్షక నాకలి దీర్చుమయ్యా,
ధరలో నీవంటి దైవము లేడనీ
పరమానందముతో భజియించుచుంటినయ్యా" అను కీర్తనయు,

"షణ్ముఖప్రియ" లోని "మరి దిక్కెవరయ్యా రామ"
అను కీర్తనయు

'మలయమారుతము' నందలి
జన్మమెందుకు భక్తిలేని నర
జన్మమెల్ల భూభారమే కదా ॥జ॥

చ॥ మన్మథాంధకారమగు చీకటిలో
మఱిమఱి దూరే మహిలోన బుట్టి ॥జ॥
ను కీర్తనయు

'సౌరాష్ట్రి' యందలి-
"నినుజూచి ధన్యుడైతి నీరజనేత్ర,
వనజాసనాది వందితచరణ
వనజనాభ, దేవాదిదేవ ॥ని॥

చ॥ సకలలోకాధార, సచ్చిదాకార
సకల జీవేశ్వర, సర్వేశ్వర
సకలపాపహార, సాధుహృదయవిహార
సకల వరదాయక, శ్రీ వేంకటేశ॥
అను కీర్తనయు మిక్కిలి ప్రసిద్ధములు.

వీరి సాహిత్యములో చెప్పదగినంత విశేషములు లేకున్నను, ఆహ్లాద గుణము కల సంగీతధార మాత్రము ప్రశస్తముగ నుండి మనస్సునకు హాయి గొల్పుచుండును.

ఇంక వీరి వర్ణముల నొకింత యారసెదము. సంగీతాభ్యాసము చేయుటకై ఏర్పఱుపబడిన క్రమసాధనములలో వర్ణము కృతికి ముందుది. స్వరము, జంటస్వరము. అలంకారములు 35 తాళభేదము లను నేర్పుట కుద్దేశింపబడినవి. గీతములు సాహిత్యారంభము కలవి. స్వరజతులు– రాగచ్ఛాయ నొకింత వికాసపఱచి సంగీతసాహిత్యము లతో ప్రధాన పరిచయము కల్గించునవి, వర్ణము– రాగము యొక్క పూర్తి విస్ఫూర్తిని, ఆ రాగము నందలి రీవి, దర్పము, కల, స్వర ప్రస్తార, రాగాలాప పద్ధతిని తెలుపునది. కీర్తన – సంగీతార్ణవ మందలి అమృతభాండము. సంగీత కల్పద్రుమముననిండార బండిన ఫలము. ఇవి అభ్యాసక్రమమున నధిరోహింపవలసిన అంతరువులు.

వర్ణములను రచించిన వాగ్గేయకారులలో పట్నం సుబ్రహ్మ ణ్యయ్యగారు అగ్రేసరులు. కేవల "రాగసుధారసపానము చేసిరంజిల్లు" మనః ప్రవృత్తికల త్యాగయ్యగారిట్టి పరీక్షల కొఱకైన రచనలలో మనస్సు నిడలేదు. కాని సుబ్రహ్మణ్యయ్యగారు మొదలైన మహాను భావులు కొందఱు సాధకుల కొఱకై యిట్టి శ్రమమును, శ్రమమనక స్వీకరించి శిష్యులను ధన్యుల నొనర్చిరి.

## వీణ కుప్పయ్య

త్యాగయ్య శిష్యుడై, త్యాగరాయలకు పిదప వారి విజ్ఞాన వారసత్వమును నిలిపిన ఘనుడై, త్యాగయ్యకు దగిన శిష్యులనిపించు కున్న శిష్యులలో వీణ కుప్పయ్యగారు ప్రముఖులు. త్యాగయ్యగారికడ

ఎందఱో శిష్యులు గానవిద్య నభ్యసించిరి. కాని త్యాగయ ప్రతిష్ఠను నిలువబెట్టుచు 'వాగ్గేయకారు' లైనవారు మాత్రము, వీరేనేమో యనిపించును. అంతియకాదు మిగులరంజకమగు రచన, గానమును నేర్చినవారని ఆనాట వాసికెక్కిరి. చెన్నైనగర సమీపమున నున్న "తిరువత్తియూరు" వీరి నివాసస్థానము. శ్రీ త్యాగరాయ సద్గురులు క్షేత్రయాత్ర వెడలుచు శిష్యుని కోరికపై నీ గ్రామమునకు విచ్చేసి యట శిష్యునింట వారము రోజులుండి అప్పటి మాతృదైవమగు 'త్రిపుర సుందరి'పై నైదు కీర్తనలు చెప్పెను. అవియే పంచరత్నముల కీర్తనల సందర్భమున ప్రస్తావించబడినవి. త్యాగయ్యా కింత కూర్చిన శిష్యుడైన కుప్పయ్యగారు తనయిష్టదైవతమగు వేణుగోపాల స్వామిపై "గోపాలదాస" ముద్రతో పెక్కుగుకీర్తనలను వీరచించిరి. అంతేకాక, వేంకటేశ్వర పంచరత్నములు కాళహస్తీశ్వర పంచరత్నములు అను సముదాయ కీర్తనలను రచించిరి.

"కానడ"లోని "జగదభిరామ", "హమీర్"లోని "రాదా నా మీద దయలేదా" 'బిలహరి'లోని 'ఇంత పరాఙ్ముఖమేలరా', 'జంపె, హుసేని' లోని 'కాళహస్తీశ' అనునవి వీరివే.

'కాంభోజి' యందలి-

"కొనియాడిన నాపై కోపమునేయమేర
నిన్నుమించిన దైవములేదని నిరంతరము నీకీర్తినెంతో ॥కొ॥
బాలుడౌ మార్కండేయుని భక్తికి సంతసిల్లి వేవేగమే
కాలుని నొకపాదమున దునిమి కరుణించితి వదిగాక ॥కొ॥

అను కీర్తన ప్రసిద్ధమైనది. త్యాగయ్యకు పిదప నింతమాత్రము సాహిత్యరచన చేసినవారిలో వీరొకరు. తక్కినవారు నామకీర్తనముతో తృప్తిపడి సాహిత్యరచన చేసియుండకుట గమనించినదే.

వీరు "దర్బారు, బేగడ" రాగములలో చెప్పదగిన వర్ణములు రచించిరి. బేగడ లోని

"ఇంతచలము సేయ, ఏమని తాళుదుర
అంతరంగుడని, మోవి, ఆనవచ్చితే నాతో
పంతమేలరా వేణుగోపాల దాసపరిపాల ॥ఇం॥

అను వర్ణము తెలుగు వారందఱును ఇష్టముతోడను, ప్రీతితోడను పాడుకొందురు.

## వాలాజీపేట వేంకటరమణ భాగవతారు

వీరి నివాసము వాలాజీపేట కావచ్చును. శ్రీ త్యాగరాయల నీయన వాలాజీపేటలో త్యాగయ్య శిష్యులైన వేంకటరమణభాగవతారు గారి యింట సందర్శించినట్లు చరిత్ర చెప్పుచున్నది. వీరిది సదాశివ ముద్ర. 'అఠాణా' లోని

"వాచామగోచరుండని నీ పాదములకు
వందన మొనరించితి, జగదీశ,
పార్థసారథి కరుణాపయోనిధి ॥వా॥

అను కీర్తనము మిక్కిల ఘౌడమైనది. ఇందు సాహిత్యముతో కూడిన చిట్టస్వరమును' : లదు. తెలుగునాట నిది ప్రచారము గల కీర్తన.

ఎంత నిడుపైన కీర్తనయయ్యు సాహిత్యమునందు విశేష భావములు లేవు.

హరికాంభోజి లోని "సాకేతనగరనాథ", అను కీర్తనయు, 'పరమాద్భుతమైన దేవదేవాది, పెద్దదేవుని అను కీర్తనలును ఇంక పెక్కు కీర్తనలును వీరివి కలవు.

## స్వాతి, తిరునాళ్ (1813-1847)

తిరువాన్కూరు భూపతియై రసజ్ఞశేఖరుడై, సంస్కృతాంధ్ర ద్రవిడ, మళయాళ, మహారాష్ట్రాది అష్టభాషలలో పెక్కు కీర్తనలు రచించిరి. వీరు తమ రచనలను పద్మనాభ ముద్రాంకిత మొనర్చిరి. తిరువాన్కూరు అనంత పద్మనాభస్వామి వారి యిష్టదైవము కదా! త్యాగయ్యవారి దర్శనము కోరి మహామాత్యులను వృత్తెంచినది వీరే. జన్మకు వీరు మలయాళదేశీయులు కాని తెలుగునందును కీర్తనల రచించియుండుటచే నిందు పేర్కొనవలసి వచ్చినది. ''పాహిపార్వతి'' అను సారభికీర్తన వీరిదే.

## శ్రీనివాసయ్యంగారు

మధుర తిరుచినాపల్లి నేలిన విజయరంగచొక్కనాథ నాయకుని కాలమున, ద్రావిడాంధ్ర భాషలలో వీరనేక కీర్తనలు రచించిరి. ఈయనది 'విజయగోపాల' ముద్ర.

'శుద్ధసావేరి' యందలి ''సామజవరదా'' 'కానడ'లోని ''నెఱ నమ్మితి'' అను కీర్తనలు ఈయనవి.

తెలుగునాట మిక్కిలి ప్రసిద్ధికెక్కిన కేదారగౌళ లోని
''సరగున పాలింప, సమయమిదేరా
సరియెవ్వరున్నారురా సరసిజదళనేత్ర ॥స॥
వరగుణ శేషాద్రి వరద వేంకటేశ్వరా''
అను కీర్తన మిక్కిలి దర్పముగా నడచినది.

## పల్లవి శేషయ్యర్

ఈతడు సేలం జిల్లా నెక్కుయిర్ నగర నివాసి. 'శేషయ్య' ముద్రతోడి కీర్తనలు ఈయనవి. 'ఖమాచ్' లోని "ఎదురుగా" అను కీర్తనయు, 'భైరవి'లోని "ఇక నన్నుబ్రోవ" మున్నగునవి ఈయన కీర్తనలు.

## పల్లవి గోపాలయ్యర్

ఈతడు శరభోజి ఆస్థాన పండితులు. అమరసింహ నరేంద్రుని సమకాలీనుడు. 'వేంకట' ముద్రతో రక్తిరాగములలో పెక్కు కీర్తనలు రచించెను.

'తోడి' లోని "అంబ నాదు విన్నపము" 'భైరవి'లోని "మహా త్రిపురసుందరి" అను కీర్తనయు, 'కాంభోజి'లోని 'హరిస్వరపరిపూర్ణ' అను కీర్తనయు ప్రసిద్ధములు.

"హరి, స్వరపరిపూర్ణ సనకాదిమునివినుతచరణ।
మహానుభావ। నను బ్రోవుమయ్య
దురితములెల్ల నెడబాపుదువనుచు బిరుదువహించిన
కరిరాజవరద, శ్రీ వేంకటరమణభవార్థితరణ ॥హ॥
నిరతియానందసదన, మందరోద్ధారణ
నిశిచరగణమదవిభంజన, త్రిభువనమోహన
దరహసితవదన, కుందరదన, దీనజనార్తిహరణ,
హరచాపవిఖండన, బ్రహ్మాదిసురవరహిత కరణ ॥హ॥

ఇది "దివ్యనామ సంకీర్తన" శాఖలోనికి చెందినదని పై సంబోధనములుచూచినవారికి ముందే తెలియగలదు.

## మైసూరు వాసుదేవాచారి

వాసుదేవ ముద్రతో వీరు రచించిన కీర్తనలు చాలా చక్కనివి. వీరు కృతిబ్రహ్మయగు శ్రీ త్యాగరాజస్వామి వారిని స్తుతించుచు సంస్కృతమున 'కళ్యాణి' రాగమున నొక గొప్ప కీర్తనను వ్రాసిరి.

"ఏగతి రచించినను సమకాలమువారలు మెచ్చరేకదా" యని చేమకూర వేంకటకవి యనినట్లు సజాతీయులగువారిమెప్పును బడయుట చాలా దుర్ఘట కార్యము. అట్టియెడ 'కృతిబ్రహ్మ' యగు త్యాగరాజ స్వామి, తోడి వాగ్గేయకారుడగు మైసూరు వాసుదేవాచారిచే పొగడ దొంటెను. ఈ కీర్తనయందు త్యాగయ్యగారి విశేషము లన్నియు సంపూర్ణముగ వర్ణింపబడినవి. "సకలలోక సంసేవిత సంగీత సాహిత్యము"లు కలవాడని పొగడదగిన నాదసుధానిధి త్యాగయ్య యొక్కడే. అంతేకాక ఖమాస్ రాగములోని అతిప్రసిద్ధమగు :

"బ్రోచేవారువరురా నినువినా రఘువరా నను॥
ఓ చతురాననాదివందిత నీకు పరాకేలనయ్య
నీ చరితము పొగడలేను నాచింతదీర్చి వరములిచ్చి వేగము॥

నీ కీర్తనను రచించినది వీరే.

త్యాగయ్యను గురుదేవునిగా భజించిన యీయనకు త్యాగయ్య రీతియు, పోకడయును సంపూర్ణముగా లభించినవి.

## రామ్నాడ్ శ్రీనివాసయ్య

రామ్నాడ్ శ్రీనివాసయ్యంగారి బేగడలోని "అనుదినమును గావుమయ్య, ఆదివేంకటేశ' ' అను కీర్తనయు ప్రసిద్ధమైనదే. ఇట్లే

కొన్నికొన్ని చక్కని కీర్తనలు రచించిన వాగ్గేయకారులు ఇంకెందఱో కలరు. వీరి కీర్తనలు జీవితములు అన్నియు మనకులభ్యముగాకున్నను తెలుగునాట ప్రచారములోనున్న కీర్తనల నెన్నింటినో ఈయన రచించి యున్నారు. కావున అట్టివారిని విడచుటధర్మమగును. వీరందఱును 19, 20 శతాబ్దులలోనివారు.

ప్రసిద్ధికెక్కిన 'మాయామాళవగౌళ'లో

''మాయాతీత స్వరూపిణి మమ్ము బ్రోవవమ్మా,
మా త్రిపురసుందరి, శంకరి, ॥మ॥
మాయామాళవ గౌళవదేశమున
మహిత యతులకెల్లను ఈశ్వరి

మధ్యమ ''కాయజునివైరి కందర్పబృహదీశ్వరి కృపసేయగలను
మాగురుగుహస్వామికినే దాసుడనై ॥మ॥

అను కీర్తనను ''అంబనీలాంబరి'' యను కీర్తనను రచించిన సుప్రసిద్ధులు వీరు.

వీరివి 'బృహదీశ్వరి' 'బృహన్నాయకి' ముద్రలు కల వీరు పొన్నయ్యపిళ్లె నామాంకితులు. ఈయన ఆధునికులే అయినను వీరిపై కీర్తన బాగుగా ప్రచారములో నున్నది. రచన యందలి సౌలభ్య గుణము దీనికి కారణము. 'గురుగుహ' స్వామిని తలంచినారేమి కారణమో.

ముత్తయ్య భాగవతార్ అనువారును హరికేశముద్రతో షణ్ముఖ ప్రియలోని ''వల్లీనాయక నీవేగతి'' అను సుప్రసిద్ధకీర్తనను రచించిరి. అంతేకాక 'విజయనాగరి'లోని 'విజయాంబికే' అను కీర్తనము వీరిదే.

మాతృభూతయ్య అనువారు ఆనందభైరవిలోని వాసికెక్కిన
"నీమది చల్లగ నను బ్రోచుట కేమమ్మా శంకరి
సోమశేఖరుని రాణివైన సుదతి మాయమ్మ త్రిపురసుందరి"
అను కీర్తనను, 'తోడి' రాగములోని "తరలిపోయ్యే సమయమున"
అను కీర్తనను విరచించిరి.

దేవీమీనాక్షి అను కళ్యాణి కీర్తనను రచించిన తర్చూరి సింగరాచార్యులోకరు కీర్తనకారులు. వీరిర్వురును దేవీభక్తులు.

నాటకురంజి రాగమున 'పరాకేల సరస్వతి' అను కీర్తనను రచించిన తిరుపతి నారాయణయ్య, నీలాంబరి రాగమున "శృంగార లహరే-శ్రితజన శుభకరే" అను కీర్తనను రచించిన లింగరాజును సుప్రసిద్ధులే.

వీరేకాక బాలస్వామి దీక్షితులు, వీరభద్రయ్య, కృష్ణస్వామయ్య, కుప్పుస్వామయ్య, కుమార యెట్టప్ప మహారాజుఅనయ్య, చెంగల్వ రాయశాస్త్రి, రామస్వామి శివన్, కుంద్రక్కుడి కృష్ణయ్య, పావనాశి శివయ్య, కరిగిరి రామయ్య, కవి కుంజరభారతి, చిన్ని కృష్ణదాసు, సరస్వతి శేషశాస్త్రులు, వేంకటేశ శాస్త్రులు, దొరస్వామి 'గర్భపురి' ముద్రతో వాసికెక్కి "రారా రామ, రవికులసోమ" అను కీర్తన రచించిన మున్నగువారెందఱో యీ కీర్తన వాఙ్మయకర్తలగపడుచున్నారు.

వీరుకాక ఈ వాగ్గేయకారుల సందర్భమున గొప్పకృషి చేసి రాగములకు లక్షణకీర్తనలు రచించిన గురుమూర్తిశాస్త్రివారి రచనలును, వారిసేవయును ఎంతోకృతజ్ఞతతో స్మరింపదగినది. మచ్చునకొక్కటి.

శహన రాగమును గూర్చి తల్లక్షణాదులు దెల్పుచు 'శహన' రాగమున వ్రాసిన కీర్తన.

"కంసాసురఖండన జయరే - మురగోపికాజార నవనీతచోర
యాదవాబ్ధిచంద్ర కృపాసాంద్ర, నరకాంతక
రుక్మిణీ, సత్యభామాదిలసిత వేణునాదాప్రియురే
మురసేవ్యపాహిమాం 'శానా' రాగం ॥కం॥

ఇట్లు వీరు లక్షణగీతములను సంస్కృతమున రచించిరి.

ఈ వాగ్గేయకారులలో కొందఱు ద్రావిడులున్నారు. కాని తెలుగు బాసలోని స్వభావ మాధుర్యమునకు ముగ్ధులై వారును తెలుంగున కీర్తనలను రచించిరి.

అంతేకాక నాయకరాజులు దక్షిణాపథమున నేల్బడి సాగించినది మొదలాంధ్ర మచ్చట సంపూర్ణ విహారము సల్పినది. సారస్వతము నందును నాయకరాజుల కాలమున మధుర, తంజపురము ఆశ్రయముగా అసంఖ్యాకములగు కావ్యము లచ్చట నుప్పతిల్లినవి. అచ్చటనే సంగీత కళయొక్క విశ్వస్వరూపమును ప్రత్యక్షమై యుండుట గమనార్హమైన విషయము. స్వభావముగనే మధురమైన యంధ్రభారతియందు సంగీత సార్వభౌముడగు త్యాగరాజస్వామి యవతరించి యనేక నూతన మార్గములనేర్పఱచి యాదర్శము చూపినవెనుక నంత ప్రజ్ఞతో కాకున్నను, నామార్గమును బట్టి కీర్తనల రచించి శారదాదేవికి దివ్యభూషలర్పించిన వారనేకులా దక్షిణాంధ్రమున జన్మించిరి.

పైన సూచించిన కడపటి వాగ్గేయకారుల విషయమై యింకను ఒండు రెండు మాటలు పలుకవలసియున్నది. త్యాగనార్యుని వలె నంత

ప్రతిభతో వీరెల్లరును కీర్తన సృష్టిని గావించిరని కాదు. ఆ మహా మహాని ప్రజ్ఞ అనితరసాధ్యమే. అయినను ఎవరికివారు తాము ఓపినంత కీర్తన భారతికి సేవ చేసినవారే. "రసాత్మకం వాక్యం కావ్యమ్మ"నునట్లు ఇందు కొందఱు కొద్ది కీర్తనలు రచించినవారే యైనను, వారి పరిశ్రమము మాత్రము మెచ్చదగినది. ఏలనందురా? ఆయా రచనములలో రాగరసరక్తిమలు ఏమాత్రమును వికసింపని దే వారి రచనలును, వారి నామములును పైకి వచ్చుటకే అవకాశము లేదు. నేను పైన సూచించిన అనేక ప్రసిద్ధ కీర్తనలలో తత్తద్రాగ రసముల సంచారము, ప్రతిబింబమును ప్రశంసాత్మకముగ కనబడు చున్నదనియే చెప్పవలెను. అట్టి నిర్వహణ మొనర్పగలిగిన వారే 'వాగ్గేయకారులు'గ పేర్కొనదగి యున్నారు. కావుననే, అట్టివారినే పైన సూచించితిని.

# ఆధునిక కీర్తనకారులు

పురాతన సాంప్రదాయసిద్ధమైన ఈ రచనాపద్ధతిలో కీర్తనలు రచించిన ఆధునికుల గూర్చి ప్రస్తావింపక ఈఅధ్యాయము సంపూర్ణము కాదు.

## హరి నాగభూషణము

వీరిలో 'వాగ్గేయకారరత్న' బిరుదము నందిన శ్రీ హరి నాగభూషణముగారు ప్రథములు.

శ్రీ హరి నాగభూషణముగారు మచిలీపట్టన వాస్తవ్యులు. ఈయన తండ్రిగారు శ్రీ హరి నరసింహంగారు శ్రీ నాగభూషణంగారు తారణ (1884) నామ సం॥రమున జన్మించిరి. వీరి తండ్రిగారగు నరసింహంగారు త్యాగరాయలశిష్యులగు పట్నం సుబ్రహ్మణ్యయ్యగారి శిష్యులు అగుట శ్రీ నాగభూషణము గారును త్యాగరాయల శిష్య ప్రశిష్య పరంపరలోని వారు. శ్రీ వారికి వారి తండ్రిగారే గురువులు.

వీరు బాల్యమున మూడవ సంవత్సరము నుండియే స్వరజ్ఞానము కలిగి కీర్తనలను పాడుచుండగా, తండ్రిగారు గ్రహించి వారిని కళాశాలయందు చేర్చి హూణవిద్య చెప్పించుచునే యింట సంగీతవిద్య నభ్యసింప జేసెడివారు. క్రమక్రమముగా వారు సంస్కృతాంధ్రముల యందు పండితులై కవిత్వము చెప్పు ప్రజ్ఞానిర్వాహకములార్జించి,

హూణమున పట్టభద్రులై, సంగీతమునను నపారపాండిత్యమును సంపాదించిరి. బందరు నోబుల్ కాలేజీలో ఈయనకి శ్రీ చె. వెంకట శాస్త్రివర్యులు గురువులై యుండిరి. అంతేకాక వీరు భాష్యాంత స్వాధ్యాయి ప్రస్థానత్రయ మభ్యసించి శాంతియొనర్చి సచ్ఛాత్రులకు గీతాభాష్యాదులను గఱపుచు ఆస్తిక సంపన్నులై, వైదికశిరోమణులై విశేషించి రామభక్తాగ్రేసరులై ఉదారగృహమేధియై "సంగీతసాహిత్య పారీణ, వేదాంతభాష్యభావనాపరాయణ" అను నన్వర్థ బిరుదములంది సుఃజీవనము చేయుచు న్యాయశాస్త్రాభ్యాసమునకై మద్రపురికేగి యచట పెద్ద విద్వాంసుల బాణీలలో సంగీతశిక్ష నభివృద్ధి గావించు కొనుచు 1912 సం॥లో మద్రాసులో గొప్ప సమ్మానమంది శ్రీతచ్ఛారి చినసింగరాచార్యుల వారిచే స్వర్ణకంకణ బహూకృతిని బొంది స్వగ్రామమునకు తిరిగివచ్చిరి.

అంతటనుండి ఆంధ్ర ప్రాంతములయందును ముఖ్యముగా తమిళప్రాంతముల యందును వాయులీనము, గాత్రములయందు పాటకచేరీలు చేయుచు ధనవంతుల యొక్కయు విద్వాంసుల యొక్కయు మన్ననల నొందిరి. సాటిలేని విద్వాంసులుగా ఘన యశస్సు నార్జించిరి.

అటుపిమ్మట 1932వ సంవత్సరమున యావచ్చెన్న రాష్ట్ర పక్షమున నొక గొప్ప సమ్మానసభ నొనర్చి 'వాగ్గేయకారరత్న' అని బిరుద మొసంగి సువర్ణ శ్రీ త్యాగేశ పంచాయతనమును, సువర్ణ ఘంటాకంకణములను నిచ్చి వారిని బహూకరించిరి. ఇట్లు వారు స్వయముగా కీర్తనలు రచించుచు గానకళా పరిశ్రమ నొనర్చెడివారు. అవధానాది ప్రదర్శనముల నొనర్చుచు, హరికథాది కాలక్షేపముల నొనర్చుచు సాహిత్యపరిశ్రమ మొనర్చెడివారు. అంతేకాక తమకు ఆధ్యాత్మిక గురువులగు శంకరాచార్యుల వారికిని త్యాగరాజ స్వామి

వారికిని ఉత్సవములు చేయు తలంపున నేటేట పెద్ద పండువులుగ నీ యుత్సవ కార్యక్రమములను నిర్వహించెడువారు. ఆంధ్రదేశమున పుష్యబహుళ పంచమీ దివసమున శ్రీ త్యాగరాయ స్మరణోత్సవము జరుగుట వీరితోడనే ప్రారంభమైనదని చెప్పవచ్చును. అంతియకాక త్యాగరాయల జన్మస్థానమగు తిరువాయూరునకు గానసభలకై ప్రథమముగ అహ్వానింపబడి యచట గొప్పగొప్ప విద్వాంసుల మెప్పు వడసిన ప్రథమాంధ్రులు వీరేయనియు చెప్పవచ్చును.

అంతేకాక బరోడాలో జరిగిన అఖిలభారత సంగీత పరిషత్తునకు ఆంధ్రప్రతినిధిగా నేగి యచట తమ యపార గానకళా పాండిత్యముచే నాంధ్రుల కీర్తిప్రతిష్ఠల నినుమడింప జేసినవారైరి.

ఇంక వీరు స్వయముగా రచించిన హరికథలు, సద్గురుత్యాగరాజ స్వామి చరిత్ర, శ్రీ జగద్గురు శంకరస్వామి చరిత్ర (7 భాగములు) పాదుకా పట్టాభిషేకము, విభీషణ శరణాగతి మున్నగువానిని ఆంధ్ర దేశమునందు చెప్పుచు విజయనగరసంస్థానమున కేగి యచట శ్రీ మహారాణీవారి యొక్కయు, శ్రీ ఆదిభట్ల నారాయణ దాసుగారి యొక్కయు సమక్షమున చెప్పి వారి ప్రశంసల నందియుండుట మిక్కిలి ముఖ్యమగు విశేషాంశమై యున్నది.

ఇంత ఘనతర ప్రశస్తి నొందదగిన అత్యధిక ప్రజ్ఞావిశేషములు కల వీరు స్వయముగా రచించిన కీర్తనలను పరామర్శింతము :— గమనశ్రమ రాగమునందలి వీరి "నందగోపబాల" మున్నగు వర్ణములును, సంస్కృతాంధ్రములలో ననేక కీర్తనలును వీరివి కలవు. వీరిది 'త్యాగయోగ' ముద్ర. దీనినిబట్టియే ఈయనకు గల గురుభక్తి వెల్లడియగును.

అపూర్వ ప్రతిభావంతులైన వీరు 'మాధవప్రియ' అను నొక క్రొత్త రాగమును సృష్టించి యందొక సంస్కృత కీర్తనను గావించి యుండిరి. దాని మూర్ఛన యిట్లున్నది.

సరిగమ దనిసా లేక సరిగమ దపమదనిస
సనిదమ పమగరిస

ప॥ మాధవప్రియే మహిమాతిశయే
మంగళాలయే భావయేత్వాం ॥మా॥

అ.ప॥ సాధుజనావనే క్షేమవసనే
శశినిభ వదనే - సారసనయనే ॥మా॥

చ॥ క్షీరసాగరకుమారి - వరే
శ్రీరంగధామేశ్వరీ - పరే
మారజనని గంభీరభాషిణి
మానిత 'త్యాగయోగ' పరిపాలిని ॥మా॥

'కాంభోజి' రాగమునందలి యింకొక సంస్కృత కీర్తన :—

ప॥ పారోక్ష్యం నసహేరామ తవ

అ.ప॥ పారహీన సంసారార్ణవ
వారిమగ్నోహం శరణంభవ ॥పా॥

చ॥ త్యాగహీనో భోగహీనో
రాగభోగ - రోగధానః
త్యాగయోగార్పిత, శృతిమాన ॥పా॥

ఈ రెండు కీర్తనల యందును ప్రత్యేకముగా వివరింపవలసిన సాహిత్యవిశేషములు లేకుండుట సువిదితమే. మొదటి కీర్తనమంతయు నామసంకీర్తనమే. ద్వితీయ కీర్తనమునందు అపారసంసారార్ణవమున మునిగియున్న నాకు శరణమిమ్ము. నేను త్యాగభోగహీనుడను. రోగ

విధానుడను. అట్టి నేను నీ వియోగమును సహింపజాలను. నాకు శరణము కమ్మా" అను సంప్రార్థనము కానంబడును.

సరస సంగీత సాహిత్య పండితులైన శ్రీ పంతులుగారి రచనా సౌమనస్యమును, సరళతయు నిందు తెల్లముగ కానంబడును.

## శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ

వీరు ఆగర్భ శ్రీమంతులు, ఆగర్భ గీతజ్ఞులునైన మహాను భావులు. వయస్సున చిన్నవారైనను పాండిత్యానుభవమున చిన్నపుడే పెద్దతనము గడించినవారు. మూర్తిని చిన్నవారై కీర్తిని పెద్దవారైన వారు. వీరిది పండిత కుటుంబము తండ్రిగారైన శ్రీ మంగళంపల్లి పట్టాభిరామయ్యగారు మురళీవాదన నిపుణులు. తల్లిగారైన సూర్య కాంతమ్మగారు వీణాపై శారద్యము సంపాదించిన మానినీమణి. అంతే కాదు. సూర్యకాంతమ్మగారి పితృవంశమనాదిగా కవిత్వారాధనమున పేరుగాంచినవారు. ఇట్లు వంశపారంపరికమైన సంగీత సాహిత్య శ్రీల నోలలాడు సద్వంశమున బాలమురళీకృష్ణగారు ప్రమోదూత ఆషాఢశుద్ధ ఏకాదశి (6–7–1930) నాడు జననమందిరి. కాని వారు పుట్టిన పదునైదవ దినముననే మాతృవియోగము తటస్థించినందున పెత్తల్లిగారు ఆయనను బెంచిరి.

కన్ను తెఱచుటయే కళాక్షేత్రముననేమో యనునట్లు, ఉగ్గుబాల తోనే ఉచితజ్ఞానము వడసిరేమో యనునట్లు శ్రీ బాలమురళీకృష్ణ గారు బాల్యమునుండియు చక్కగా శ్రుతి లయబద్ధముగా పాటలు పాడెడు వారు. వారి యీ యాబాల్యప్రజ్ఞను గాంచి తండ్రిగారు తామే స్వయ ముగ కొన్నాళ్లు వారికి సంగీతగురువులై వారిని దిద్దిరి. అటువెనుక

గాయకసార్వభౌములు కీ.శే. పారుపల్లి రామకృష్ణయ్య పంతులు గారి కడ ఈయనకుచిత సంగీతశిక్షణ నిప్పించిరి.

ఆజన్మ సంగీత విద్వాంసుడైన బాలమురళీకృష్ణ నిమిత్త మాత్రముగ గురువులకడ సంగీతాభ్యాసము చేసి ముగించిరేకాని 1939 సంవత్సరముననే అనగా వారి తొమ్మిదవయేటనే సుసర్ల దక్షిణా మూర్తి శాస్త్రిగారి ఆరాధనోత్సవములలో అద్వితీయ ప్రతిభతో గాన సభ నొనర్చి కీ.శే. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారిచే బహూఘనముగా ఆశీర్వదింపబడిరి.

'నావలెనే వృద్ధుడవై, నావలెనే కీర్తిగాంచి నావలెనే శ్రీ
దేవీపదభక్తుడవై, భూవలయమున దిరుగుమోయి మురళీకృష్ణా॥

అను వారి యమోఘాశీర్వాదమే సత్యసమ్మతమై వారియెడ భాసించుచున్నది. అంతేకాక ఆనాటి సభలో శ్రీ కాశీ కృష్ణాచార్యులు గారు శ్రీ విమలానందభారతీ తీర్థస్వామిగారు మున్నగు ప్రముఖులు చాల సంతోషించి ఈయననాశీర్వదించిరి. ఆవెనుక పసితనముననే శ్రీ త్యాగరాజ సద్గురు పీఠమైన తిరువాయూరునకేగి అచట ఆ సన్నిధిని గానమొనర్చి యింకను పెక్కు దక్షిణభారత సంస్థలలో గానసభల నొనర్చి యావద్దక్షిణభారత ప్రశంసల నొందిరి. అటువెనుక ఉత్తరదేశ పర్యటనమును దిగ్విజయముగ నెఱవేర్చి ఆంధ్రదేశ సంచారమును పూర్తి కావించిరి. వీరెచట గానమొనర్చినను వేలాది ప్రజలు బాల్యముననే వీరికింత ప్రతిభ యెట్లు లభ్యమాయెనా యని ఆశ్చర్యపడు చుండెడివారు. ఇక ప్రశంసలమాట వేఱ తడుము నవసరము లేదు. ఆంధ్ర గానకళాపరిషత్తువారు "గానసుధాకర" బిరుదమిచ్చి మన్నించిరి. ఇట్లు కడుబాల్యమునుండియు లబ్ధప్రతిష్ఠులై వీరు సంగీతవిద్యాభివృద్ధి గావించుచుండిరి.

ఈయనకు కేవలము పాటయందే కాక, ఫిడేలు వాద్యము నందును, మృదంగ వాద్యమునందును గొప్ప నైపుణ్యమును కలదు. అంతేకాక మాతామహవంశాగతమగు కవిత్వ ప్రజ్ఞయును ఈయనకు వంశపారంపరికముగా నబ్బగా 72 మేళకర్త రాగములయందును సంపూర్ణముగా కీర్తనలు లేవనియు, లోపమును దీర్చదలంచి వీరు 'జనకరాగకృతిమంజరి' యను పేరున కీర్తనలు రచించిరి. వీరి కీర్తన రచనాపాటవమును శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ భమిడిపాటి అయ్యపశాస్త్రిగారు మున్నగు వారు పెక్కువిధముల ప్రశంసించియుండిరి.

ఇట్లు స్వయముగా గాయకులై, వాదకులై వాగ్గేయకారులై ఆంధ్ర సంగీతభారతీ సేవసేయుచున్న వీరి యోగ్యతను గమనించి 1952 విజయవాడ ఆలిండియా రేడియోలో వీరిని భారత ప్రభుత్వము వారు సంగీత పర్యవేక్షకుడుగా నియమించిరి. అటుతర్వాత 1953వ సంవత్సరమున ఆలిండియా రేడియో ఢిల్లీ కేంద్రమువారిచే నాహ్వానింపబడి నేషనల్ కార్యక్రమశాఖలో గానసభా కార్యక్రమ మీయబడి గౌరవింపబడిన ప్రథమాంధ్రులు వీరే. ఇట్టి ప్రథమావకాశము వీరికి లభించుట యొక ఘనతర కార్యమనవలెను. అంతేకాక ఆ వర్షముననే రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాదుగారిచే నాహ్వానింపబడి రాష్ట్రపతి భవనమున వారి సమక్షమున జేగీయమానముగ గానసభ మొనర్చి వారి మన్ననకు ప్రశంసలకు పాత్రులై వారిచే భారత రాష్ట్రపతి పతకముతో బహూకరింపబడిరి. దుర్లభమైన ఇట్టి సమ్మానము నొంది ఆంధ్రజాతికే వీరు ప్రఖ్యాతి నార్జించిరనియు సంగీతభారతి కొక యమూల్యాభరణమై వెలుగొందిరనియు చెప్పనగును.

ఇట్లు ఘన గౌరవమునంది సంగీతవిద్యాసేవలతో సహరహ మభ్యుదయశీలియైన వీరి సేవను గుర్తించి ప్రభుత్వము వీరికి ఉద్యో

గమనించి అభివృద్ధి నిచ్చి భారతదేశములోని రేడియో ముఖ్యకేంద్రము లలో నొకటైన మద్రాసు నిలయమునకు మార్చి ఒక సంగీత శాఖాధి కారిగా నియమించి వారి కితోధిక గానకళా సేవావకాశమును కల్గించిరి. ఈనడుమనే వీరిని ఆస్థానగాయకునిగ నియమించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము మాన్యతను ఆర్జించినది.

ఇట్టి కళామయ స్వరూపుని, ఈ పుంభావ గానసరస్వతిని శ్రీ ప్రయాగ వేంకటరత్నంగారి కుమారీరత్నము అన్నపూర్ణాదేవి యుద్వాహమాడి వీరి గార్హస్థ్య సుఖజీవనమున కాలంబమైగి.

వీరు కేవల జనకరాగములలోనేకాక తక్కిన రాగములయందును కీర్తన రచన గావించిరి. అంతేకాక ఇటీవల విజయవాడ ఆలిండియా రేడియో కేంద్రమువారు నిర్వహించిన 'లలితగీత' శాఖా నిర్వహణము వల్ల పెక్కు గేయములను వీరు రచించియుండిరి.

మృదుమధురమైన శారీరకసంపత్తి కలిగి సుఖమయముగ వీరు గొంతెత్తి పాడుచుండగా మిక్కిలి శ్రావ్యముగా నుండును.

పసిడికి తావి యబ్బినట్లు ఈ ఉత్తమగాయక ధర్మమునకు తోడుగా అబ్బిన కవితాధర్మముతో వీరు రచించిన కీర్తనల నీక్రింద యిచ్చుచున్నాను.

రాగవర్ధని – రూపకం

ప॥ గానసుధారసమే పరమానందదాయకమో మనసా ॥గా॥

అ॥ప॥ ఆ నారద హనుమదాదుల ననవరత ముపాసించే ॥గా॥

చ॥ గోవర్ధనగిరిపై గోపీమనోహరుడాలమేపుచు మురియుచు
గోగోపకులను ముగ్ధులజేయు 'మురళీ' ॥గా॥

సరళమైన సులభశైలి వీరిది.

ఆభోగి – ఆది

ప॥ వేగమె కావరావయ్యా, భోగిశయన, వైభోగరంగయ్యా ॥వే॥

అ.ప॥ జాగుసేయుట బాగుగ తోచెనా
ఏగతికాచెదో నాగతినీవే ॥వే॥

చ॥ చరణాశ్రిత జనపరిపక్వభక్తిని
పరీక్షచేసే సరళిమానుమా
మురళీరవసుధాపానము చేసే
పావనమూర్తివి పండరినాథా ॥వే॥

ఇంతేకాక తనకు గానకళాభ్యాసము చేయించిన గురుస్వామియైన కీ.శే. పారుపల్లి రామకృష్ణయ్యగారిపై కృతజ్ఞతాపూర్వకముగ రచించిన కీర్తన-

"మంగళదాయక, మామవసద్గురు
శ్రీకరతావక – క్షేత్రవశంకర ॥మం॥

అ.ప॥ సంగీతకళాసుధాసముద్ర
అంగీకృత గాయకసార్వభౌమ ॥మం॥

చ॥ సదా వినయవిధేయత యా
మదాహంకార విముఖతయా

ముదా, మురళీకృష్ణాది త్వదీయ
శిష్యకృత వినయాంజలింస్వీకురు ॥మం॥
గీర్వాణ వాణితో వీరు గురుస్తుతి నొనర్చి పితకార్యాణమీగిరి.

అంతేకాక సంగీతశాస్త్ర పాండిత్యమును దెలుపుచు రేవతిరాగమునందు 'గతిపంచకము'తో 'నుతి' యొనర్చిన కృతిని గాంచుడు:—

ప॥ మోహనవంశీ వాదనమధురిమ
వాహినిలో తనువు పులకితమైనది ॥మో॥

చ॥ మోహితులై గోపికా సమూహమెల్లమైమఱచిరి ॥మో॥

2) శ్రీహరి యిహబాధలెల్లను హరియించెనుహాయిగొల్పగ ॥మో॥

3) ప్రాణికోటులెల్ల వేణువాదనంబు
వీనుల వినబడగ వేగ దరి జేరిరి ॥మో॥

4) అకలంకనాదమయమై జగము పులకింప
అమర, దానవ, యక్షకిన్నెరాదులు మెచ్చ
నగజామనోహరుడు తాండవము సేయగ
మునులెల్ల ముదమంది వందనము సేయగ ॥మో॥

ఈ కీర్తనమును త్రిశ్ర, చతురశ్ర, మిశ్ర, ఖండాదికమైన పంచగతులకనువు పడునట్లు రచియించిరి.

ఈయన కొన్నికొన్ని కీర్తనలు కేవల నామ సంకీర్తనాత్మకముగను నుండుట కానంబడుచున్నది.

వయసున కడు పిన్నవారయ్యు అతిశయమెఱుగని వినయాదిక సద్గుణ సంపత్తితో నిరతిశయ గానకళాపాండితి మెఱయుచుండగా పరమేశ్వర భావసంపద పెంపుసొంపెసలారునట్లు గీతము లొనర్చి అవ్యయానంద గీతసుధామయముగ జీవితమును నిర్వాహక మొనర్చుచున్న వీరి జన్మము కడుధన్యము, సమ్మాన్యము. వీరిది "మురళీ" ముద్ర. దానికి తగినట్లు ఈయన రచనలలో మురళీ, వంశీరవప్రసక్తి హెచ్చుగా గానంబడును.

ఆధునికులలో మిగుల ప్రసిద్ధిచెందిన వాగ్గేయకారులలో శ్రీమాన్ తిరుమల నల్లాన్ చక్రవర్తుల నారాయణాచార్యుల వారొకరు ప్రసిద్ధులు.

వీరు గర్తపురీ నివాసులు. వీరు జాతిభేద సప్తతాళసహితశత రాగరత్నమాలికతో దేవదేవు నర్చించియుండిరి.

అపరూప రాగములలో ముప్పదియైదు తాళములలో వీరు నూరు కీర్తనలు రచించియుండిరి.

సింధురామక్రియ రాగము. పత్తితాళము చ. రూపకములోని కీర్తన. ఇది మాయామాళవ గౌళ రాగములో పుట్టినది.

"నీ పలుకులు విననాసకొని యున్నాడ పరమాత్మా

అ.వ॥ నీ పరమేశ్వర రూపముతో సత్పదము నొనంగు ॥నీ॥

చ॥ నాతండ్రీ నీకింత తామసమేలనయ్యా
నాతల్లి మహాలక్ష్మియైనా నీతో దెల్పలేదా
నీ తనయుడు మొరలిడగా దయగల్గదేమి నేతు నారాయణ ॥నీ॥
ఇది మధ్యమకాల కీర్తన.

వీరిది "నారాయణ" ముద్ర. వీరి కీర్తనల సాహిత్యమునందు చెప్పదగిన విశేషములు లేవు.

కాని వీరు సంగీతశాస్త్రమున మిక్కిలి విద్వాంసులగుట శాస్త్రమునందు మిక్కిలి పరిశ్రమ చేసి శ్రమసాధ్యములగు దుష్కర రచనము లొనర్చియుండిరి. కాని ఏలకో వీరి కీర్తనల కంత ప్రచారము లేకపోయినది.

ఒంగోలు తాలూకా ధేనువకొండ గ్రామవాసులగు శ్రీ ఓగిరాల వీరరాఘవశర్మగారొకరు పూర్వసాంప్రదాయమునకు చెందిన వాగ్గేయ కారుల పరంపరలోని వారై యున్నారు. వీరు వైదికసంపత్తి కల ఓగిరాలవారి కుటుంబమున బ్రహ్మశ్రీ శ్రీరామశాస్త్రిగారి కుమారులై జన్మించిరి. బాల్యమునుండియు సంగీతాధ్యయనాభిలాష కలవారై శ్రమలకోర్చి బందరు చేరి వాగ్గేయకారరత్న శ్రీ హరి నాగభూషణము గారికడ సంగీత విద్యాభ్యాసము గావించిరి. ఇంకను మద్రపురి యందలి చిట్టిపెద్ది రామచంద్రమూర్తిగారికడ కూడ గానము నభ్య సించిరి. బాల్యమునుండియు పరదేవతయగు గాయత్రి నభిమానాదరము లతో నుపాసించుచుండెడివారు. ఒకనాడు వారు భగవతీధ్యానపరులై యుండగా జగన్మోహిని రాగమునందలి "కావవే కమలాక్షి" అను కీర్తన యప్రయత్నముగా వారి జిహ్వాగ్రమునుండి వెల్వడినది. అది మొదలు వారు కడుంగడు సంతుష్టాంతరంగులై దేవిపై కీర్తనల రచింప మొదలిడిరి. వీరి యీ కీర్తనల సంపుటిని "దేవీగానసుధ" యను పేరున ప్రచురించియుండిరి.

ప్రప్రథమమున వీరి వాక్కునందవతరించిన కీర్తన :—

కావవే కమలాక్షి అంబ, కామితఫలదాయకీ నన్ను ॥కా॥
భావమలర నీ పదవనజములె బట్టి వేడితిని పావనిశంకరి ॥కా॥

చ॥ దీనులయెడ నీవనయము జూపిన
ఘనమగు కరుణ నే కావలెనంటిగా
తనయుని భవజలధి దాటింపను
కనికరమిడవే గౌరి రాఘవుని ॥కా॥

హరికాంభోజీ జన్యమైన 'వలజి' రాగమునందును 14వ మేళ కర్తయగు వకుళాభరణ రాగమునందును కీర్తనలు రచించిరి. ఇట్లే వీరు ఇంకను కొన్ని అపూర్వ రాగములయందును రచించిరి.

వీరి సాంప్రదాయము శ్రీ త్యాగేశాదులవలె పూర్వ సాంప్రదాయము. ఈయన శైలీపాకాదులును మిక్కిలి ప్రసన్నతా సుందరములు. అంతేకాక కీర్తన ఎత్తుగడలలో మంచి పనివాడితనము కాన్పించును.

"విడచి సుఖింపవె మనసా దుర్విషయాదులపై మోహము ॥వి॥

అ.ప॥ అడవి చరించుచు మృగసమ
నడతలపైగల తమకము ॥వి॥

చ॥ కామమోహ లోభముల కలకాల మీభవకాననమున
కామినీమణిపై ప్రేమకాంక్షలుడుగ నేరకమఱి
సోమరివయి బహుదుర్మోహముల జిక్కి సొలసిన నేను
కామరిపుసతీమణి ఎటుగాచును రాఘవునివలెను ॥వి॥

రచనయందలి తీరు, ఎత్తుగడయందలి సొంపును నింత శుచిర్భాయముగా నున్న కీర్తనలు వీరివి పెక్కులు కలవు.

వీరి ముద్ర 'రాఘవ' నామాంకితము. కీర్తనలన్నియు దేవీస్తుతి పరములని "దేవీగానసుధ" యను గ్రంథనామమే చెప్పక చెప్పు చున్నది.

చక్కని రచన, చిక్కని భావుకత కల వీరి యీ కీర్తనలను పెక్కురు గాయకులభిమానించి యాదరించిపాడుచుండుట కానవగును. ఆధునిక వాగ్గేయకారులైనను సమకాలీన గౌరవమందుట విశేషోక్తియే.

ఈ ప్రకరణముతో త్యాగయ్యతో మొదలిడిన 'కృతి' రచనాధ్యాయము ముగిసిన దనవచ్చును.



# పదములు - జావళీలు

పదము అనునది నాయికా నాయక భావముతో కూడిన శృంగార కీర్తన రచన అని మున్నే తెలిసికొంటిమి. అంధ్రుల కీర్తన వాఙ్మయమే పదరచనతో నారంభమైనదని కూడ ముందే తెలిసికొని యుంటిమి. శృంగార రసభావములతో కూడినవైనను భగవత్పరముగా శ్రీ అన్నమాచార్యులును, క్షేత్రయ్యయును రచించి పదరచనకు బీజావాపమొనర్చిరి. అటుపై దాసకూటమను పేరున మఱికొందఱీ పద రచననే కేవల లౌకిక శృంగారాత్మకముగ రచించి యుండిరనియు పూర్వమే తెలిపియుంటిమి.

ఇక నీ ప్రకరణమున వివరములారయుదము. పల్లవి, అను పల్లవి- చరణము అను అంగములు కలిగి కఠిన సంచారములును, ఎక్కువ సంగతులును నుండక, ఉదాత్తమైన నడకతో గంభీరముగా నుండి యుద్రేకపఱచు బాణీతో నుండు రచనలివి. భాష సామాన్య వ్యావహారిక భాషయే యైయుండును. చరణములన్నియు ఒకే ధాతువులో పాడదగినవిగా నుండును. అంతేకాక వీనిలోని సాహిత్యము ద్వంద్వార్థములతో నుండి భగవత్పరముగాను, లౌకికమగు నాయికా నాయక పరముగా నుండును.

ప్రప్రథమమున భగవత్పరముగా నున్నపుడు 'పదముల'ను పేరున నున్న రచనలే లౌకికములై నీచ శృంగారాత్మకముగా పరిణ

మించినపుడు 'జావళీ' లనబడినవి. మొత్తముపై వీని రెండిటి రచనయు నొకటియే.

ఈ శాఖయందు 'పద' శాఖయందు ప్రసిద్ధులైన వాగ్గేయకారులను కొందఱను గూర్చి ముందే వ్రాసియున్నను ఈ ప్రకరణమున మఱల వారిపేర్లు వ్రాయవలసియున్నది. పెద్దదాసరి, పరిమళరంగ, సారంగపాణి, కస్తూరిరంగ, ఘనం శీనయ్య, శోభనాద్రివారు, ఘట్టుపల్లి వారు, జటపల్లివారు, వేణంగివారు, ఇనుకొండవారు. వీరభద్రయ్య మున్నగువారు.

కురంజి రాగములోని ఘనం శీనయ్యగారి పదము :—
శివదీక్ష పరురాలనురా నే ॥శి॥
శీలామెంతైన విడువజాలనురా నే ॥శి॥
శివశివా గురూనాజ్ఞ మీరనుర నే
శ్రీవైష్ణవుడంటే చేరనురా నే ॥శి॥

చ॥ వడిగావచ్చి మఠము జొరకురా
శివార్చనవేళ తలుపు తీయనురా నే ॥శి॥

ఈ పదము మిక్కిలి అభినయ సాంప్రదాయము కలది. ఒప్పిదమైన గమకాదులతో నిది పాడదగిన పదము. కృతివెనుక కృతియంత ప్రసిద్ధత కల పదమిది.

కోసూరి రంగని 'సురటి'లోని "ఇందెందు" అను పదమును ప్రసిద్ధమైనదే.

మన్నారు రంగని. దర్బారులోని "మగవాడని" అనునొక పదమును ప్రఖ్యాతి వహించినదే.

ఇవికాక "దానిప్రాయము" అను సారంగపాణి పదమొకటి స్వరస్థాన పదముగా నున్నది.

జావళీల రచనలో కీర్తన వాగ్గేయకారులును న్నారు. ధర్మపురి సుబ్బరాయయ్యర్, పట్నము సుబ్రహ్మణ్యయ్యర్, పట్టాభి రామయ్య, రామ్నాడ్ శ్రీనివాసయ్యంగారు మొదలగువారు కూడ ప్రముఖ జావళీ రచయితలుగా నున్నారు.

ధర్మపురి సుబ్బరామయ్యగారి ముఖారిలోని జావళీ

"ఏమందునే ముద్దు బాలామణి చెలి ॥నిన్నే॥
ఏమని విన్నవింతునే ఓచెలి.... ....॥ఏ॥

చ॥ చెలియపల్కులు చెలువునకు దెల్పుదునే
చెలియమై మఱచితినే ఓచెలి ॥ఏ॥

చ॥ మునుననుగలసి మర్మము లెఱిఁగిన
శ్రీ ధర్మపురీశుడున్నాడే చెలి ॥ఏ॥

ఈ జావళీరచనలో రామ్నాడ్ శ్రీనివాసయ్యంగారు మిక్కిలి ప్రసిద్ధులు. హిందూస్థానీ కాఫీలోని జావళీ

సరసము లాడేటందుకు సమయమిది కాదురా నాసామి ॥స॥
విరసముతో మాయింటివారున్నారు
నిరసింతురు నన్ను కూడనివేళ నాతో ॥స॥

చ॥ నిగనిగని వెన్నెల గాయుచున్నది,
నిక్కముగ ఇటుజేసేదానికి

తగదూర ఈవీధిలో వారలు
తట్టున జూచి నవ్వి తిట్టుదురు ॥స॥

చ॥ ఏకాంతముగ నే నెఱిగిన సంగతి
ఎంతైనా బైటపడేది న్యాయమా
శ్రీకాంత నీకేల ఈ ఆసురము
శ్రీనివాస మరుబారి తాళనురా ॥స॥
కమాసులోని జావళీ
మరులుకొన్నది రామ — వినీమణి నీపై ॥మ॥

ఇట్లు చాలా ప్రసిద్ధికెక్కిన జావళీలు శ్రీనివాసయ్యంగారి
యున్నవి.

'పట్నం సుబ్రహ్మణ్యయ్య' గారింకను -
"అపుడుమనసు వద్దని నేనంటినిక
వాని, వాని జోలిసీకు చెలి ॥వ॥
తద్దయు మాటలాడుట నా............॥వ॥
అను జావళీలు కూడ నున్నవి.

ఇవికాక సామాన్యముగ పాడబడునవియు, సినిమాలలో కూ
ఉపయోగింపబడినవియు నైన జావళీలు కొన్ని యున్నవి.

"పిలిచిన బిగువటరా ఔరౌర ॥పి॥
చెలువలు తామే వలచివచ్చిన ॥పి॥
భళిరారాజా

చ॥ ఈనయగారము ఈ ఒయ్యారము
ఈ నవయౌవన మానగ నిను నే ॥పి॥

చ|| గాలుల తేలెను గాటపు మమతలు
నీలపు మబ్బుల నీడలు కదలెను.
అందెల రవళుల సందడి మరిమఱి
అందగాడ ! ఇటు తొందరసేయగ ||పి||

"వదలజాలరా నా వలపు దీరుపరారా నిన్ను ||వ||
మనసారా మరులు దీరా ఈసారి నిలచిపోరా ||వ||
చిరునగవాలికే నీమోము మఱలమఱల కననీరా
కళల నెఱుగు దొరవేరా, నిను,
కలియకలియ మనసౌరా||వ||
మురిపించి వలపుల మఱపించి
రతులను తేలించి కౌగలించుకోర ||వ||
నా కరువుదీర పరవసింతురా ||వ||

ఇంతేకాక 'గర్భపురి' ముద్రతో కీర్తనలు రచించిన కరూర్ దక్షిణామూర్తి యమునాకళ్యాణిలో వ్రాసిన

"అది నీపై మఱులుకొన్నదిరా"

అను జావళీయును మిగుల ప్రసిద్ధమైనదే.

'ఆనందభైరవి'లో మిక్కిలి ప్రసిద్ధమై, సర్వసామాన్యముగా ప్రతి గానసభయందును నృత్యకాలక్షేపముల యందును పాడబడుచు అభినయింపబడు జావళి—

మధురానగరిలో చల్లనమ్మబోదు దారివిడుము కృష్ణా ||మ||
మాపటివేళకు చల్లగావత్తును....

ఇదికాక మిక్కిలి ప్రచారములో నున్న

"మంచిదినము నేడే మహరాజుగారా రమ్మనవే ||మ||

అనునది క్షేత్రయ్య పదము.

పూరికళ్యాణిలోని

నీమాట లేమాయెనుర సామి బల్కార ॥నీ॥
ఏమేమో బోధించి, నన్నేమరజేసేవల ॥నీ॥

చ॥ చక్కని సామివలె చెక్కిలి నొక్కిరవ
ముక్కెర నీకిచ్చెనని టక్కులచే సొక్కించిన ॥నీ॥

చ॥ మాటిమాటికి మరునాటలాడ బిల్చుచు
పోటీలు నే పంపెనని తాటోటముతో నీటిన ॥నీ॥

చ॥ జాలముచేసి కలసె రతనాల జుమికీల
జత పంపెనన్ని తాలవసలోల ॥నీ॥

కానడ రాగములో "చారుమతి యుపచారము లేమిటికే" అనునదియును జావళీయే.

ఇట్లు పెక్కులు పదములు, జావళీలు కనబడుచున్నవి. కాని వీనికి నైతిక గురుత్వము లేకుండుటచే శిష్టులలో నివి వ్యవహారము నందజాలకపోవుటచే రానురాను నశించిపోయి యాయాకర్తలెవరో కూడ తెలియని పరిస్థితి ఏర్పడినది.

కాని యిప్పుడు మఱల పెద్దపెద్ద వంశపు బాలికలే నాట్యములు నేర్చుచుండుటచే నివి మఱల ఆనాట్య సందర్భముగా తలలెత్తుచున్నవి. కొన్ని సినిమా రంగములలో తలలెత్తుచున్నవి.

ఇక, ఆధునికులలో ప్రసిద్ధికెక్కినవారి జావళీ రచనలను గూర్చి ప్రస్తావించవలసి యున్నది.

1881వ సంవత్సరములో జన్మించి జాతీయభాషా రచనాపితా మహులని పేరొందిన కీ.శే. గురుజాడ అప్పారావు గారును నీలగిరి

పదములను పేర నిట్టి కీర్తన రచనను గావించి యుండిరి. అప్పారావు పంతులుగారు ముత్యాలసరములను పేర విశిష్టమైన గేయ రచనను గావించి నూత్న ఛందోనుసృతమగు కవితావాహినికి మళ్లగట్టి మార్గ దర్శకులైన మహానుభావులు. వారి ముత్యాలసరాలలోని భావములు సరిక్రొత్తవి. జాతీయభావ ప్రేరణముగా "దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అని ప్రప్రథమముగా ప్రబోధించిన జాతీయకవి యాయన. వారు వ్రాసిన 'లవణరాజుకల', 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ' మున్నగు ముత్యాలసరాలలోని సంస్కార భావములలోని తేజస్సునే కైకొని నేటివరకు కొందఱు యువకవులు తమ రచనలను పూరించుకొనుచున్నారు.

జానైన జాను తెనుగు రచనతో, జాతీయభాషా పరిమళము తొలుకు చక్కని రచనలు గల ఈ కవికోకిల వ్రాసిన 'నీలగిరి పదములు' అను పేరు గల శృంగార పదములును సరసభావపుష్టి కలిగి చదువరులకు సౌఖ్యము కల్గింపజాలినవిగా నున్నవి. ఈ శృంగార రసావిష్కరణమందు కూడ వారు నీచ శృంగారము పొంతబోక 'కొయ్యబొమ్మలను' దిగవిడిచి కోమలుల సొరు చూపుచు ఉదాత్త శృంగార రచనల నొనర్చిరి.

ప్రియునిచే విడువబడిన యొక ప్రేయసి తనతో తనప్రియు డాడిన బాసలను దలంచుకొని, చూపిన ఆసలను స్మరించుకొని వగల బొగులుచున్నది :-

అఠాణా – రూపకము

"నాటిమాట మఱచుట యే
నాటికైన మఱవ వశమా ? ॥నా॥

అ.ప॥ బోటి, ప్రాణమీవంటి వు
మ్మాటికి నిను విడనంటి ॥నా॥

చ॥ మాట మూట గట్టుకొని
పాటిదప్పితనుట నా పొర
పాటుగాగ మాటననే
పాటిర నీపాటి దొరకు ॥నా॥

చ॥ బ్రతుకునందు లేని స్థిరత
వెతకనేల భాష యందు
నతుకు వేష భాష కోడు
నతివలదే తప్పుగాక ॥నా॥

చ॥ సాటిలేదు నాకంటి వా
మాట నిజము నేడు గంటి
పాటికలదె నమ్మి భంగ
పాటు పడిన నడతకెందు ॥నా॥

“ఎప్పుడో నను మురిపించుచు చెప్పిన మాటల నింకను మూట గట్టుకొన్న నాబోటి యమాయకురాలిది తప్పుకాని, నీపాటి దొరకు మాట యనగానే పాటిలెమ్మ”ని నాయిక దెప్పుచున్నది. అంతేకాదు “నాతో సాటివారు లేరంటి వొకనాడు! ఆ మాటకు గల నిజమైన యర్థము నీనాడు కనుగొంటిని. ఔను ఇట్లు భంగపడుటలో నాతో సాటి యెవ్వరుందురు?” అని ఎంతో సహజముగ నాయిక తన విరహావస్థలో నాయకునుపాలంభ మొనర్చుట నీ కవివరుడు చక్కగా చిత్రించెను.

శంకరాభరణము నందలి యింకొక కీర్తనలో తన నాయికను చిత్తరువున చూచి చిత్తమర్పించి వలపోయు నాయకుని భావభేద మభి వర్ణింపబడినది. అంతేకాక నా మనస్సు నంతటిని నీవే కైకొంటివి. ఇక మనస్సులేని తనువుమాత్రము నాకేల? ఆ తనువును గూడ నీవే కైకొనుమని యా చిత్తరువు ముందు తలపడుటయు నిందు కాననగును.

చిత్తరువని చూడ చిత్తము గొంటి
చిత్తజు నపరంజి చిలుకవెవ్వతెవే ॥చి॥

అ.ప॥ వత్తువొ నామ్రోల వలరాజు వేడిన
మత్తకాశిని నీదు మనమైన నీగదె ॥చి॥

చ॥ ఇచ్చిపుచ్చుకొంట ఇలలోని మర్యాద
ముచ్చిలి మౌనము మెచ్చుదురటవే
వచ్చి చూచినంత వంచన చేయుదె
పచ్చి దొంగతనము పడతిరొపరువె ॥చి॥

చ॥ మనసులేని తనువు మఱియేలనే నాకు
చెనటి దీనికూడ-చేకొనగదవే
వానికి బదులొక్క వాక్కునేదైన
మానిని ఈపాటి మన్నింప జెల్లునె ॥చి॥

లలిత శృంగార రసాత్మకములై, తేటలగు మాటల సొంపులతో చిక్కని భావసంపదతో నీ మహాశయుని శృంగార రచనలు శ్రుతిరమ్యములైనవి.

సంఘసంస్కారపరులై వ్యభిచారాది దుష్టత్వ పైశాచిని పారద్రోలుటకై దీక్షవట్టి దానికొఱకై కన్యాశుల్కము వంటి యుత్తమ నాటక కళాసృష్టిని గావించిన ఈ సంఘసంస్కారి శృంగారాత్మకములను నేల వ్రాయవలసివచ్చెనో? అంతవఱకు నడచుచు వచ్చిన జావళీలలోని నీచశృంగార పరతకు రోసి ఉదాత్త శృంగార మన నిట్లుండవలెనని మచ్చు చూపుటకై వ్రాసియుండవలెను. అంతేకాక పురుషులు పరసతీరతులైన యెడల ఉత్తమ యిల్లాండ్ర మనస్సులెట్లు వేగిపోవునో చూపిన, అటులైనను మగవారి దుష్ట చిత్తవృత్తి మారుటకవకాశము కలుగునని యిట్టివి వ్రాసియుందురు.

ఇట్లే మహాకవివరేణ్యులై బృహద్గ్రంథ రచనను, తెలుగునాడు మున్నగు సంఘవిమర్శనాత్మకమగు సాధిక్షేప గ్రంథమును రచించిన వారును మహానటశేఖరులనియు. అభినయ విద్యాకుశలురనియు రసజ్ఞులనియు పేరుగాంచిన దాసు శ్రీరాములు గారును పదములు జావళీలును రచించిరి. వీరు స్వయముగ కొందఱు నట్టువరాంద్రకభినయ విద్యను కూడ నేర్పెడివారట. వీరి తండ్రిగారు దాసుకన్నయామాత్యులు. వీరు 1887వ వత్సరమున జననమందిరి. వీరిది పండిత కుటుంబము. విశేషించి వీరు కళాప్రియులు. కమ్మని కపురము వలె గుబాళించు కవిత్వశ్రీ సంపద చెలువార నంధ్రవిషయమున విద్వత్ప్రభువులుగ రసిక సార్వభౌములుగా ప్రథితి నందిన చల్లనిస్వామి యీ కళోదయుడు ! ఇక వీరి జావళీల నారయుదము :

'బేహగ్' లోని జావళీ

"మనసిచ్చి నాతో మాటాడవేమిరా ॥మనసిచ్చి॥
మనవి వినరాదా, మమత యింతలేదా
మునుపటి చెల్మికాదా మోదము కాదా ॥మ॥

చ॥ వినునేను చాలా విడనాడుటమెలా ?
చనువుంచుమీ చాలా జాలమిదేలా ॥మ॥

చ॥ వరదాసు శ్రీరామా వనసుగుణధామా
శరణు నన్నేలు ప్రేమ శ్యామాభిరామా ॥మ॥

ఇట్లు వీరు వేణుగోపాలస్వామి కంకితముగా తమ నామమును ముద్రగా చేర్చి పలుపదములు వ్రాసిరి.

'సావేరి'లో "ముంజేతికంకణమ్మున కద్దమేలనే" కన్నాడ రాగములోని "రమణిరో సముఖాన రాయబార మేమిటికి" మున్నగు కీర్తనలు వీరివి కొన్ని కడు ప్రసిద్ధములు. కొన్ని కీర్తనలలోని

సాహిత్యము మఱియు వెగటుగ నున్నది. నాయికా నాయకుల శృంగార రస సంబంధమైన విభావానుభావ, వ్యభిచారీభావ, సంచారీ భావముల తోను, తదనుగుణవర్తనులగు అష్ట నాయికానాయకాదుల స్వభావ వృత్త కథనముతోడను నీ శాఖాపదములు సంభోగ, విప్రలంభ శృంగారాత్మకములుగా నుండును. ఈ శ్రీరాములుగారి పదములలో ఈ యష్టవిధ నాయికాదుల లక్షణముల కుదాహరణములుగ రచించిన పదములు కలవు. వీరే యననేల శృంగారాత్మక పదవాఙ్మయకర్త లెల్లఱును చేయుపనియే యిది.

ఇంచుమించుగా నీ మహాకవికి సమకాలీను డనదగినవాడే 1891వ సంవత్సరమున జనించిన నాగినేని వేంకటకవి యనువారొకరు "జగన్మోహన పదములు" రచించిరి. ఇయ్యవి నాలుగు భాగములుగ నున్నవి.

మొదటిభాగము జావళీలు. రెండవభాగము బంతిపాటలు, నలుగు పాటలు మున్నగు పెండ్లిపాటలు. మూడవభాగము భక్తిపదములు. నాల్గవభాగము అద్వైత వాదాత్మకములగు తత్త్వములుగా నున్నవి.

"మదిరాక్షి కోరెను రారా సామిగా మా ॥మ॥
సదయుడవని కనుల జాలవలచెను ... ..." ఇటులున్నది.

రెండవ భాగములోని

"మంగళమని పాడరె - అంగనమణులార మీరు
సంగీతలోలునకు, శృంగారవతులార యుప్పొంగుచు ॥మం॥

అను మంగళహారతియు నింక కొన్ని తలుపుదగ్గఱ పాటలు, నలుగుపాటలు మున్నగునవి తెలుగుదేశమున ప్రచారములో నున్నవి. మూడవభాగము లోని కీర్తనలు కేవల నామసంకీర్తనలవలెనున్నవి.

ఇక నాల్గవ భాగములోని కీర్తనలు ఒండురెండు కొంచెము బాగున్నవి.

"నిరాకారమదియే అంతట నిండుకయున్నదదే పరమాత్మ
ఆదియంత్యములేనిదదే బయలై యున్నది పరమరహస్యము॥ని॥
అండపిండ బ్రహ్మాండమందున ఖండనగాక యఖండతేజమై
నిండి యెందు జూడ సందులేక చేతులకందరాని, పూర్ణము
నిరంజనము ॥ని॥

"దాపుననున్నది మోక్షం
మన చూపులో నున్నది చోద్యం ॥దా॥
కోపతాపములు కోరిక లనునది
రూపణగించి ఋషిసమరసులకు ॥దా॥

మున్నగు నీ కీర్తనలు తత్త్వములై యున్నవి.

మిక్కిలి సామాన్యమైన ఈ కవిత్వములలో వివరింపదగు సాహిత్యములుండవు. కీర్తనవాఙ్మయమున గల అయిదు విభాగముల కీర్తనలను వీరు రచించిరి. ఇష్టదేవతా ప్రార్థనాదికమైన కృతులు, జావళీలు, భక్తిగీతములు, పెండ్లిపాటలు, తత్త్వములుననునవి యివి.

ఇట్టీ యుగమున నిట్టి కీర్తనలు రచించిన వారు పెక్కురు కలరు. ఎవరి రచనల యందును నవ్యత కానరాదు. పదములు జావళీల లోని సాహిత్యభావములు వివరించుటకు తగినవి కానేకాదుగదా. ప్రతిభావ్యుత్పన్నతలు మిక్కిలి క్షీణించి ఏదోవారు చేసిరి. వీరు చేసిరి. మనమేల చేయరాదు ? అను నహమికతో రచించు రచనలలో అందును శృంగారరసమున నీచభావాభివ్యక్తికాక మఱియేమి ప్రతిబింబించును? అద్దాన రసహృదయము లెట్లు స్పందించును ?

ఇంత నైతిక పతనము కలిగిన ఈకాలమున గూడ ఆరని పరంజ్యోతివలె, తుఫానునందును ధీరతతో చుక్కాని విడువని మహా వీరునివలె, పతనము జెందిన జాతికి నల్పు వైతాళికగీతివోలె మహాకవి గురజాడ అప్పారాయడును, వారి రచనలును దేశకళ్యాణమున కెత్తిన దివ్యపతాకములై దీప్తినించినవి.

## నారాయణతీర్థుడు

ఆంధ్రదేశీయుడగు ఈ వాగ్గేయకారుడు, సంస్కృతమున తాను రచించిన 'కృష్ణలీలాతరంగిణి' అను గీతప్రబంధమువలన అఖిలభారత ఖ్యాతిని ఆర్జింపగలిగెను. ప్రపంచమునకంతకును ఇంత పెద్దదైన ఒపేరా గేయకృతి ఇంకొకటి లేదు. తెలుగునాట వీరి గీతములను 'తరంగముల'ను పేర పూర్వము పాడుచుండెడివారు. అందును గోపకిశోరుని బాల్యవృత్తవర్ణన మొనరించు తరంగములను హెచ్చుగా పాడెడివారు. అందును బాగా ప్రసిద్ధములైనవి :—

1) "కృష్ణంకలయసఖి సుందరంబాల ॥కృ॥
కృష్ణంగతవిషయ కృష్ణం, జగత్ప్రభో
విష్ణుంసురారి గణజిష్ణుంసదాబాల ॥కృ॥

చ॥ నృత్యం తమిహముహురత్యంత పరమిత
భృత్యానుకూల మఖిల సత్యం సదాబాల ॥కృష్ణం॥

2) కలయ యశోదే తవబాలం, వ్రజబాలక ఖేలనలోలం
అపహృత బహుతర నవనీతం – అనుపమ లీలా నటకృతం
కపట మానుషబాలక చరితం – కనకకందుకఖేలన నిరతం॥

చ॥పథివథి లుంటిత దధీభాండం – పాపతిమిర శతమార్తాండం
అధిక బలోద్ధృత జగదండం – ఆనందబోధర రసఖండం ॥క॥

3) శరణంభవ కరుణామయ – కురుదీనదయాళో కృష్ణ ॥శ॥
కరుణారస భరితాన్వయ, కరిరాజ కృపాళో కృష్ణ ॥శ॥

4) పహిమమదం దేహి శ్రీకృష్ణకృష్ణ పాహిగోపాల బాలశ్రీకృష్ణకృష్ణ
5) పూరయ మమకామం - గోపాల ॥పూ॥
అప. వారం వారం వందనమోస్తుతే - వారిజదళ నయన ॥పూ॥
మన్నగునకు పది పదునైదువఱకు నుండును.

ప్రతి కీర్తనకును తుదిని "వరనారాయణ తీర్థ" అను ముద్ర యుండును. ఇందు చూర్ణికలు, దరువులు నుండుట గమనార్హము. శ్లోకము, పదము, చూర్ణిక, దరువు, గద్య. ఆశ్వాసాంతగద్య. ఇవి యన్నియు నుండుటచూడ తెలుగు నందలి యక్షగానములకీ ప్రబంధము మార్గదర్శకమాయె నేమోయని యనిపించుచున్నది. ప్రతి పద రసోత్పత్తులను సంస్కృత గీతముల రచించి నారాయణతీర్థ, జయదేవులు ఆంధ్రుల గీతికాప్రబంధమై పుణని దేశదేశములకు చాటి ఆంధ్రులకు గర్వకారణమగుటయేకాక, ఆంధ్ర జాతియశోభూషణులై, వంద్యులైనారు. నారాయణ తీర్థులు ఆంధ్రుడు కాడని యొక వాదము కలదు. కాని యతడు నూటికి నూరుపాళ్ళను ఆంధ్రుడే యని చెప్పుటకు ప్రబల తార్కాణముగ నాతని తెలుగునేత యగు పారిజాతాపహరణ యక్షగానమును పేర్కొనవచ్చును. ఈతడు 1700 ప్రాంతము వాడు. గోదావరి మండలమున కూచిమంచి అగ్రహారస్థుడు. ఏమి కారణముననో చోళదేశమున కేగెను. ఈ విషయము డా. ఎం. కృష్ణమాచార్య గారి హిస్టరీ ఆఫ్ క్లాసికల్ సాంస్క్రీట్ లిటరేచర్ చూచిన బాగుగా తెలియగలదు.

కృష్ణలీలా తరంగిణి వీరి సంస్కృతరచన. ఇదియు వీరి తెలుగురచనయు రెండును గేయనాటికలే. రెండింటియందును కృష్ణ లీలలే యితివృత్తము. కృష్ణలీలాతరంగిణియందు భాగవత దశమస్కంధ పూర్వభాగము వఱకు- అనగా రుక్మిణీ కల్యాణము వఱకు వర్ణింపబడినది. తెలుగు ప్రబంధమున సత్యభామ అలక,

పారిజాతాపహరణ గాథయనుగలవు. కాని సరస్వతీమహలున దొరికిన ప్రతిలో సత్యభామ కోపగృహమును ప్రవేశించువఱకే కలదు. సరస్వతీ మహలు (తంజాపురి), మెరట్టూరు నందును రెండు ప్రతులు లభించినవి. మెరట్టూరు ప్రతి సమగ్రమైనదే. అయినను అది శిథిలమై యందు కొన్ని ఆకులు పోయినవి. మెరట్టూరు ప్రతివలన నీ రచనము నారాయణతీర్థులదే యని మఱింత ప్రబలముగ వాకొనవచ్చును.

ప్రతి దరువునకును అంత్యభాగములలో నారాయణతీర్థ ముద్ర కలదు. ఇది లీలాతరంగిణి రచన యంత గొప్పది కాకున్నను, యక్ష గానములకు తగిన కోమలత్వము కలిగి యున్నది.

సత్య విరహవేదన వర్ణించిన ఈక్రింది దరువును గాంచుడు :-

''ఏలాగునే వేగమ్మే - యికనేమి బుద్ధి తెలుపవమ్మా
చల్లని చూపులవాడు చక్కని నవ్వులవాడు
గొల్లవాడుంచులు గలవాడు కోటి మన్మథాకారుడు
ఎల్లపుడు నారాయణతీర్థుల యెలమి గలవాడలిగితేనూ ॥ఏలా॥
''ఎంత దుడుకువాడు గోపాలుడమ్మా
దాని వలపులకే వశమాయెనమ్మా,
తలచుకొంటేనే తాళలేనమ్మా
నారాయణ తీర్థ నామధేయుడమ్మా ॥ఎ॥

రచన యిట్లు కడుమృదులమై క్షేత్రయాదుల రచనను దలపింప జేయుచున్నది. మధ్యమావతి, బౌళి. పున్నాగవరాళి. శంకరాభరణము మున్నగునవి వాడెను. నారాయణతీర్థు డిట్టి వాగ్గేయకారుడగుట తెలుగుల యదృష్ట మనవలెను.



# మూడవ అధ్యాయము

## తత్త్వములు - సంకీర్తనములు - స్త్రీలపాటలు

తెలుగు భాషయందు ఇంతకుముందు పేర్కొనిన విధమున శృంగారాత్మకమును, భక్త్యాత్మకమునగు పదరచన జరుగుచుండగనే వేరొకవంక కేవలాధ్యాత్మికపరమైనట్టియు, వేదాంత పరమైనట్టియు మాయావాదముతోడి కీర్తన రచన బలుపొందుచు వచ్చెను. ఈ తీరు రచనలు "తత్త్వములు" అనుపేర ప్రసిద్ధికెక్కెను. ఈ పదకర్తల కాలమునుగూర్చి యిదమిత్థమని తెలియుట కష్టము. ఈ పదకర్తలకు ఎక్కువ పాండిత్య విశేషము లేదనియే చెప్పవలెను. ఇష్ట దైవతా ప్రార్థనములుగాను, రామావతార గాథలుగాను, కృష్ణలీలా వర్ణనములుగాను కేవల వేదాంతోపదేశములుగాను నివి కన్పట్టుచుండును. ఇందలి భాష కేవలము వ్యావహారికము. భాషలోగాని, శైలిలోగాని బిగువు గానంబడదు. భావము కేవలాధ్యాత్మికములుగా అద్వైత సంబంధములుగానుండును. అంతేకాక వేదాంతవిషయములను ఏదో ఒక సంకేతముతో చెప్పుటయు విరివిగా కనబడుచుండును. "గూడు చినబోయెరా, చిన్నన్న గూటిచిలకేదిరా" అను తత్త్వమున శరీరమునకు 'గూడు' అనియు అందలి ఆత్మపదార్థమునకు 'చిలక' అనియు నిచట సంకేతమని యెఱుంగవలెను. ఇట్టి సంకేతములు ఇట్టి పరిభాషయును వాడినప్పుడు దప్ప తక్కిన భాగము లందంతటను ఏమాత్రము కఠినత లేకుండా భావములను సూటిగా వెలిబుచ్చు భాషారచన మగపడు

చుండును. అంతేకాక యీ కీర్తనలలో 'నాదనామక్రియ' రాగమును ఈ సాహితీ విధాతలు హెచ్చుగా నాశ్రయించిరి. దీనికిని ప్రబల కారణము కలదు.

సాధారణముగ జీవులు సుఖభోగములను వాంఛించు చుందురు. సృష్టికే యిది సహజలక్షణము కదా. అట్టియెడ పరమార్థతత్త్వమెంత భవతారక మైనను సాధారణ జనతకు రుచ్యము కాకుండుటయు సహజమే. ఎన్నో కష్టముల పాలబడినవారును, వయస్సు మళ్లినవారు తప్ప తత్త్వము పొంతకెవరు పోవుదురు. భజగోవింద శ్లోకములలో

''బాల స్తావత్క్రీడాసక్తః,
తరుణస్తావ తరుణీసక్తః
వృద్ధస్తావచ్చింతాసక్తః
పరేబ్రహ్మణిసక్తః

అను శ్లోకము చెప్పినట్లు పరతత్త్వమువంక ఆసక్తి చూపువారు కాదు సరికదా కన్నెత్తి చూచువారైన నెవ్వరుందురు ? అట్లని లోక మంతయు నొకేరీతి నుండునా ? అందరును సంసారలంపటులైన లోకమునకు నిలువ నీడ యుండునా? ఎందఱు మహానుభావులు కర్మ, జ్ఞాన, భక్తి, వైరాగ్య మార్గములలో సాధకులై సిద్ధి నొంది తాము తరించి పరులను తరింప జేయలేదు ? కాని యట్టివారు జనసంఖ్య యందు నిష్పత్తిని బట్టి చాల తక్కువగా నున్నారు. అందును ఆ మార్గములలో మిక్కిలి ఆకర్షణీయమైన భక్తిమార్గమునకే సుఖ భోగములందు నరులు చేరుట తక్కువగా నున్నది. ఇక కేవల జ్ఞాన మార్గము నెవరాశ్రయింతురు ? అయిన నరులు సాధారముగ పుణ్యము చేయరు. కాని పుణ్యఫలమును మాత్రము ఆశించుట మానరు. పాపము చేయుట మానరు. పాప ఫలమును మాత్రము ఎంతమాత్రమును అనుభవింప గోరరు. అంత సుఖరతులైన నరులు జ్ఞానమార్గము నిష్ట పడుదురా ? ఇష్టపడకుండుటలో వింత యేమియును లేదు.

జ్ఞానమార్గాశ్రయులైన వారు రచించి ప్రచలింపజేసిన కీర్తన వాఙ్మయమే 'తత్త్వములు'. అందును ఈ తత్త్వములు రచించినవారు కొంచెము పాండిత్యపు పసల నెఱుంగని వారుగా కన్పట్టుచున్నందున నా కీర్తనలు లౌకిక సమాజమున నెక్కువ ప్రచారమును, ప్రశస్తిని పొందలేక పోయినవి. అంతేకాక వెఱువకుండ చెప్పవలెనంటే ఇంకొక్క విషయమును కూడ చెప్పవలసియున్నది. సాధారణముగ కూటయోగులైనవారు కూడ ఈ తత్త్వరచనకు పూనుకొనుట జరిగినది. ఆ కారణముచేత కూడ ఈ సంగాతమనిన వెఱచి ఈ తత్త్వముల పొంతకు నాగరక జనత పోకుండుట తటస్థించినది. ఈ తత్త్వములు దేశమున బహుళ ప్రచారము నందక పోవుటకు గల కారణములను పరిశీలించుచు వాస్తవిక దృష్టి నీ విషయమును ప్రస్తావింపవలసి వచ్చినదే కాని తత్త్వవాఙ్మయముపై గౌరవాదరభావములు లేకకాదు.

ఈయన్ని కారణముల చేతను నీ తత్త్వములు అనాగరకులని లోకము తలంచు సమాజముననే హెచ్చు పరిచయము గాంచినవి అట్టి వారు వ్రాయుటవలనను, అట్టివారే పాడుచుండుటవలనను ఈ తత్త్వములలో సామాన్య జనతకును సులభముగ వశపడు "నాదనామక్రియ" రాగమునే వీరు అధికముగ నుపయోగించి రనవచ్చును. అంతేకాక సామాన్య జనతా ప్రచారమున కనువగు భాష, రాగము కావలెనుకదా, ఆ దృష్టిని జూచినను 'నాదనామక్రియ' యే యెక్కువ యనుకూలమను విషయమును వారు గ్రహించి యుండవచ్చును. అట్లని ఇతర రాగము లిందు స్థానమును బడయలేదని కాదు. యదుకుల కాంభోజి, శంకరాభరణము, మోహన మున్నగు రాగములును నిందు గానసగును. ఇంక ముఖ్యముగ ఈ వాఙ్మయమును గూర్చి చెప్పవలసిన ప్రధాన విషయ మేమనగా ప్రస్తుత మాంధ్రదేశమున ఈ తత్త్వములు వచ్చినవారు చాల అరుదు. కొలది అనగా 15, 20 సంవత్సరముల

వెనుక బిచ్చగాండ్రైనను ఈ తత్త్వములను పాడుచుండెడివారు. కాని యిప్పుడు వారికిని ఈ పాటలు రావు. ఒకవేళ యీ పాటలు పాడిన నెక్కడను బిచ్చపుగూడైన లభింపలేదేమో. అంతేకాక బిచ్చగాండ్రు మాత్రము సామాన్యులా ? సినిమా పాటలుండగా నీ పాతకాలపు పాటల దిక్కుచూచువారెవరు ? వారును 20వ శతాబ్దపు నాగరక యుగము నందలి వారేగదా. ఇంకను శోచనీయమైన విషయమేమన గ్రంథాలయము లో కూడ నీ వాఙ్మయము నటకలపై కెక్కించుటయో, చెదలు దినుటయో, బూజు పట్టుటయో సంభవించినది. ఏబ దేండ్ల వయస్సు కలవారును అందును కొంత ప్రాతసాంప్రదాయము లలో మెలంగినవారు మాత్రమే ప్రాత జ్ఞాపకముల నాధారపఱచుకొని ఆ పాటలివి, ఈ పాటలివి అని చెప్పవలసిన గతి బట్టినది వీనికి.

జానపద వాఙ్మయము నుద్ధరించువారు, యక్షగానముల నుద్ధరించువారు, వీరుల పాటలను తిరుగవేయువారును కొందఱు భాషా పోషకులగపడుచున్నారు. కాని అట్టి మహానుభావుల కరుణాప్రసారమున కీవాఙ్మయ మింకను నోచుకొనలేదు. ఆ సుదినము లెప్పుడు సంప్రాప్తించునో ఎదురుచూడవలసి యున్నది.

ఎందువలననగా అన్ని తత్త్వముల యందు కాకపోయినను వీనియందును తెలుగువారు గణించుకొనవలసిన భావలాలిత్యము పద సౌకుమార్యము కల తత్త్వము లుండుటయే. అట్టివానిలో ప్రప్రథమముగ గణింపదగినది బ్రహ్మంగారి కాలజ్ఞానము. వీరు గొప్ప సిద్ధి పొందిన యతీంద్రులు. వీరు ఆగతానగతము లెఱింగినవారని ప్రసిద్ధి. వారు "ముందు భూలోకములో పాపము లేదు. ఇపుడు పాపము హెచ్చు అగుటచేత" పాపవిమోచనార్థం శ్రీ మన్మహావిష్ణువు కాశ్మీర దేశరాజగు జయసింగునకు, తిలకమాంబకు "వీరభోగవసంతరాయలు" అనుపేర అవతరించి లోకసంగ్రహము చేయుననియు చెప్పుచు కలి

లక్షణములను, వీరభోగవసంతరాయలవతరించునపుడు కలుగు చర్యలను ఒక పెద్ద వచనము మాదిరి తత్త్వములో వ్రాసి శుభపత్రికగా నేలపై వ్యాప్తము చేసినారు. వీరికి దూదేకుల సిద్ధప్ప మున్నగు శిష్యులు కలరు. వీరి యొక్కయు, వీరి శిష్యుల యొక్కయు మహిమానకములను గూర్చిన కథలు పెక్కులు పెక్కుతెలుగులుగా తెల్గుదేశమున వ్యాప్తి నొందియున్నవి.

ఈ వచనము వంటి తత్త్వముగాక, వీరివి, వీరి శిష్యులవి తత్త్వ కీర్తనలును పెక్కులున్నవి. ఇవన్నియు నొక యెత్తు "నందామయా గురుడ నందామయా ఆనందదేవికి నందామయా" అను పల్లవి గల కీర్తన యొక యెత్తు. ఇందుకూడ కలి ముదిరినపుడు భూమిపై కలుగు చెడ్డ లక్షణములన్నియు చాల విచిత్రముగ వర్ణింపబడినవి. ఇందలి భాష మిక్కిలి వ్యావహారికమైనది. "పూజశాయక, ధన మదాంధముచాత", మున్నగు ప్రయోగము లిందు మెండు.

వీరబ్రహ్మంగారి పత్రిక "ఇంకా భూమిమీద నన్ను నమ్మకుండా వున్నారు. యిఖనైనా నమ్మినవారికి రక్షించబోతూ ఉన్నాను.

— — — — — — —

శ్రీగిరి పట్నం శిరి గలిగి వుండీని. శీలామంతులు ముందుగానే పాడైపోవుదురు..." ఇట్లున్నది.

ఈ తత్త్వములతో ఇంకను పెక్కు విధములున్నవి. "వచనములు, యాలలు, వచనతత్త్వములు, ద్విపదలు" మున్నగునవి. వీనినన్నింటిని కూడ ఒక విధమైన రాగధోరణితో పాటగానే పాడుచుందురు.

మచ్చుకు వీరబ్రహ్మంగారిదొక వచనము :—

"పాలోయమ్మ పాలు, నాదేహమే గురునిపాలు, పాలు పాలుయని
ప్రణవము పట్టుక ధారణచేసే పరమయోగుల కెల్లను ॥పా॥

పెరుగోయమ్మ పెరుగు సద్గురుని కృపచే గల్గు పెరుగు,
అయినింటను తఱచిన ముక్తికాంతను ముదమున పలికిన ॥పె॥
చల్లోయమ్మ చల్లా సద్గురువాక్యంబువెగ చల్లా చల్ల చిల్లి
బహుఖేచరీ ముద్రయు సత్కళావీధిని సమరసమైన ॥చ॥
వెన్నోయమ్మ వెన్నా సద్గురుని వాక్యములే వినా,
వెన్న శశికన్న శిఖామణికన్నా శివాపరులైన వారికి ॥వె॥
నెయ్యోయమ్మ నెయ్యి మన వీరబ్రహ్మముపై నెయ్యి నెయ్యి
ఆరింట మూడింట నాపోజ్యోతి యనుభవపరులకు ॥నె॥

ద్విపద :- "అని వీరభోగవసంతుని కరుణ
మనమున సంతోషమహితజ్ఞాని
భావించినప్పుడు బ్రహ్మంబు లేచి
కారణయోగంబె కనిపించుకొఱకు.... ...."

యాలలు:- శరణుపోతులూరి రాయ, శరణు వీరభద్రాయ,
శరణు ఓ దైవతరాయ, ఓ పోతులూరయ్య ॥శ॥
— — — —
"అష్టాక్షరిగండిలో నా చతురాక్షరి చీరదీసి
ధర్మరాజు దారితెలిపితే ఓ పోతులూరయ్య,
జూచి నే కనుగొంటిరా ॥శ॥

ఇవి ఇట్లున్నవి. వచనములలో అచ్చటచ్చట వేదాంత బోధయే కాక శ్రీరామ, శ్రీకృష్ణ చరిత్ర కీర్తనములు కూడ నున్నవి.

ఇక బ్రహ్మం గారి తత్త్వముల నరయుదము పైన సూచించిన వచనములకు, యాలలకు మున్నగువానికి రాగము తెచ్చటను సూచింపబడలేదు. తెలిసినవారు పాడుచుండగ విని తెలుసుకొన

వలసినదే. తత్త్వములకు మాత్రము రాగము పేరున్నది. నాదనామ క్రియలోని ఈక్రింది తత్త్వము మిక్కిలి ప్రసిద్ధమైనది-

"ఓం నమశ్శివాయ సిద్ధమైనా పదవి, ఓంకారమేదిరా వోరి
వనరుగా త్రికూట భ్రూమధ్యమందున్న వాడెవ్వడో చూడరోరి॥ఓం॥
ఆఆలు యెనిమిది అక్షరములకు మూలహరుడెవ్వడో చూడరోరి,
అకారమున చిలుక హంసతో కూడుకొని ఆడిస్తున్నారోరి ॥ఓం॥
.... ... .... ... .... ....

వీనియందలి సాహిత్యమంతయు సాంకేతికార్థముతో గూడిన వేదాంతమే. భాష వ్యావహారికమేయని తెలియుచునే యున్నది.

వీరి ప్రియశిష్యులైన దూదేకుల సిద్దప్పగారి తత్త్వములు వీరి తత్త్వముల తరువాత బహుళ ప్రశస్తినొంది యున్నవి. వీరబ్రహ్మం గారికంటె సిద్దప్ప భావములు చాలా మొఱటుగా నుండుట గాననగును. చూడగా దూదేకుల సిద్దప్ప తురకవాడని ఎవరైన ఈసడించిరేమో. అట్టి దూషణలు విని విని యాయనకు విసుగుబుట్టి మొఱటుతనముగా జవాబులు చెప్పెనేమోయని యనిపించుచున్నది. ముఖ్యముగా నీ క్రింది తత్త్వమును గాంచిన యీ యభిప్రాయము బలపడక మానదు.

"ఏకులమని నను వివరమ్మడిగితే యేమని దెల్పుదు లోకులకూ
పలుగాకులకూ, దుర్మార్గులకూ ఈ దుష్టులకూ ॥ఏ॥
ఫాలభాగమున యాలలు బాడుచు భావముగన్నది నాకులమూ ॥ఏ॥

ఈ తత్త్వమునందలి తక్కిన చరణముల యందలి భావములు మఱియు మొఱటుగా నుండి వ్రాయుట కేవము పుట్టించునవిగా నున్నవి.

కాని తత్త్వమునందలి భావము మాత్రము తన్ను దూషించిన వారికి ఒడలు మండి చెప్పిన సమాధానమువలెనే ఉన్నది.

తెలుగునాట మిక్కిలి ప్రచారములోనున్న

"గూడు చినబోయెరా చిన్నన్న గూటి చిలకేదిరా ॥గూ॥
కోటదాటి పేటదాటి బాటలేని అడవిదాటి
గూటిలోని రామచిలుక గట్టులపాలాయె ॥గూ॥

అనునదియు సిద్దప్పగారిదే.

ఇంకొక శిష్యుడైన యాగంటి లక్ష్మప్పగారి తత్త్వము లొండు రెండు చూచెదముగాక :-

"ఇల్లువాకిలి నాది, ఇల్లాలు నాదనుచు
యేల భ్రమసితివయ్యో మనసా,
కాలుని వలలోను, చావకను జిక్కితివి
కడతేరుటే త్రోవ మనసా ॥ఇ॥
తనయులూ చుట్టములు తనవారనీ నమ్మి
తలపోయకే వెఱ్ఱి మనసా,
తనువు విడిచివెళ్లు సమయంబులోపల
తనవెంట రారైరి మనసా ॥ఇ॥
ఆరుమూడిట తేరి ఆపత్తజము గని
అందము గనుకొనవె మనసా॥
మేటిస్థానములోను మేటిస్థానమునందు
సూటిదప్పక జూడు మనసా ॥ఇ॥
"పోయేకాలము వృధాసోకునో జనులారా,
యే యుపాయంబున శివునెఱుంగుదు మీరు ॥పో॥
కలిమిలేములచేత ఘనలోభములచేత,
కలహముచేత నహంకారముచేత,
కులమదంబులచేత, కూహకంబులచేత,
చలనము చేతను, కుబుసనుఖంబుచేత ॥పో॥

వీరబ్రహ్మంగారి శిష్యులలో వీరిద్దరు ముఖ్యులు. ఈ సిద్ధవరుల జన్మక్రమములుకాని, కులములుకాని యంతగా తెలియవు. 'ఏరుల జన్మము, శూరులజన్మము, ధీరులజన్మమును ఎంచదగినవి కాదుగదా, కాని ఈ శిష్యవర్గమునందలి వారు చాలామంది:

"ఏదిరా కులము, జరీనాదుకులంబని నడువరా జాణా
ఏదిరాకులము ఎఱుగకతిరిగేవు నాదులకులంబని నడువరాజాణా ॥ఏ॥

ఈ విధముగ కులమును గూర్చి ప్రశ్నింప నేలనని విసురుగా, దురుసుగా జవాబులు జెప్పినవారే. ఈ తత్త్వము పోతులూరి వీర గోవిందులవారిది. వీరిని సంఘములో కొంచెము నిరసన భావముతో చూచిరి కాబోలు ననుపించును-

కొందఱు వీరి వేదాంతమును మెట్టవేదాంతమని చెప్పుట కిది కూడా కారణము కావచ్చును.

పోతులూరి వీరగోవిందమను పేరిటి రచనలు కొంత యుజ్జ్వలముగా నున్నవి- ఇది బ్రహ్మంగారును, నాయన భార్య గోవిందమ్మయును వ్రాసినవి.

ఆనందమైనాపువ్వు గోతామా, ఆత్మరాముని పూజచేతా మా
కందర్పజనకుని యిందిరశ్రీ నెవుడు
బిందుపీటమునందు పొందై యున్నది. ॥ఆ॥
భావభావమునందు జూతామా, భక్తజనులతో సంతోషము జేతామా,
భావము నందున గురుని దలతామా, భక్తితో జేతామ ॥ఆ॥

"చిల్లరరాళ్లకు మ్రొక్కుచునుంటే చిత్తము చెడునుర ఒరేఒరే,
చిత్తమునందు చిన్మయజ్యోతిని చూచుచునుండుట సరేసరే ॥చి॥

ఒక్క ప్రొద్దులని యెండుచు ఒనరుగ జెడుదువు వారేవారే.
ఏకమైన యా వైభవమూర్తిని జూచుచునుండుట సరేసరే ॥చి॥
నీళ్లను మునిగి గొణుగుచునుంటే నిలకడ జెడునుర వారేవారే
నీళ్లలోనుండే నిర్మలజ్యోతిని జూచుచుంకుట సరేసరే ॥చి॥
బాధ గురువుల పంచను జేరితే భావము చెడునుర వారేవారే,
మనసునందున బ్రహ్మకాంతిని జూచుచునుండుట సరేసరే ॥చి॥
భూములు అడవులు తిరుగుచునుంటే బుద్ధులు జెడునుర ఒరేఒరే
బుద్ధులనుండే పున్నమచంద్రుని చూచుచునుండుట సరేసరే ॥చి॥
వీరయవాక్కును నమ్మితె వివరము తెలుసును ఒరేఒరే
వివరమునందలి విగ్రహమూర్తిని చూచుచునుండుట సరేసరే ॥చి॥

ఇది చాలా ప్రచారముగల కీర్తన.

ఈ కీర్తనయందు లోకులు మెట్ట వేదాంతమని చెప్పుకొను మోటు పద్ధతులను నీతడెంతో చక్కగా నిరాసము చేసి నిజమగు మోక్ష మార్గములను తెల్లమగు బాసతో చక్కని ఫణితితో బోధించుట కాననగును.

ఈ శిష్యపరంపర అనంతసంఖ్యలో నున్నది. అందటి కీర్తనల కును అంత్యమున "నామాంకిత ముద్రలున్నవి". విషయము తెలియు టకై కొంతమంది పేరులను పేర్కొనుచు సాధ్యమైనంతవఱకు వారి తత్త్వములను చూపుచుందురు.

కంబగిరి జక్కనయ్య

రామభజన సేయరా లమిడికా, నీ తామసమణచర ధగిధికా ॥రా॥
ధూముధాము లేమిచేసు ? నోముకొన్న ఫలమొకాని,
తాముతాము తరలిపోయ్యే దారియైతే తెలుసుకోర ॥రా॥......

ఇదికూడ బహుళ ప్రచారమున నున్న కీర్తనయే లమిడికా ధగిడికా మాదిరి మోటుపదములు తఱచు వాడుట ఈ తత్త్వములందు గాననగును.

శుద్ధమళ్ల నరహరి (కంబగిరి)

అడిగినప్పుడె చెప్పనగునా బ్రహ్మానుభవము ఆత్మానుభవము
— — — — — — —
అడిగినప్పుడె చెప్పుటకు నిది పడుచుమాటల భ్రాంతిజన్యము
లుడిగి నిర్మలమైన మాయను విడిచి నిలచిన స్వానుభవము ॥అ॥
— — — — — — —
బుద్ధిచాలక చేయబోయినది – సిద్ధంబగు శ్రీకంబగిరిని
శుద్ధమళ్ల నరహరిపై బుద్ధి నిలుకడ లేనివారికి ॥అ॥

నారాయణదాసు

బ్రహ్మజ్ఞానిని గుఱుతెఱుగండీ – జ్ఞానాఖడ్గముచే నజ్ఞానము
భేదించి మానసమున పండిన మమతవిడిన ॥బ్ర॥
మదమాత్సర్యములను మాయపఱచి నిష్టచెదరక మరసీరగట్టేరురా,
దృష్టికదలక చిత్కళలంటేరురా అట్టి ముదురువెన్నెల బయలు గనియేరురా,
పూని యెదురులేకను లయమయ్యేనురా,
నిదురజెందిన రీతి నిలిచిన యోగికి కదిలేరెప్పపాటు లేకుండురా ॥బ్ర॥

వీరి తత్త్వములన్నియు నిట్లే పెద్దపెద్ద చరణములతో నుండును.

తరికొండ నరహరి

జ్యోతి వెలుగుచున్నదమ్మా, దాని లోతు దెలియరాదెకొమ్మా
పాతాళగగన కళాతీతమై సర్వభూతలమునందు ప్ర

ఖ్యాతిగ పరమాత్మ ఎవరిచేతికి జిక్కదోయమ్మ,
దాని విధమెట్టిదో తెలియజెప్పగదమ్మా॥

ప్రాసను పాటించుటీ కీర్తనలో గాంచనగును. ఇట్లు కొందరి కీర్తనలలో ప్రాస పాటింపున్నది. కొందఱి కీర్తనలలో లేదు.

సిద్ధగురు

చందమామ, చందమామ – చందమామా
ఈ సంధితెలిపే జ్ఞానులెవరే చందమామా
కాయమాను పుట్టలోనే చందమామా,
పాము మాయగానే మెలగుచుండు ॥చంద॥
జంటనాగస్వరము ల్యూది చందమామా,
పాముపాదు పెకలింపలేరు చందమామా ॥చం॥
తొమ్మిది వాకిళ్లు మూసి చందమామా
పాము నెమ్మదిగానె పట్టవలె చందమామా ॥చం॥

ఇందు ప్రాణామాయ యోగమును గూర్చి చాలా విశదముగా నున్నది. రచనకూడా చక్కగా నున్నది. ఈ సిద్ధగురుస్వామి రచించిన తత్త్వములు చాలా ఉన్నవి.

జ్ఞానబ్రహ్మానందయోగి

జ్ఞానబ్రహ్మానందయోగి, కర్మములెడపు చిన్మయయోగి
చిత్తంబనే పట్టణమందు, చిన్మయుడనెరాజు రాజ్యము సేయగాను,
బుద్ధియనే మంత్రితోను, పురుషార్ధమేమని తలపోయగాను ॥జ్ఞా॥

ఘంటయ్య

కంటిపాపలంటరా నూటనాల్గింటరా,
నాల్గింట అయిదింట, ఆరింట అరసిచూడరా ॥కం॥

యెక్కిరానిమానికొమ్మ కొక్కపండు పండెరా,
పండెనని నిక్కిచూచి, చిలుకలైదు గరచెరా
పెక్కు చిలకలకు పిల్లి నొక్కచోట పెంచెరా ॥కం॥

వేమనవరకవి నరసింహదాసు

మాయను నటికే మర్మమున్నది న్యాయము వినవే ఓమనసా
కాయములోపల వుపాయము గనుకొని మేయవలెనే పరమె
ఓమనసా
అండపిండ బ్రహ్మాండములన్నియు కుండలియనవే ఓమనసా
దండిభావమిది దారిజూపితిని ముండమోపివలె నుండకె ॥ఓ॥

వీరయ్యదాసు

ప్రపంచనడతఝూటా, మన పెద్దలవాక్యంబాటా
ముగ్గురుమూర్తులు ఝూటా మూలము ఎఱుగుబాటా ॥ప్ర॥
చదువుశాస్త్రములుజూటా వోరేసద్గతి ఎఱుగుటబాటా ,,
అన్నిటిగొల్చుటజూటా తన ఆత్మలోనెఱుగుట బాటా ,,
వీరయ్యదాసుని ఈ కీర్తనకూడా బాగుగా ప్రచారము నొనున్నది.

పోతుల నారాయణదాసు

అంతాచిన్మయం - అఖండమద్వయం ఆనందో బ్రహ్మానందం
వింతగాను అనుభవమంతయు దెలిసిన అంతరాత్మను చింతసేయవే॥

పీర్ మొహిద్దీన్

తారకము సూటెరుగవలెనన్నా - సద్గురుని కృపచే
తారతమ్యము దెలిచి కనుమన్నా
పరపు తెరపనకుండా జాగ్రత్త
నిరతమును స్వప్న సుషుప్తిలో

ఆరమరలు లేకుండ యెప్పుడు
దలచుగను జీవాత్మ చదివెడి ॥తా॥

ధరణిలోపల మూఢమతులకు దొరకుట బహుదుర్లభంబిది
గురుకటాక్షమ్ము వలన స్థిరమగు పరపదము జేరేయుక్తిని నేర్పు
వలె జీవాత్మకిపుడన్న, నేర్పెఱిగియుంటే మరువకును జపియించు
చుండన్నా, యీజపము నెఱిగినవారు నిర్మల బ్రహ్మజ్ఞానన్నా

.... .... .... .... .... .... .... ....

కొండవీటి చేంతాడువలె కడు దీర్ఘమైన చరణములు కల ఈ తత్త్వమును తెలుగునేలలో తెలియని భిక్షుకులు, సన్యాసులు నుండరు. అధ్యాత్మ రామాయణ కీర్తనల చరణములను జ్ఞప్తికి దెచ్చు ఈ తత్త్వము వరుస సులభమేయైనను పాడుట కష్టము.

కఠారి వీరాస్వామి

ఆత్మలింగని పూజసేయరా ఓరోరిజీవా ॥ఆ॥
ఆత్మలింగని పూజ సేయని నిత్యమూ జపపూజలెందుకు
శాశ్వతంబుగ జ్యోతినిగని పరమాత్ముడుండే దారిగనర॥ఆ॥

మహమ్మదు హుసేన్

ఊదుచు కొలిమితిత్తుల సమరసము తెలియవలెరా । ఊ॥
వాదభేదము లణచి ఆత్మలో శోధింపవలెరా ॥ఊ॥
ఒకటిమొదలు వృక్షము లెక్కకు మిక్కిలి కొమ్మలురా
ఎక్కిచూచితే ఎంతో పొడుగుగ నాకాశమంటినదిరా
చొక్కమైన కొండొక్క కొమ్మను చేతికి దక్కదురా
వొప్పు తెలిసినవారికి పండు యొద్దనే యున్నదిర ॥ఊ॥

చంచయ్యబోధగురుని సీసమాలిక

ఇంద్రజాలము టక్కుడమరముల్ జేసిన
ఆడదాన్ని జూచేటందు కొఱకె

కరలాఘుగణలాగ స్తంభము జేసిన ఆడదాన్ని......
ఉపవాస ఉచ్చాట ఆకర్షణ జేసిన.......
వేదములు శాస్త్రపురాణము వెదకిచూచిన.......
బి.ఎ.బి.ఎల్ చదివిన..........

అనునిట్టి యాధునిక విద్యావిషయమును గూర్చి తడవుచు వ్రాసిన ఈ చెంచయ్య బ్రహ్మంగారి శిష్యులలో నిటీవలివాడేమో.

ఇచ్చట "ఆడదాన్ని జూచేటందుకొాఅకే" అను వాక్యములోని గూడార్థమేమన "ఆడ" అనగా అచ్చట – అనగా – పరలోక విషయమును దెలియుట కొాఅకేయని యర్థము.

'శివుడంటేనేమి, కేశవుడంటేనేమి, శివకేశవుల చిత్తస్థిర భేదమేమి ?" మున్నుగా గల తత్త్వములలో శివకేశవాభేదమును పాటించుట కూడ కాననగును.

చెంచయ్యగారను నీయన వీరబ్రహ్మంగారి శిష్యులైనవారు–వీరును గురుపదవిని పొంది కొంతమంది శిష్యకూటమునకాశ్రయులైరి. వీరి శిష్యులైన గుంట పురవరము వాసుడైన వీరాస్వామిగారివి కొన్ని తత్త్వములు జనాకర్షణకు పాత్రమైనవి అందుండి యొకటి:–

"తాధిమి, తకధిమి తోలుబొమ్మా,
దీని తమాషా చూద్దము తోలుబొమ్మా
తాధిమి తకడ్డ తత్తళాంగు తత్తళాంగు తకధిమి ॥తా॥
కంటికి మింటికి ఈ బొమ్మ
బహుతంటాలు చేస్తది మాయ ॥తా॥
అంటిఅంటక యింటిలోపల
వొంటిగనుంటాదీబొమ్మ ॥తా॥
తొమ్మిదితూటుల నీబొమ్మా దీన్ని

తొంగిచూడర మాయబొమ్మా

.... .... ... .... ....

బి.యే.బియెల్ చదివి ఈబొమ్మ

బల్ బడాయిచేస్తది మాయబొమ్మ॥

రేపుడబ్లార్సెక్కి పొయ్యేదెఱుగక డంబం జేస్తాదీబొమ్మ ॥తా॥

ఇందు బొమ్మ యనునది జీవునకు సంకేతము. తొమ్మిది తూటులనగా నవరంధ్రములని యర్థము. బి.యే బి.యెల్ ప్రసక్తిని బట్టి చూడగా నిది యిటీవలి వారి రచనయేయని స్పష్టమగుచున్నది.

"చచ్చేటందుకు పుట్టియున్నావు - సందులుదూరకు రోరన్న
యెన్నాళ్లుండిన యముడు విడువడు ఎందుకు జడిసేవోరన్న ॥చ॥
సాధులతోను సంగతిచేసి సంధి యెఱుగర వోరన్నా
సద్గురుపాదము చక్కగ నమ్మి సమరసమెఱుగర వోరన్న ॥చ॥"

అను తత్త్వము వీరయ్యదాసునిది. ఇదికూడ చాలా ప్రశస్తికెక్కినదే.

నారాయణహరిదాసు గారి ఈక్రింది తత్త్వమొకటి తెలుగునాట బహుళ ప్రచారమునందున్నది.

జీవులెనుబది నాల్గులక్షలు చావుపుట్టుక లిక్కడ
ఎవరు చేసిన వారి ఖర్మము లనుభవించేదక్కడా॥
తల్లిదండ్రులు అన్నదమ్ములు సతులుసుతులును ఇక్కడా,
వెళ్లిపొయ్యేటప్పు డెవ్వరురారు మనతో అక్కడా॥
పంచభూతమువలననే ప్రపంచమైనది యిక్కడా
అంచితంబుగ నామరూపము లేని స్థలముందక్కడా॥
"ఎవరుచేసిన ఖర్మ వారనుభవింపకా ఎవరికైనను తప్పదన్నా

ఏనాడో ఏతీరో ఎవరు చెప్పగలరు అనుభవించుట సిద్ధమన్నా

... ... .... .... ... ... . .

అలనాటి పాండవులు ఆకులలములు మేసి
అడవిపాలై పోయిరన్నా అడవిపాలై పోయిరన్నా
రమణి సీతనుబాసి రాముడడవులలోన బాగుగా ఏడ్చెనన్నా
ఏనాడో ఏ తీరో యెవరుచెప్పగలరు అనుభవించుట సిద్ధమన్నా॥

ఇదియును సినీమారంగమున కెక్కిన తత్త్వమే. తంబుర శ్రుతులను మీటుచు చిరతలువేయుచు నిట్టి తత్త్వములనేకులు సాధువులు మున్నగువారు పాడుచుండుట గాంచగలము. పై తత్త్వములోని "అలనాటి" అను చరణములోని "ఆకులలములు మేసి అడవిపాలై పోయిరన్నా" అనుటలో అడవిపాలై ఆకులలములు మేయుట సిద్ధము కాని, ఆకులలములు మేసి అనునదియు ముందుండరాదుకదా. ఇట్టి వ్యతిక్రమములును ఈ తత్త్వముల యందుండుట గమనింపదగును.

ఇంక వీరబ్రహ్మంగారి "నందామయా గురుడ నందామయా" అను తత్త్వమును గూర్చియు "శివశివమూర్తివి గణనాథా నీవు శివుని కుమారుడవు గణనాథా" యను తత్త్వమును గూర్చియు వేరుగ వ్రాయ వలసియున్నది. ఇవి రెండును కూడ సినీమాలలో ప్రసక్తిని పొందినవే. తత్త్వములకు సామాన్య జనులయందు ప్రచారము తగ్గి పోయినను సినీమా వారాదరించుటయు తద్ద్వారానైనను మరల ప్రచారములోనికి వచ్చుటకైనను ఆనందింపవలసియున్నది.

'రామదాసు'దను నన్వర్థనామము నొందిన కంచెర్ల గోపనా మాత్యునికి పిమ్మట తెలుగునాట నించుమించుగ నంత ప్రఖ్యాతిని బొందినవారు 'యడ్ల రామదాసు'గారు. వీరు తూర్పుగోదావరి జిల్లా కాకినాడ గ్రామవాసస్థులు. వీరు శ్రీ మంతిన వేంకటాచార్య గురు

పరంపరలోని వారు. మఱల వీరు కూటస్థులుగ నొక గొప్ప శిష్య పరంపర వీరిది దేశమున వ్యాపించియున్నది. వీరి తండ్రి అచ్చయ్యగారు. తల్లి మహాలక్ష్మి. ఈయన సాక్షాద్భగవద్దర్శన మబ్బినమహానుభావులనియు, అధ్యాత్మ సాధనాసిద్ధులైన వీరిజీవితము నందనేక మహిమలు సంభవించి యుండెననియు చెప్పుకొందురు. ఈయన శ్రీరామ భక్తాగ్రగణ్యులు. వీరు తత్త్వ వాగ్గేయకారుల శాఖకును, సంకీర్తన వాఙ్మయకర్తల శాఖకును చెందుదురు. సాధారణముగ గోసాయీలనువారును, భిక్షుకవర్గము సాధుమహారాజులును ప్రచురముగ పాడు,

"ఏమి జన్మంబేమి జీవనము
ఈ మాయకాయము లెన్నాళ్ల బ్రతుకిది
మూన్నాళ్ల ముచ్చట గురుసేవజేయని ॥ఏ॥
ఏమి శాశ్వతమేమి సౌఖ్యమ్మా,
యేమి నా ప్రారబ్ధకర్మము స్వామినన్నిటు జేసి మఱచెను॥ఏ॥

ఇట్టి తత్త్వములే కాక తన యిష్టదైవములగు కొమరిగిరి గోపాలస్వామి, శ్రీరామదైవము, శ్రీకృష్ణ భగవానుడు మున్నగు స్వాములపై చాల కీర్తనములను ఈయన రచించిరి.

శ్రీరాగము అట

"ఎన్ని మాయలు నేర్చినాడమ్మ, యశోద
నీ కొడుకు అన్నిట నెఱజాణుడోయమ్మ ॥ఎ॥
ఎన్నిమాయలు నేర్చినాడే చిన్నితనయుడు నిన్నరేయిమా
కన్నెపడుచును చూచి, రమ్మని చేసినాడట ॥ఎ॥
వట్టిమాటలు గావు వినవమ్మా
ఈ వాడలోపల నిట్టివానిని చూడలేదమ్మ

ఉట్టిమీద చట్టిలోన పెట్టినపాలు
అట్టెపోవగ చట్టి పగులకొట్టి కృష్ణుడు
పొట్టనిండా బెట్టినాడట ॥ఎ॥

కృష్ణలీలా వర్ణనాత్మకమైన ఈ పాటను ఆబాలగోపాలమును ఆంధ్రులు ఆనందముగా పాడుకొనెడివారు.

అంతేకాక తన గృహచ్ఛిద్రములను, శరీర బాధలనన్నింటిని శ్రీరామచంద్రునితో మొఱవెట్టుకొని పూర్వపు రామదాసుని జ్ఞాపకము దెచ్చిన మహానుభావుడు. తన కొకప్పుడొక పెద్ద కురుపువేసి చాల బాధింపగా నాబాధభరించలేక శ్రీరామచంద్రునీవిధముగ ప్రార్థించెనట:

అబ్బబ్బ నేతాళజాలరా శ్రీరామ తబ్బిబ్బుపెట్టెనా
కుడితొడపై, కురుపు నెరపుమంట ॥అ॥
ఎన్నెన్నొ ఔషధములు వేసినప్పటికైనా,
పన్నగశయన నీచేతిపట్టు వేయకుంటేపోదు ॥అ॥
వాసిగ భక్తవరుల బ్రోసిన వాడవని యాశించిన
యడ్ల రామదాసుని మొర యోచింపవు ॥అ॥

ఇంతకంటె తన చెల్లెలి అరచేతిలో నొక కురుపు వేయగా అపుడీయన చేసిన ప్రార్థనమింకను భావస్ఫూర్తిగను, ఆర్తిపూర్వకముగను నున్నది.

"చెప్పుటకై నాతరముగాదు నాచెల్లెలి మొఱవినురామా
ఇప్పుడు కుడిహస్తమునందునొకగొప్పకురుపు శ్రీరామా ॥చె॥
.... ... .... .... ....
వైద్యులెవరు సాధ్యము గాదనిరి, వచ్చిచూడుమో శ్రీరామా
రాజ్యములో నీవు సాధ్యమునాకని నిజముగ నమ్మితినోరామా

చాలుచాలు నీస్నేహము నాకిక నేలనోయా శ్రీరామా
తాళలేను ఈబాధను నీవు తప్పించుము శ్రీరామా ॥చె॥

ఈ కీర్తన తుదిచరణము పాడుచుండగనే కురుపుచిదికి బాధ మటుమాయమయ్యెనట. ఈతనిని గొప్ప సాత్వికయోగిగా ప్రజలు చెప్పుకొందురు. సారంగధరచరిత్రను దసరా గిలకల పద్యములుగ వ్రాసిరి.

"చూడచక్కని చిన్నది - కడమెడ గదిలో నున్నది
మూడురంగుల మడుగులో జలకమాడుచున్నది ॥చూ॥
వేదశాస్త్ర పురాణములకే నాది దేవతనన్నదీ
వాదభేదము లేక సాధులబోధ చేయుచునున్నది ॥చూ॥
ధరనుమంతిన వేంకటార్యుల కరుణచే నాచిన్నది
స్థిరతరంబుగ యడ్ల రామదాసు హృదయమున నున్నది ॥చూ॥

మిక్కిలి ప్రచారమునందున్న ఈ తత్త్వము. యడ్ల రామదాసు శిష్యులదని కొందరందురు. యడ్ల రామదాసుదేనని కొందరండ్రు. ముద్రమాత్రము రామదాసు ముద్రయే యుండుట గమనింపదగినది.

ఇచట "చిన్నది" అనగా ఆత్మపదార్థము. మూడురంగుల మడుగనగా సత్త్వరజస్తమోగుణముల సమ్మేళనముకల మాయావరణ మనియు నర్థము.

ఈతని కీర్తనలలో హెచ్చుగా రామ, కృష్ణ సంప్రార్థనములే కొన్ని తత్త్వములు కూడ నున్నవి. సాత్త్వికయోగిగా పేరొందిన ఈ రామదాసుడు వ్రాసిన దనబడు ఈ శృంగారాత్మక కీర్తన నిజముగ నాతనిదేనా యనిపించును :-

"ఉల్లిమళ్ల చీర యిందగొల్లభామా
కల్లగాదు కోర్కె దీమ పల్లవాధరీ

ఉల్లిమల్ల చీర దెస్తె కృష్ణమూర్తి
భోగమిండ్ల వెంబడెళ్ల వోయి చిన్నిమాధవా ॥ఉ॥

ఈ కీర్తనయందలి తక్కిన చరణములన్నియు చెప్పగూడని శృంగారముతో నున్నవి.

ఏది ఎటులైనను తెలుగునాట నీ మహాపురుషుడు ఆధ్యాత్మిక తత్త్వమున పెద్దపేరు నొంది "తెలుగులకు మహాభక్తులగు నిద్దఱు రామదాసుల"ను భాగ్యమునకు కారణభూతుడాయెను. ఈయన రాజమహేంద్రవరమున సిద్ధిపొందెను. అచ్చటి యొక భక్తురాలు ఈయనకు సారంగధరుని మెట్టప్రాంతమున సమాధి కట్టించెను. ఈయన ఇటీవలివాడే.

ఇక ఈయన శిష్యులు వ్రాసిన తత్త్వములు కొన్ని యున్నవి.
"దీని భావము తెలియవలెనన్న
నీలోని బ్రహ్మము పూని కనుగొనవలెను వినుమన్నా
దీని భావము తెలియకున్నను,
మానితోజ్జ్వల గురుని పదములు మానసంబున నిల్పివేడ,
నిదానముగ బోధించునంతయు ॥దీ॥
రెక్కముక్కు లేనికాకి దిక్కులంతను తిరిగిరాగను,
ప్రక్కనుండిన నక్కపిల్ల గ్రక్కనను దిగ మ్రింగుచుండగ
దిక్కులేకను నడలసాగెను
తటుకున నోరునొక్కి దిటుకున మ్రింగిపోయెను
అంతట కోడి కొక్కొరాకో యని గూసెను మఱి
యొక్కవింత చక్కగా వినిపింతు భువిలోను
మక్కువతో ఒకదోమ నిక్కి జగముల
నెనిమిదింటి నృక్కణ దిగమ్రింగియును
తానెక్కడ చెలుచిక్కకుండెను ॥దీ॥

ఇట్లు కడుదీర్ఘముగనున్న ఈతత్త్వములో వేదాంతమును గూర్చి గూఢార్థముగ సాంకేతిక పదములతో పొడుపుకథలవలె ప్రశ్నవేయుట గాననగును.

"ఓం, ఓం, ఓం, ఓం, యనుమా
ఓంకార ప్రణవనాదమును వినుమా,
అహం బ్రహ్మాస్మియనెడి శ్రుతుని
ఆత్మఐక్యము చేసికొనుటకై ॥ఓం॥

పుట్టుటగిట్టుటలేదుసుమీ-పరిపూర్ణయోగమిది విడువకుమీ
గుట్టు తెలిసియీ వట్టిభ్రాంతిలో యా బట్టబయలు గని ॥ఓం॥
"సోహం సోహం సోహం యనుచు సుఖమునొందవలెరా-
దేహము గేహము మీదను మోహము ద్రుంచివేయవలెరా ॥సో॥
త్రిగుణములను పగవారినిగని తెగవేయ వలెరా-
వగవగ అరిషడ్వర్గ బాంధవుల తగులబెట్టవలెరా ॥సో॥

యడ్ల రామదాసుల శిష్యుల తత్త్వములలో నీరెండును మిక్కిలి ప్రచారమును గాంచియున్నవి. రామదాసు శిష్యులలో కొందఱు కీర్తన చివర గురుముద్రతోనే రచించుట కాననగును. ఈ కీర్తనలట్టివే.

యడ్ల రామదాసుగారి తత్త్వములకు సాంఖ్యతారకామనస్క యోగమను సుజ్ఞానచంద్రిక యని పేరు-ఈతత్త్వములలో ప్రతితత్త్వమునకు ఒక్కొక్క పద్యముకూడ కానంబడును. రాజమహేంద్రవర సమీపముననున్న ధవిళేశ్వరవాసుడు గుజ్జుల నారాయణదాసు భక్తి జ్ఞానానందంబగు తారకామృతసార కీర్తనలను రచించెను. తండ్రి సూరయ్య, తల్లి లక్షీదేవి. ఈ నారాయణదాసుని రచనలలో కొంత అలంకార రచన కనబడుచున్నది.

"యాలనురా, గోలనురా, కాలునిమాయలో ద్రోయకురా
చాలును ఈ నరజన్మమురా, జాలముచేయక బ్రోవుమురా
ఉన్నదిరా, కన్నదిరా, కనుపాపల నడుమను చిన్నదిరా
సన్నదిడ్డిలో నున్నదిరా, పున్నమి వెన్నెల బోలునురా...."

ఇట్లు శబ్దాలంకారముతో తత్త్వములను రచించుటీయని రచనములయందు గనపడుచున్నది.

బేతపూడి పరబ్రహ్మముగారి పుత్రులగు కృష్ణానంద అచల బ్రహ్మపూర్ణులవారి "అతీతతత్త్వములు" కూడ కొన్ని ఆంధ్రులలో విరివిగ వ్యాపించియున్నవి.

"ఏమని దెల్పుదు నీజగము బహుకల్లల మారిది ఈజగము
బహు జీవులమారిది యీజ.... బహుబూతుల........
బహుభ్రాంతుల...బహు డంబముమారిది....
బహుమెఱుపుల మారిది....బహుకూతల....
కృష్ణానందపూర్ణుల జగము కృప కుట్రగదెల్పెను....
దెలసెను చాలు ఈజగము...ఇక ధీరత వత్తును నీపరము.

జన్మత్యాగమునుగూర్చి వ్రాసిన :

"వద్దుర జన్మవద్దుర యేలోకమందున ఏనాటికైన ॥వ॥
ఉన్నవాడవు ఉండలేక యుండినటులే సృష్టిచేసి
యల్పతనువును యొసగి నన్నుయసలె మోసముచేయదలచగ॥వ॥

మున్నగునవెన్నియో కీర్తనలు కలవు.

పోతులూరి వీరబ్రహ్మం గారి వేదాంత తత్త్వానుసారముగ నేటివఱకు కూడ తత్త్వములు వ్రాయుచున్నవారు పెక్కురుకలరు. అట్టివారి నిర్వురు మువ్వురను గూర్చి ముందే ముచ్చటించి యుంటిమి.

ఈ 20వ శతాబ్దమున ప్రస్తుతమున బాపట్ల గ్రామవాస్తవ్యుడైన కారుమూరి రాఘవయ్య శిష్యుడు విగ్రహాల వెంకట కృష్ణయ్య యను భక్తుడు తన గురువున కంకితముగ తనముద్రతో రచించిన తత్త్వముల నొండు రెండు ప్రస్తావింతును. ఈయన అతి సామాన్యజీవితము గడపు ఒక ఉన్నత పాఠశాల యొక్క అనుచరుడు. నేర్చిన లౌకికవిద్య తక్కువైనను అనుభవము పెంపుచే "ఆత్మగురుశిష్య తత్త్వములు" అను పేరిట తత్త్వములు వ్రాసి ప్రచురించెను.

అందు ఇప్పటిలో సినిమాలలో ప్రసిద్ధికెక్కిన "కల్లాకపటం కాననివాడా లోకంపోకడ తెలియనివాడా ఏరువాకా దాటాలో రన్నా చిన్నన్నా" అను మట్టున రచించిన తత్త్వము:-

కల్లాకపటం కాననివాడా రాకడపోకడ తెలియనివాడా
ఈషణత్రయములు విడువనివాడా
వీరగురుని జూడాలో రన్నాచిన్నన్నా
యీ విశ్వమంతట నిండెనురో రన్నాచిన్నన్నా
నవద్వారబులు నణచియుంచియును
సూర్యచంద్రులను సూటిగ ఆపుచు
మూడుగుణములకు ముక్తినిజూపుచు
త్రివేణీసంగము చీల్చి చూడుము ॥వీ॥

తెలుగు కీర్తనవాఙ్మయమున నీతత్త్వములను గూర్చిన అధ్యాయము విశిష్టమైన ఒకపాయయని చెప్పవచ్చును. వచనములు, కందార్ధములు, యాలలు, చూర్ణికలును నిందుకలవు. అన్నియు పాటవలె పాడునవియే. ప్రత్యేకభాష ప్రత్యేక భావములు గలిగి శుద్ధవ్యావహారికపు 'యాస'తో ప్రత్యేకించిన కొన్ని 'మట్లు'తో నీశాఖ విచలితమై ప్రచలితమై యున్నది. పరిశోధనచేసి యీతత్త్వసాగరమునందలి మణిమాణిక్యముల నేరికొన్నచో దేశమునకు కొంత ప్రయోజనము కలుగగలదు.

# సంకీర్తన వాఙ్మయము

ఇట్లు అద్వైత భావాత్మకముగ తత్త్వరచనము లోకవంక జరుగుచుండ వైష్ణవపరముగ విష్ణుమతస్థు లోకవంక ప్రపత్తిమార్గమున సంకీర్తన వాఙ్మయమును పెంపొందించుచు వచ్చిరి. అందు పరాంకుశ దాసు, వెంకటదాసు మున్నగు వారినిగూర్చి యీ క్రింద తెలియగలము.

ఇందు వెంకటదాసు అనువారి పూర్తినామము వెంకటాద్రిస్వామి యని, వీరు సద్గురు త్యాగరాయల సమకాలికుడందురు. వీరి కీర్తనలలో "వారణశైల విహారా" "కరిగిరిసదన" "కరిరాజవరద" అను సంకీ తములే చాలా హెచ్చుగా కనబడుచున్నవి. మఱియు నొకకీర్తనమున మఱింత స్పష్టముగా "సామజ భూధరసదనమునను ఘనహేమ పీఠము నందున భూమినీళ శ్రీభామసమేతుడగు సామజవరదుని" అనికూడ వ్రాసియున్నాడు.ఒక కీర్తనమున "కరిరాజవరదుడు మము గన్నవాడు కాంచినగర నివాసుడై మించినాడు" అనికూడ వ్రాసినాడు. దీనినిబట్టి కంచికి సమీపమున నున్న 'కరిగిరి' నివాసుడైన స్వామి వీరి యిష్ట దైవమనియును, వీరు కాంచీ నివాసులనియు తెలియుచున్నది.ఇంతేకాక కరిరాజవరదుని తరువాత ముఖ్యముగ 'సుందరరాజస్వామి' యంకిత ములుకల కీర్తనములున్నవి. ఇంకను 'తిరువల్లి నివాసుని' 'పార్థ సారథినింభజన'సేసిన కీర్తనలు, కావేరీతీరస్థ శ్రీరంగధామకీర్తనలును వేంకటాచలపతి కీర్తనలును కలవు. ఇట్లే పెక్కుదైవతముల యంకితములుగల కీర్తనలున్నవి. వీరి స్వకీయముద్ర యేదియును గానరాదు. దీనినిబట్టి తీర్థయాత్రలొనరించుచు నాయాస్థలదైవతముల కీర్తించుచు వ్రాసినకీర్తనలని తెల్లమగుచున్నది.

సాహిత్యమునందు, భావములయందును క్రొత్తదనముగాని విశేషములుగాని యేమియును లేవు. కాని శైలిమాత్రము కించిదంచితమై యున్నది.

ప. నవ నీరదశ్యామా నత కుముద సోమ

అ.ప. భువనమోహన నిన్ను బొడగనుటెన్నడో

చ. భాషాపతిజనకా నేజేసిన
దోషములను ఎన్నక
ఘోషించే దారవని పొందుగ నమ్మితి
శేషశయన సురరాజసేవిత చరణ ॥న॥

చ. కనకరుచిర చేలా కమనీయ కపోల కస్తూరిఫాలా
జననమరణము చేజిక్కి నిరతము పొరలు
చుండెడి నను బ్రోవరా శ్రీధరా ॥న॥

కదళీపాక మనోహరమైన ఇట్టి కమనీయశైలిగల కీర్తనలింకెన్నోకలవు.

వీరు తమ కీర్తనల సంపుటమునకు హరినామ సంకీర్తనములని పేరిడిరి. ఆరభి, యమునాకళ్యాణి, శంకరాభరణము, జంఝూటి, మాంజ, అసావేరి. కాంభోజి, నీలాంబరి, కమాసుభైరవి, ఆనంద భైరవి, ముఖారి, ధన్యాసి, అఠాణా మున్నగు రాగములలో నియ్యవి కాన్పించుచున్నవి. ఆది, అటతాళములను హెచ్చుగ గైకొని ధన్యాసి లోని "ఎంతని నేవిన్నవింతు దంతిరాజవరదా
పంతమేల నాతోనీకు భక్తజనచింతామణి"

అనుకీర్తనకు మాత్రము "జుల్వ"తాళమును వాడిరి. మేలుకొలుపులు, పవ్వళింపుసేవలు,లాలిపాటలు, మంగళహారతులు నున్నవి.

శ్రీరాగములోని

జో కమలదళనేత్ర జో వరచరిత్రా
జో శ్యామలగాత్ర జో నందపుత్రా ॥జోజో॥

చ. దేవకీదేవి వసుదేవులకు బుట్టి
బావింప కాళియోరగముపై మెట్టి
కావరించిన యట్టి కంసు తలగొట్టి
భావజునిగన్న చక్కనిముద్దుపట్టి ॥జో॥

చ. పన్నీరుగంధంబు బాగుగాబూసి
ఉన్నతంబుగ తులసి వనమాల దాల్చి
వన్నెమీరిన కనక వసనంబు దాల్చి
పన్నగాధిపునిపై బవళించిమించి ॥జో॥

చ. కాంచిపురమునందు కరిశైలమునను
అంచితంబుగ గోర్కెలతిశయిల్లగను
చంచలాక్షులు వీణ చెలగి మీటగను
పంచశరజనక నిద్రించువేడుకను ॥జో॥

ఈ జోలపాట తెలుగునాట మిక్కిలి ప్రచారమున నున్నది. 'సౌరాష్ట్రి'లోని "హెచ్చరికై యుండు దిక్పతులార" అను హెచ్చరిక పాట యొకటి కన్పట్టుచున్నది. అంత్యమున 'సురట' యందును. 'యదుకులకాంభోజి' యందును 'మనవాళస్వామి'కి 'భాష్యకారుల'కు, రామానుజస్వామికి మంగళములున్నవి.

ఈ 'హెచ్చరిక' కీర్తనము ప్రపత్తిమార్గ కీర్తనలలో ఒక ఆచారము కావచ్చును. పరాంకుశదాసును నిట్లే హెచ్చరిక కీర్తన వ్రాసియుండెను.

పరాంకుశదాసు డిటీవలివాడై యుండును. ఈతడు మద్రపురి ప్రాంతవాసుడు. శ్రీరామభక్తుడు. పట్టాభిరామమూర్తి యాతని యిష్ట

దైవము. తిరువేంగడ గురుడు తనకు చక్రాంకితమొనర్చి ఊర్ధ్వ పుండ్రములుంచి శ్రీపాదతీర్థములుంచి తళిగప్రసాదమిచ్చి సుతునివలె బ్రోచెనని ప్రథమకీర్తనమునందే గురుని కృతజ్ఞతా వందనపూర్వముగ స్మరించెను.

"భజరే యతిరాజం" "ధ్యానించవేరా మానుజగురుని" అను కీర్తనలలో వైష్ణవ గురులను స్మరించెను. 'సౌరాష్ట్ర'లో వేంకటాద్రి స్వామివలె "శ్రీజానకీకుచ కుంకుమచిహ్నిత సద్వక్ష రాజీవదళాక్ష రఘురామా హెచ్చరిక" యనుచు హెచ్చరికలు వ్రాసెను. ఈతడును ననేక కీర్తనలు వ్రాసిన వాగ్గేయకారుడే. పాండిత్యసుగంధము హెచ్చుగా కలవాడే. కాని వేంకటాద్రిస్వామి రచనయందలి మాధుర్య గుణమును, సౌమనస్యమును నంత హెచ్చుగా కాన్పింపవు.

"దాసజనోద్ధార దయజూడవేర
మోసబుచ్చేది ధర్మమో లక్ష్మీనరహరీ ॥దా॥

చ. పరమపురుష నిను ప్రస్తుతింప నాతరమౌన
దశరథతనయ కావుమిదే హరీ ॥దా॥

చ. మాయజూపేదీ మాధవయిది
న్యాయముగాదురా ననుగన్నతండ్రీ ॥దా॥

చ. శరణుజొచ్చితి నాపయి చలమేల జేసేవు
ధరణి 'పరాంకుశదాసు' నీడేర్చు హరీ ॥దా॥

వీరిది పరాంకుశముద్ర.

"నన్నువిడచి కదలకురా"అను కీర్తన 'మట్టు'(వరుస) "నిన్నేనమ్మితి రా రామయ్య" అనియొక కీర్తన నొనర్చిరి. ఇట్లే పూర్వులమట్లలో ఇంకను కొన్ని కీర్తనలు రచించిరి.

"శ్రీమత్పద్మినీ వల్లభాన్వయ సుధాంభోనిధి సంభూత రాకా శశాంకా, శరణాగతార్తి సంరక్షణ బిరుదాంకా, మైథిలీ కుచకుంభద్వయ పరిలిప్తచందన కుంకుమమృగమదకర్దమాంకిత ఘుమంఘుమిత శ్రీవత్సవక్షాత్రైలోక్యరక్షాతత్పర దక్ష-" ఇత్యాదిగానున్న వీరి చూర్ణికా రచనమును బట్టి వీరు గొప్పపండితులని యూహింపనగుచున్నది.

'శ్రీకృష్ణ జయంతి' యను హరికథను కూడ వీరు వ్రాసినట్లు జనశ్రుతి. వీరును సామాన్య రాగముల నన్నిటిని వాడిరి. ఫరజు రాగమును ఎక్కువగా వాడిరి. అంత్యమున లాలిపాటలు, మేలుకొలుపులు, మంగళహారతులు మున్నగునవి వరుసతప్పక రచించిరి.

నిట్టల ప్రకాశరాయడను నింకొక సంకీర్తనకారుడు పెద్దాపుర వాస్తవ్యులగపడుచున్నారు. వీరి కీర్తనలలో భద్రాచలరామ సంకీర్తన మధికముగ గన్పట్టుచున్నది.

'కలియుగవైకుంఠం శ్రీభద్రాచల మిదుగోగనుడీ- ॥క॥
పలుమరు శ్రీపతిపదముల పైబడి భక్తినివేడుడు జనులారా
పరమభక్తజన పాదధూళి పైపైని జల్లుకొండి నరులారా
భక్తులందణగించిన నరకముగతి వినుడీ ॥క॥

"గౌతమి నేకనుగొంటిని - కన్నులపండువుగాను
రాతినాతిగజేసిన సీతారాముల కరుణారసమున ॥గౌ॥
ఎట్టితపము జేసితినో యెట్టినిజము బల్కితినో
ఎట్టి భక్తవరుల పాదమట్టి ముట్టి పుట్టితినో
యిట్టి దివ్యక్షేత్రములను ఇపుడు జూడగల్గె నాకు ॥గౌ॥
కరుణతోడ నిట్టప్రకాశయ కవివరేణ్యు నరసి బ్రోవుమనుచు
భద్రగిరివిహారుని చరణములను స్మరణచేసి పరవశమున
మేనుమఱచి గురుకటాక్షమున పెద్దాపురము వదలి ॥గౌ॥

అను నీరెండు కీర్తనములయందును పైవిషయములు వ్యక్తమగు చున్నవి యాత్రగా రాణ్ణగరికిని, భద్రాద్రికిని వచ్చినపుడివి వ్రాసె ననవచ్చును.

వీరి రచనలిట్లు సర్వసామాన్యముగ నున్నవి. అవి యైనను చాలకాలదిగ వ్రేళ్లపై లెక్కింపదగినంత తక్కువగ నున్నవి. కాని వీరిపేరు మాత్రము చాలా ప్రసిద్ధిగా తూర్పుగోదావరి జిల్లాయందు చెప్పుకొనుచుందురు.

గుంటూరుపుర వాస్తవ్యులు తూము అప్పయ్య కమలాసతులకు జన్మించి మించిన నరసింహదాసుడును నిట్టిశ్రేణికి చెందిన వాగ్గేయ కారుడే. ఈతడు బాల్యమునుండియు సుశిక్షితుడై యాంధ్రసంస్కృత ముల నభ్యసించెను. అంతేకాక సంగీతాధ్యయనముచేసిన కళాకుశలుడు. ఈయన గుంటూరు డివిజన్‌లో కొలువుకూడ జేసియున్నట్లీయన చరిత్రచెప్పుచున్నది. వీరు రామదాసు తెగలోనివారు.

"భజనచేసేవిధము తెలియండి జనులార
మీరు నిజము గనుగొని మోదమందండి
భజనచేసేవిధము దెలియక నిజముగా హరిభక్తులనుకొని
మదగజము తెగవేయలేకను సుజనులని తిరుగంగనేలను ॥భ॥

ఈ కీర్తనము చాలా ప్రసిద్ధికెక్కినది. దీనింబట్టియే 'నూలువడికేవిధము తెలియండీ' అను కీర్తన రచింపబడినది.

"కలడోలేడో శ్రీరాముడు ॥క॥
కలడోలేడో నన్నుగన్న శ్రీరాముడు
తడిసివానలకు జడిసి వేసటనొంది
కడువేడ్క ఘనుడు రాడాయెను ॥క॥
వుబ్బలిలో దారి తబ్బిబ్బునుజెంది

బొబ్బ పెట్టినగాని, గొబ్బునగాని రాడాయెను ॥క॥
"మనుజాథముల వేడవలెనా, అవమానమునకు నోర్వగలనా॥
తనువు నీసొమ్ముగదలచి యర్పణజేసి,
వినుతించుచున్నట్టి వెలలేని యానోట ॥మ॥

అను కీర్తనమున వీరు నరస్తుతి నంగీకరింపకపోవుట కాననగును.

ఈ దాసుండును భద్రాద్రిరాముని భక్తాగ్రగణ్యుడు.
"అదిగో భద్రాద్రిగౌతమి యదుగోచూడండి ముదముతో
సీతాముదిత లక్ష్మణులుకదసికొలువగా రఘుపతియుండెడి ॥అ॥

ఈ కీర్తన తెలుగునాట ప్రసిద్ధమైనది.

వీరు బహుతీర్థ ప్రదేశములకేగియు ఏ కష్టములు సంప్రాప్తించి నను భద్రాద్రిరామునే ప్రార్థించుట కాననగును.

మేలుకొలుపులు, జోలపాటలు, మంగళహారతులు మున్నగున వెన్నియో వీరి రచనలయం దగపడుచున్నవి. యాత్రలు చేయుచు కడుంగడు దప్పిగొని బాధపడుచుండగా నొక బ్రాహ్మణవేసమున సర్వేశ్వరుండాయనకు ప్రత్యక్షమై అదిగో చెరువని చూపించియదృశ్యు డాయెనట. ఆసమయమున పాడినపాటయే 'కలడోలేడో'యను కీర్తన. ఎక్కువ వేదాంత ప్రసక్తి లేదు. కంచెర్ల గోపనామాత్యుని కీర్తనలవలె నన్నియు ప్రార్థనాత్మకములే. ఇట్లు జీవితముగడపి తుదిని హరినామ స్మరణతో ముక్తినొందిన మహానుభావుడు.

ఇట్లే కీర్తనవాఙ్మయమునకు చెందిన కీర్తనల రచించిన వారిలో పెద్దిదాసొకడు. వీరు తంజాపురివాసులు. తంజాపురి శేషాచలసెట్టికిని భాగీరధికిని బహుజన్మతపఃఫలముగ బలిజ కులమున జన్మించిన మహానుభావుడు. పెద్దిదాసుడు బాల్యమునుండియు వెంకట విఠలరమ ణుని సద్భక్తశేఖరుడై మనువు గడపెను. పెద్దిదాసుడు యువకుడగు

నప్పటికి తండ్రి శేషాచలసెట్టి వృద్ధుడై తానొనరించుచున్న కొలువు నకు బిడ్డను పొమ్మని బ్రతిమలాడెను. కాని పెద్దిదాసు రాజులకొలువు నొల్లక నిరాకరించెను. అటుకాదని తండ్రికులవృత్తియగు గాజులమ్మ మని మలారంబు నిచ్చినను కనిన స్త్రీలకును కాసులడుగక కరముల దొడగటు చనెను. "గాజుల వేపారము జేసెను పెద్దిదాసుడు ॥గా॥" అను కీర్తనయందీ విషయము స్పష్టముగ గాన్పించుచున్నది. తరువాత ఇట్లుచితముగ నందఱను బిలిచి గాజులిచ్చుచుండుటచే సాహెబు వ్యాపారము బూబుముక్కు పోగులకు చాలకపోయె నన్నట్లు అసలుకే మోసమురాగా తల్లిదండ్రులు కడు దురపిల్లిరి. వారిని చేరదీసి పెద్దిదాసు 'సంసారమసారము కావున సంసారమును నమ్మి హరిభజన మానుట లగ్గగు పనికాదు. కావున నాకొఱకు మీరు చింతింపవలదు,' అనివారినూరార్చి మౌనియయ్యెను.

పిదప కొన్నినాళ్లకు తంజాపురి నేలు మన్నార్నాయడు నిండు కొలువుననుండి తనయాస్థాన పండితులను బిలిచి సర్వేశ్వరుండగు హరిని గూర్చి యా దేవదేవు డుండెడి యూరేదియని యడిగెను. పండితులా ప్రశ్నకుత్తరము నీయఁజాలక "పన్నగ నరసింహుని గొలుచుచు పెద్దిదాసులున్నారని" రాజునకు విన్నవించిరి. రాజంత వారిని కొనితెండని భటులనంపెను. అంత పెద్దిదాసు "పామరుల చెంత జేరము శ్రీరామనామమే నమ్మినారము. ఈమహి సంసార హీనులతో చెల్మిసేయక శ్రీహరి శరణుజొచ్చి యున్నాము" అని రాజాహ్వానమును గైకొనకపోయెను. అంత ప్రభుడు కోపించి నిర్బంధమున రప్పించి చాలా అవమానముల పాలుచేసి కారాగారమున నుంచెను. హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుని బలుబాముల బెట్టినట్లుగా ఏను గులచే ద్రొక్కించి, పాముల కఱపించి బాధించి కడకాసాధుపుంగవుడు శ్రీహరిస్మరణమున దనకు లొంగకయుండగా ఉరిదీయించుటకు పూను

కొనెను. అప్పుడు శ్రీహరి మన్నార్నాయనికి కలలోగనబడి యాపెద్ది దాసు పరమభాగవతోత్తముడనియు వానిని హింసించుట తగదని బుద్ధి చెప్పి యందులకు నిదర్శనముగ దాను మన్నార్నాయని బాధింప మొదలిడెను. అంత రాజు బుద్ధితెచ్చుకొని వేవేగ ఉరికంబముకడకు పరుగెత్తి ఉరినాపించి పెద్దిదాసుని క్షమాపణ వేడుకొని మంగళతూర్యారావములతో నామహాభాగు నూరేగించి శ్రీరంగదేవుని కడకుగొంపోయి యాదరించెను.

య....క. ఆదితాళము

"నారాయణ నీనామమే జీవనము॥క్షీరాబ్ధి శయనుడా
శ్రీవేణుగోపాల మేనుబాధ తాళజాలక జామీఖుడు తన
సుతుని బిల్వగాను కింకరులబట్టి వేగగర్వమణంచి బ్రోచిన॥నా॥
"కరుణజూడుము నను కమలాపతీ ॥క॥ నీపాదములే గతి
యని మరిమరివేడితి కళ్యాణవెంకటపతి నిరతమునమ్మితి ॥క॥
"గోవిందా యెట్లోర్చియుందు రా-రా
భావజజనక నాభాగ్యమేమందు
సిరులిచ్చిచాల యలసితివో నన్ను
భరియింపలేనని పరువు లెత్తితివో॥గో॥
ఎదిరించి మాటాడితినా నిన్ను వదరి
బ్రహ్మేంద్రాది పదవు లడిగితినా
కలకాలమీ కుటిలమేమీ శేషా
చలదాసుపై నింతచల మేల స్వామీ ॥

కారాగారమున క్లేశములనుభవించుచు నిట్లు పలువిధముల నప్పరమాత్మని కీర్తింపదొడంగెను. ఈతని కీర్తనములలోనిముద్రలు ఒండురెండువిధములుగ నుండెను. పైకీర్తనల తండ్రిపేరున ముద్ర యుండెను. 'నరసింహదాసుడని వెంకట విఠలరమణుడనియు' ముద్ర లుండెను.

ఈతని జీవితమునకును రామదాసు జీవితమునకును కారాగార క్లేశాదులలో పోలికలు కన్పట్టును. ఆతనివలె నీతడు ఆర్తితో భగవన్నామము చేసినవాడే- ఆ ఆర్తియు, ప్రార్థనాపరతయుదక్క, ఇంక ఏ వేదాంత బోధయు నీకీర్తనలలో గానంబడదు.

దక్షిణభారత దేశమునందలి కావేరీపాకవాసియగు గౌరీకులజాతి సంభవుడు చీటిలంగడికావేరిపాకం పార్థసారధినాయుని కుమారుడు రామానుజదాసు డొకడీయాధునిక కీర్తనకర్తలలో ప్రథితనాముడై కన్పట్టుచున్నాడు. తల్లి వేంకటాంబ. శ్రీమచ్ఛంబాడి తిరువడి సంబంధ మరసినవాడును, శ్రీసుదర్శన గురుశిష్యవరేణ్యుడునైన యీతడు, స్వర వీ౦సింహుడైన వేణుగోపాల పండితునిఁడ సంగీతాధ్యయన మొనరించెను. దేశదేశముల దిరుగుచు పలువిధములగు హరికధలను జెప్పుచు ప్రశస్తకీర్తి నార్జించినవాడు. వీరికీర్తనలను హరికథా కధానకనైపుణిని ప్రశంసించుచు పలుదేశములయందలి సంగీత సాహిత్య విద్వాంసులెల్లరు గద్యపద్యాత్మకములును కీర్తనాత్మకములునగు సభిప్రాయంబు లొసంగియుండిరి. 'భరతకళా సంభరితుడ'. నియు ''పల్లవి రాగప్రస్తార స్వరకల్పనాల గ్రంధరచిత శ్రీహరి కధాపూజిత" ఇత్యాది లక్షణగుణసంయుక్తుడనియు కీర్తింపబడినవాడు. ఈతడు ''సుదర్శన రామానుజదాసతనికీర్తనలు" అను పేరనొక కీర్తనసంపుటి గ్రంధమును ప్రచురించెను.

ఈయన విష్ణుమతానుయాయి. ఈ సంగీతప్రబంధారంభమున నిష్టదేవత ప్రార్థన కంటెముఖ్యముగ ఆచార్యపరంపరయగు రామానుజ శఠవైరి శఠకోపయతీంద్ర మనాథముని మణవాళాచార్యాదుల స్తుతిని మున్ముందొనరించెను. ఇంక నీకీర్తనలలో అన్నియు వైష్ణవ దేవ సంకీర్తనములే. బాలగోపాల వేంకటేశ్వర, ప్రసన్నరాఘవ, పండరివిఠలేశ

రమాదేవీ త్యాదులసంస్తవములే. ఎచ్చటో నొండురెండు మానసిక ప్రబోధములు కన్నట్టుచున్నవి.

ఇంతేకాక 'తంగచిందు' (వీరరాఘవతంగచిందు మానసబోధ తంగచిందు) మానస ఉత్తర ప్రత్యుత్తర "వివేక వినోద విలాసము" శ్రీప్రసన్నరాఘవ దివ్యనామామృత "శృంగార నవరస నారపదము" లేక 'ఎరుకలవాంఛ్రపదము' శ్రీప్రసన్నరాఘవ 'శృంగారవిలాసము' లేక"శక్కిలిసింగారపదము" "శ్రీ ప్ర రా శృంగార వరిదంపుడు, లేక "నెల్లుకుత్తురపదము' మున్నగు ద్రావిడపదరీతుల ననుసరించి తెలుగున కీర్తనల నొనరించిరి. ఇదియొకటి వీరిరచనలో విశేషము. ఇవియేకాక సాధారణ తెలుగురచనలగు 'రగడ'ల పద్ధతి కీర్తనలును కలవు.

పడిగెల పురవాసులు పుష్పాల వంశస్థులు మల్లెంమల్లయ సుతుడు మల్లెంకొండయ్యగారి రామనామామృత సత్సరూపసంకీర్తనలు అనుపేర కొండొకపత్రమగపడుచున్నది. ఇందే 'రామతత్త్వజ్ఞాన సుబోధ వచనములు శ్రీమద్వేదాంత పరిపూర్ణ అచల నిర్గుణవచనములు

అనుపేరి తత్త్వములు నున్నవి. తత్త్వములలోని రచన కొంచె మిటంపుగనున్నది-

"పెండ్లికిపోదాము రండయ్యా సజ్జనులారా ॥పెం॥

అ॥ప॥ పెండ్లికి పోదామురండి ప్రేమగల హరిభక్తులంతా
కండ్లకు యింపైన మోక్షకారణంబగు ముక్తికాంతా ॥పెం॥

చ. చరణములు మూడుమూలలు
గల్లను ఘనమేడలోపల
వేడుకలరగ చూడసుందరమైన
హంసచేరియుండె జాడబట్టుక ॥పె॥

ఇంకను నిట్లే బుద్దాల నాగయ్యగారు మున్నగువారెందఱో ఈ సంకీర్తన వాఙ్మయకర్తలు కానవగుచున్నారు.

రంగనాయకి యనునామె వ్రాసిన ఆండాళ్ళుచరితమనునొక గేయ ప్రబంధ మగపడుచున్నది. ఇందును కీర్తనలు యాలలు వచనములు కనబడుచున్నవి. ఈ కీర్తనవాఙ్మయమునందు చాలావరకు హరికధల పద్ధతి గానవచ్చుచున్నది.

అనేక భజనసంకీర్తనల పద్ధతిగాను, ఆడువారిపేరంటములకు పనికివచ్చునట్లుగాను కీర్తనలు రచించిన నరసింహదాసుడొక సుప్రసిద్ధ కీర్తనస్రష్ట కానంబడుచున్నవాడు.

మురారి దానవ వరుస—
మురారిమాధవ బిరాన బ్రోవర పరాకేల రఘునందన
ధరా రమణ నను నిరాకరించక మొరాలించు మధుసూదన॥

పాట ఎంత చిన్నదియయ్యెను నూత్న భావ సంయుక్తము కాకున్నను హ్రస్వాక్షరముతో మొదలిడి దీర్ఘాక్షరము ప్రాసాక్షరముగ దీసికొని కేవలము జగణ భగణములతోడి. గతిని నడుపగా పాటకొక లయబద్ధమై యందగించిన నడకయబ్బినది. ఇదినాటకపు పాటలపద్ధతి వరుస.

ఇట్లే ఆకర్షణీయములగు వరుసలతో నీయనరచించిన పాటలను తెలుగునాట పెక్కురు పాడుచుంద్రు. వీరు వ్రాసినవి మంగళహారతులును నున్నవి. మంగళహారతుల ప్రసక్తి రాగానే మంగళహారతులు రచించిన స్త్రీలనుగూర్చి వ్రాయవలసియున్నది. ఒక ప్రత్యేకాధ్యాయముగ స్త్రీల రచనలను గూర్చి ప్రస్తావించుట మేలు.



# స్త్రీల కీర్తన వాఙ్మయము

స్త్రీలలో కీర్తనలు జేసినవారిగూర్చి చరిత్ర వ్రాయవలసి వచ్చినప్పుడు మున్ముందు దృష్టిపథమున పొడగట్టునవి. 'ఊర్మిళాదేవినిద్ర' లంకాయాగము కుచ్చెలకథ, మున్నగునవి. వీనియందలి భాషయు భావములును నివిస్త్రీల రచనములాయని తలపింపజేయుచున్నవి. కాని వాని కర్తృకత్వము విషయ మింకను విచారణీయాంశముగనే మిగిలిపోయినది.

వానివిషయమటుండ 1840 ప్రాంతమున జీవించి వేంకటాచల మహాత్మ్యము మున్నగు ననేక ప్రబంధములను, యక్షగానములను రచించి కవయిత్రిగా పేరొందిన తరికొండ వెంకమాంబ వాగ్గేయ కారిణిగాకూడా ప్రశంసింపదగిన ప్రజ్ఞావతియే.

వేంకటేశ్వర సన్నిధానముననుండి యాదైవమే తనకు పతిదైవతముకాగా నాస్వామిపై నెన్నివిధముల కీర్తనలనో రచించినది. శైలికూడా మనోహరమై ఉజ్జ్వలమై చెలువొందినది.ఆమె కీర్తనలలో సింగారింపుపాటలు, బువ్వబంతిపాటలు, అలకదీర్పుపాటలు, ఆరగింపుపాటలు, హారతిపాటలు, నిదురబుచ్చుపాటలు, వేడుకపాటలు నింకెన్నెన్నో సమయానుకూలముగ రచించినవికలవు. మచ్చునకొండు రెండు.

ఆరగింపుపాట –

''శ్రీలక్ష్మిస్థితాంగ, చిద్రూప,
చిన్మయా, శివనుత, శుభాంగ రావయ్యా.

అ॥ప॥ మేలైన భక్ష్యములే చాలతెచ్చినాను నీలవర్ణ తినిపోవయ్యా।
శ్రీవెంకటేశ్వర రావయ్యా బ్రహ్మాండనాయకా రావయ్యా॥శ్రీ॥

వెన్నెలగంటి హనుమాయమ్మ

ఈమె నివాసము–

కడపమండలమునందలి వాయల్పాడునకు నాలుగుమైళ్ల దూరముననున్న తఱికుండ. ఈమెను గూర్చినచరిత్ర తెల్గుదేశీయుల కందఱకును బాగుగా తెలిసినదే.

1875 ఆగస్టున నెల్లూరుమండలమున కోవూరు తాలూకా చెన్నూరగ్రహారమున వెలగపూడి సుందరరామయ్యగారికి జన్మించి గృహముననే ఆర్షసంస్కృతి సిద్ధమగు సంస్కృతవిద్య నధ్యయన మొనర్చి, మెలమెల్లగా సంస్కృతమున తేజస్వితయగు కవిత నల్లనేర్చిన విదుషీమణి వెన్నెలగంటి హనుమాయమ్మగారు. ఆమె సంస్కృతమున మూడుగ్రంధముల రచించినది. అందొకటి 'దత్తపూజా కదంబకమ్' అనునది. దీనిని ప్రకాశముద్రణాలయమువారు ప్రచురించిరి. ఇది కీర్తనాత్మకముగనున్న గ్రంధము.

ఈ పూజా గీతములలో మేలుకొలుపు మొదలుగా సమస్తోపచారములతో మంగళాచరణము వఱకును గలవు. ఈపొత్తమును బొంబాయి కోస్తాలోని దత్తోపాసకులు బాగుగా మన్నింతురు. దీనియందీమె చూపిన సంగీత పరిజ్ఞానము విశిష్టమైనదని విజ్ఞులందురు. గ్రంథములు దొరకుటే యరుదుగ నున్నది.

ఇది ఇట్లుండ తంజాపుర ప్రభురాయలై సంగీతశాస్త్ర విజ్ఞానఖనియై గోవింద దీక్షితులు వేంకట ముఖిప్రముఖ సంగీత శాస్త్రజ్ఞుల కొజ్జయైన రఘునాధనాయకునిచే సమ్మానమంది సంస్కృత కావ్య ప్రణేత్రిగా ప్రశస్తినొందిన 'మధురవాణి'యు త్యాగరాయల ప్రశిష్య వర్గమునకు చెందిన 'అమ్మాజీ' యను నామెయు వాగ్గేయకారిణులుగా నగపడుచున్నారు. మధురవాణి తన ప్రభుడాలాపించిననూతనరాగాదులలో

దానును నైపుణ్యముగ రచనములజేసిన ప్రోఢ. అంతేకాక భగవద్గీతను కీర్తనలుగా రచించిన మాననీయురా లొకరుకలరని పరిశోధకులనిరి. కాని వీరికృతులు కన్పడకుండుట శోచనీయము.

ప్రాక్తనకాలమునుదాటి ఆధునికకాలమునుగూర్చి ప్రస్తావించు నెడ మంగళహారతుల రచనలలో స్త్రీల ప్రవేశము బాగుగా కనబడు చున్నది. సాధారణముగా శుభకార్యములపట్ల స్త్రీలుపాడుకొను పాట లలో నివిచాలగ కనబడును. అట్టివారిని కొందఱను నీ క్రింద పొందు పఱతును.

అచ్చమాంబ

"దేదీప్యమాన విగ్రహ గొనుమ దీపహారతి
అ॥ప దీవన లొసంగు మిదే దివ్యహారతి ॥దే॥
చ॥ జ్యోతిర్మయా ఆత్మగొనుమ ఆత్మజ్యోతి హారతి
పాతకసంహార యిదే భవ్యహారతి ॥దే॥
చ॥ గంభీరగుణా గైకొనుమ కుంభహారతి
శుంభత్కిరీటజూట యిదే విజృంభత్‌హారతి. ॥దే॥

గిడుగు సత్యవతి

అంబమంగళం జగదాంబ మంగళం
అ॥ప అంబముఖ శశిబింబ శ్రీ శ్యామలాంబ మంగళం
చ॥ ఈశుకొమ్మరమ్మ నాదోస మెన్నకమ్మ
వాసిగనీకృప నాశించితో లలితాంబా ॥అం॥
చ॥ సకలలోక మాతా ధర సత్యవతీవినుత
అకలంక హృదయ ఇకజూపు నీదయ ॥అం॥

"గిరిసుతా సతీపార్వతీ కరుణతో గొను హారతీ
ఏల జాలమో వాలుగంటి కృపాలవాల నన్నేలు మాకృపన్॥గి॥
పంతమేలనే కంతువైరి నెలంత నీదయొక్కింత జూపుమా॥గి॥
చ॥ భువనమోహినీ శివునిభామినీ అవనిగిడుగు సత్యవతి
పాలినీ ॥గి॥

ఈమె రచనలిట్టి అలంకారశైలితో అంబాసంస్తవాత్మకములై వీను మిగిలియున్నవి.

అనేకములగు నవలలు రచించి మిక్కిలిపేరుగాంచిన రాజ్ఞగర వాసిని శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు కీర్తనవాఙ్మయ కర్త్రి కూడనై యున్నది. సందర్భమునుబట్టి సమయోచితముగా నాశువుగా ఈమెపెక్కుకీర్తనలను చెప్పియుండిరి. వీరు గృహలక్ష్మి కంకణ భూషితులు. మహాత్మాగాంధిపై చెప్పిన యొక హారతి.

"మమ్ముగావ గాంధిదేవ మహిని వెలసినావా
కర్పూరహారతిదే కరుణతోగై కొనుమ
కరుణసాంద్ర మోహనదాస కస్తూరీనాథ ॥మ॥
సుగుణభూష సుజనపోష మృదుసుభాష
నీకునిదే ముత్యాలహారతి ॥మ॥
చ॥ కాటకములు దాటుటకు ఖద్దరని తెల్పితివి
కమలపరదు డేలుగాత కలుములెల్లగూడుగాత
కరువులెల్ల బాయుగాత॥మ॥
ఇట్లువారెన్నోకీర్తనలను రచించిరి.

లక్ష్మణాపరిణయము మున్నగు ప్రబంధములను అనేకశతకములను, నాటకములను రచించి గొప్ప విద్వత్కవయిత్రిగా విశ్రుతి వడసిన విజయవాడ నగరవాస్తవ్యురాలు శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారి కీర్తన రచనము మెచ్చదగినది. వీరు విడివిడిగా కీర్తనలు రచించుటే

కాక రామాయణమును కీర్తనలుగా రచించిరి. శ్రీమతి ఇందుమతీదేవి గారి కీర్తనల నొప్పరికింతము –

కాంభోజి :–

కమలాస్యా యిదేవింటివా కౌసల్యరాముని
కాకుత్థ్ససోముని ఘనశౌర్యగుణములు
అమరులు నుతిసేయ నసురుల జండాడి
యమిజన్నమునుగాచి హల్య బ్రోచెనట ॥క॥
మునివెంట జనుదేరు ఇనవంశతిలకుని
కనుల కఱవుదీర గంటినే గంటినే ॥

అను కీర్తనమున స్వయంవరమునకు రామునిగూర్చి సీతమ్మతో చెలియలు చెప్పిరట.

ఇక రామచంద్రుని తమ్ములనుగూర్చి ధన్యాసిలో :
సుందరీ గంటివటే రఘునందను తమ్ముడటేవో ॥సుం॥
ఎందఱెందరొ రాజనందనులను గందు
మందఱకీయంద చందంబు లున్నవా॥సుం॥
పసిడినెమ్మేనేయె మిసిమీ బుగ్గలేమె
కొనదేలుముక్కైతె కోటివరాలేనె ॥సుం॥
వెన్నెల నవ్వేమె పన్నులతీరేమె
కన్నులనీరేమె కడగంటిచూపేమె॥

ఇట్లు చక్కని ఫణితిలో వీరు బంతులాటల పాటలు – బువ్వ బంతిపాటలు, హారతిపాటలు అన్నియును రచించిరి.

బాపట్లవాస్తవ్యురాలు అడవి అన్నపూర్ణమ్మ యనునామెయు సినిమాపాటల వరుసలతోడను, స్వతంత్రమగు బాణీలతోడను కీర్తనలు రచించుట కాననగును.

రామకథామృత మనుపేరిట యొకకీర్తన :-

"రామరామ శ్రీరామ రామరామ అనరాదా మనసా రామ
యనరాదా

ప్రేమమీర రఘురాముని వేడిన కోరికలెల్లను తీరునుగా
పామరజనులను పరిపాలింపను పదియవతారంబులు దాల్చెనుగా
॥రామరామ॥

శ్రీచింతలపూడి నీలాచలముగారి పుత్రీమణియు శ్రీపులుగుర్త వేంకటరత్నము పంతులుగారి సతీమణియునైన కాకినాడ పురవాసిని శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు ఆంధ్రవాఙ్మయరంగమునకు చిరపరిచితులే. ఈభాషారాధకురాలి మఱియొక ఉదాత్తరచనమే 'మంగళ హారతుల శతకము'. ఇది 1923 వ సంవత్సరమున ముద్రింపబడినది.

ఇట్లే తెలుగువాఙ్మయ రంగమున మిక్కిలి ప్రశస్తివహించిన నారీరత్నములు శ్రీగిడుగు లక్ష్మీకాంతమ్మ, జొన్నలగడ్డ శారదాదేవులు. వీరిర్వురును జంటకవయిత్రులుగ పెక్కుగ్రంథ ప్రసూనములను బంధించి శారదయఱుత నొక దివ్యభూష నర్పించిన ధన్యాత్మురాండ్రు. వీరి "లక్ష్మీశారదాగీతము"లలో అన్నివిధములగు కీర్తనములున్నవి.

ఒకలాలిపాట-

లాలి శ్రీరామచంద్ర సుచరిత్ర లాలి కౌసల్యపుత్ర లాలి
జగదేకమిత్ర మునిస్తోత్ర లాలి రమణీయగాత్ర ॥లా॥

చ. కాంతామతల్లులంతా నిన్నెంతొ సంతసంబున నూతురు
కంతుడా పోరుసుంత మానరా - యింతలోవచ్చు శాంతా ॥లా॥

అప్పగింతలపాట -

"మాబాలనప్పగించితి
ఈబాల సుశీల - సుగుణాలవాల - మాబాల నెఱుచూచెదో॥

చ. లావణ్యరాశీ యిది మాపుణ్యఫలమిది
కారుణ్యమయ సదయహృదయ ॥మా॥

ఇట్టివెన్నో కలవు. ఇట్టి కీర్తనలలో నరయదగినసాహిత్యముండ కుండుట అందఱకు తెలిసినదే. ఈరీతి మంగళహారతులు జోలపాటలు బువ్వంబంతిపాటలు, చెండ్లాటపాటలు నెన్నో అసంఖ్యాకముగా తెలుగునాట వ్యాపించియున్నవి. ఆయా కీర్తనలకర్త లెవరెవరో ఎఱుంగుట అసాధ్యమైనవిషయము.

ఇవి యిట్లుండ ఆధునిక కాలమున నేర్పడిన అనేకములగు పరిణామములనుబట్టి మతవిషయమునందు దైవవిషయము నందును నిప్పటివారిలో ఎంతయో భావపరివర్తనముతో భగవత్సంబంధమగు కీర్తనలను రచించిన వారినిగూర్చి కొంత ప్రస్తావింతము.

# నాలుగవ అధ్యాయము

## ఆధునిక భగవత్సంకీర్తనకారులు –
## బ్రహ్మసమాజ కీర్తనలు – హరికథా వాఙ్మయము

ఈ యుగమున శ్రీ వీరేశలింగముగారితో సాహిత్యమున గొప్ప సంస్కారము కలిగిన విషయ మందఱకును దెలిసినదే. అట్లే సంగీత విషయమునను గొప్పమార్పులు కలిగినవి.

బ్రహ్మమత దీక్షితులైనవారు వ్రాసిన సంకీర్తనములుకొన్ని బ్రహ్మమత స్వీకారమును సేయకపోయినను బ్రహ్మమతాభిమానులై ఆ పద్ధతి కీర్తనలను రచించిన మహాకవుల కీర్తనలు కొన్నియు నీ సాహిత్యమున కానవచ్చుచున్నవి.

బ్రహ్మమతదీక్షితులు గానియట్టివారిలో ప్రముఖులుగా వడ్డాది సుబ్బరాయ మహాకవిగారు, వేంకట పార్వతీశ్వరకవులు పేర్కొనదగియున్నారు. వారు బ్రహ్మసమాజ పద్ధతికి సరిపడు కీర్తనలు రచించిరి.

బ్రహ్మమత దీక్షితులై బ్రహ్మోపాసన కీర్తనలను సృష్టించిన వారిలో ప్రముఖులు ఆదిపూడి సోమనాథంగారు, శ్రీ మధురకవి నాళము కృష్ణరావుగారు మున్నగువారు చెప్పదగినవారు.

ఇంకను పెక్కురుకలరు. వారినిగూర్చి యవసరము వెంబడి ప్రస్తావింతము.

ఇట్టి రమణీయపద్ధతిని ఇటీవల ఉపాసన కీర్తనలు వ్రాసిన వారిలో ప్రముఖులు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు.

శ్రీ వడ్డాది సుబ్బారాయుడు గారినిగూర్చి ఎఱుగని తెలుగు సాహితీవేత్తలుండరు. ఈ మహాకవి 'భగవత్కీర్తనలు' అను పేర నొకకీర్తనప్రబంధమును రచించి వెల్వరించిరి.

వడ్డాది సుబ్బరాయ కవీంద్రునివలె మహాప్రసిద్ధిగాంచిన కవి వరేణ్యులు వేంకట పార్వతీశ్వరకవులు. బావమఱందులైన వీరిర్వురును జంటకవులై సుందరాంధ్ర వాఙ్మయ నందనోద్యానమున పరిమళ పారిజాతముల వికసింపజేసిన నవభావకవులు. విశ్వమంతయు వెన్నెల తీవలు ప్రాకునట్లు దిక్కులన్నియు దివ్యతేజమున నిండునట్లు ప్రకృతి యంతయు పరవశమ్మున పులకితయగునట్లు కొాదమ కోయిలలై మధురకూజితము లొనర్చుచువీరు పరమేశున కేకాంతసేవ యొనర్చిరి.

ఈ యేకాంతసేవయందలి ఛందము మంజరీద్విపదయైయున్నది. అయినను వీనిని ప్రార్థన సమయములపట్ల బ్రహ్మోపాసకులు కీర్తనలుగా గానముచేసెడివారట. కావున కేవల కీర్తనలు కాకపోయినను పాటలుగా పాడుటకుపయోగింపబడిన కారణమున వారి మంజరీ గేయ రచన లిచట స్మరించుటైనది.

"కళ్యాణవిభుసేవ – కావించువేళ
నేనేమి చేయగబోయి యేమిచేసితినో
ప్రాణనాయకునితో భాషించువేళ
నేమిచేయగబోయి యేమిచెప్పితినో
విశ్వమోహనమూర్తి వినుతించువేళ
నేమి పాడగబోయి యేమిపాడితినో
ప్రణయస్వరూపుని ప్రార్థించువేళ
నేమివేడగబోయి యేమివేడితినో
కట్టినపూదండ కట్టినట్లయుండ
పట్టినహారతి పట్టినట్లుండ

పెట్టిన పళ్యంబు పెట్టినట్లుండ
జుట్టినమడుపులు చుట్టినట్లుండ
వెడలిపోయినయట్టి విజ్ఞానమూర్తి
మదినేమియెంచెనో మఱలిరాడాయె.

ఆవేళమొదలుగా ననునిమిషంబు
నేరీతినుంటినో యెఱుగవటమ్మ
అవశనై చేసిన యపచారమునకు
గుణనిధానుండిట్లు కోపింపనగునె.

నా యవస్థలనెల్ల నామారుగాగ
జీవితేశ్వరునితో జెప్పుదుగాని
ప్రణయవనంబు లోపలిపుష్పరథము
తుమ్మెదా వేవేగ తోలితేవమ్మ॥

ఇందలి ప్రణయభరము పైకొనినప్పటి యవశత్వమున జీవితేశ్వరుడు ప్రమోలసాక్షాత్కరించిన స్వామికుపచారములను సహిత మొనర్పజాలని జీవుని ముగ్ధావస్థ యిందు మంజులగతిని వర్ణింపబడినది

ఆదిపూడి సోమనాధముగారు రచించిన ప్రార్థనాగీతములెక్కువ ప్రచారమునందున్నవి.

వీరును ఇట్లే "సర్వం ఖల్విదం బ్రహ్మ" యని బ్రహ్మభూత భావమున దన్మయులై గానముచేసియుండిరి.

'సురట' యందలి యీకీర్తనను గాంచుడు-
"అంతా నీదయరా అఖిలోద్ధార అంతా నీదయరా
చింతలు నీదయ చిత్తము నీదయ
వింతలునీదయ విత్తమునీదయ ॥అం॥

జనకుడునీదయ జననియునీదయ
జననమరణ సంసారము నీదయ ॥అం॥
భావము నీదయ భాషయు నీదయ
పావనతరమగు ప్రాణమునీదయ ॥అం॥

అని పరబ్రహ్మయే సర్వజగదాధారుడుకావున అంతయుఁ బ్రహ్మ కృపాహి కేవలమ్మని భావించి దీనిని వ్రాసిరి.

బ్రహ్మోపాసకులలో ప్రథములును ప్రప్రథమమున ప్రార్థన కీర్తనలను వ్రాసినవారు ఇవ్వగుంట సుబ్బకృష్ణయ్య గారు. వారు బ్రహ్మకీర్తనలను పెక్కింటిని రచించిరి. ఇప్పుడవి అంతగా ప్రచారమునందులేవు.

డ్రో॥రామమూర్తిగారి కీర్తనలు సామాన్యజన సులభమైన బాణీలోనున్నవి.

"జీవతత్త్వ మదెంతచిత్రమె చిత్తగింపర సోదరా,
పావనాత్ముని ప్రకృతినాధుని ప్రాభవంబది సోదరా
చ. క్రిములుకీటక కోటులందున క్రీడసల్పెడునేదిరా
విమలజీవపు వింతసూత్రము విశ్వనాధునిమహిమరా
చ. కొండకనుమల ఘోరవనముల గూర్చుప్రాణమదేమిరా
నిండియంతట గ్రాలుచుండెడు నిఖిలపతి ఘనమహిమరా ॥జీ॥

వీరికి సమకాలికులైనవారే సూరన్నగారనుభక్తులు వ్రాసిన కీర్తనలు మిగుల నుజ్జ్వలముగానుండుట గాననగును.

"అలసిఅలసి నీయడుగు దామరల
నాశ్రయించితినో దేవా
వలచివలచి నీపదపరాగమును
తలను దాల్చితినో దేవా

వెఱచివెఱచి నీకరుణహస్తముల
మరుగుసొచ్చితినో దేవా
అరసిఅరసి నీయమరధామమున
అడుగుపెట్టితినో దేవా ॥అ॥
తిరిగితిరిగి నీదివ్యప్రణయమును
తిరిపెమెత్తితినో దేవా
మఱలమఱల నీ మధుర నామమును
మరిగి స్మరియింతునో దేవా ॥అ॥
మనసుతెలిసి నామనవి వింటివో
మాటలెఱుగనో దేవా
మనసెకరఁగి నామతముదీర్తువో
మఱలిపోవనో దేవా ॥అ॥

ఏదియో యొక అవ్యక్త మధుర ప్రశాంతభావము పైకొనిన ఉజ్జ్వలధారయు, గంభీరోదారమగు భాషయు గలిగిన యీరచన కడు సుందరమైనది.

వెంకటచలం గారనువారు వ్రాసిన కీర్తనలయందు నిట్టి వెలుగుల ప్రసారమే కానవచ్చుచున్నది.

"వలవుమఱువవచ్చునా – నాస్వామి
నీతలపు వదలవచ్చునా
ఇలలోన మామనములను దెలిసిలీల
గలిసి చిత్సుఖమును గరుణించునట్టినీ ॥వ॥
చ. చెలువముమించునీ చేతలనేవేళ
దలచినమేనేమో పులకరించెడుచాల
నల నీగుణానుభవామృతమునుగ్రోల
గలిగిననాటి సుఖమ్మునెన్నునీపాల ॥వ॥

చ. నిలుపరాని ప్రేమ నెక్కొనమముగూడు
చెలువుడరమ్మని చేరి మ్రొక్కినవాడు
బలిమికౌగిటజేర్చి పాయక తమిదీర్చి
వెలసిన నాటివేడ్కల నెన్నినీమేటి ॥వ॥

వీరి ఈగీతికయందిట్లు విరహముతోడి వలపుచెలువము మెరయు చున్నది.

మేలుకొలుపు కీర్తనలును, మంగళహారతులును ఇంకను పలు విధములగుకీర్తనలను ఆదిపూడి సోమనాధరావుగారు, సుబ్బ కృష్ణయ్య గారు మున్నగువారు రచించిరి. ఇవన్నియు నిప్పటికిని బాగుగా వాడుకలో నున్నవి.

ఇవియన్నియు నిట్లుండ మిక్కిలి తేజోపూర్ణమగు ఉదారభావ మరీచులతో కీర్తన సుధార్ణవమును సృష్టించి భక్తులకమందానంద నిమజ్జనము చేయించిన ఉత్తమకవిత్వశిల్పి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు.వారికమనీయ కవితా లహరిలో నురుసులుగట్టని భావతరంగములు లేవు. వారి భావములలో స్పందింపని దివ్యచైతన్యములేదు. ఆర్తి, దుఃఖనివేదనము, పారవశ్యము, అభ్యర్ధనము మున్నగు పరమభావము లన్నియు పరమోత్కృష్టముగ భాసింప యాదేవదేవుని పదసేవను పూతాత్ముడైన కళాతపస్వి యీయన.

తాను మొరయించిన భక్తివీణ కడమభక్తుల హృదయాంతరాళ ములలో ప్రతిరవములీనునట్లున్ముక్తకంఠమున బ్రాహ్మభక్తిగీతము లాలాపించిన భాగ్యశాలి కృష్ణశాస్త్రిగారు.

దీనభక్తుడై పరమేశు నాహ్వానించు తీరును గాంచుడు—

"ఒకసారి రావా దేవా

ఒకనిముసమే నేను ఇకనిలువనే లేను
ఒకసారి రావా దేవా
ఏ సుఖమేనియులేక ఎండిపోయెను బ్రతుకు
ఒకసారి రావా దేవా
జాలివాన చలువజల్లుగా నొకసారి
ఒకసారి రావా దేవా
ఏమాధురియు లేక ఏలాగు మనగలనో
తీయతేనియ పాట తేటగా నొకసారి
ఒకసారి రావా దేవా
మరుగు చీకటిలోక మనలమై దహియించు
శాంత శారద పూర్ణ చంద్రుడవై యొకసారి
ఒకసారి రావా దేవా
పగలనక రేయనక పడియుండి పడియుండి
సగము నశియించాను స్వామి నీకొఱకై
ఒకసారి రావా దేవా ॥

విశ్వాత్ముడైన యాస్వామి తీయతేనియ తేటగావచ్చి మాధుర్య రహితమైన తన బ్రతుకున మధురిమలు గ్రుమ్మరింపవలెనట. చూచి తిరా వారి మధుర భావుకత ।

వీరు తమ మాతృభూమియగు తెలుగుతల్లికి నిట్లే మంగళారతిసి మన్నించిరి -

"తెలుగుతల్లికి మంగళం మాకన్నతల్లికి కల్పవల్లికి మంగళం
కొలుచు మాయెదనిలచు సాధ్వీమరాజ్ఞిమ తల్లికి ॥మం॥

చ. ప్రాతక్రొత్తల కౌగిలింతల ప్రసవమౌ బంగారుపూతల
భావికాల స్వర్గమమరుచు ప్రౌఢప్రతిభకు ॥మం॥ తె॥

చ. నరకమంటిన కారువేళల, నాకమంటిన వెలుగువేళల
ఏకగతి తెలుగమ్మ నడిపిన లోకమాతకు ॥మం॥ తె॥

ఇట్లు వారిరచనములు సాధకులకు పరమాభిమతముగ పాడదగినవై బహుళప్రచారము నందియున్నవి. ఇవికాక వీరు ప్రాస్తావికముగను పెక్కుగీతికల రచించియుండిరి. ముఖ్యముగ సినీమారంగము నందుజేరి యారంగమునకు కాంతినిచ్చు మెఱుగుదెచ్చు గీతముల నెన్నింటినో వెలువరించియుండిరి.

ఆధునికాంధ్రసాహిత్యమున మధురకవి బిరుదాంచితులై గీతికారచనమున సిద్ధహస్తులని పొగడొందిన శ్రీమధురకవి నాళము కృష్ణారావుగారి వాఙ్మయసేవ లాబాలగోపాల మెఱింగినవే.

బ్రహ్మోపాసకులై వీరు పెక్కుగీతములు రచించిరి. కాని వానిని ప్రచురపఱచు శ్రద్ధనువహింపమి నవిప్రచారములోనికే రాలేదు సరికదా. వారికడనే యవి లభించుటరుదై పోయినది.

రావోయి రావోయి
రావోయి ఓదేవా
వేవేగ ననుజేరి
కావంగ కరుణతో ॥ రా॥

చదల క్రొంజిగి నించె
సంజ క్రొంజాయలు
వెలుగొందె తొలిదెస
వేవెల్గు రాయలు— ॥ రా॥

గుమ్మని తెమ్మెరల్
కమ్మ తావుల జిమ్మె
ఝుమ్మని తుమ్మెదల్
తమ్మి పూవుల గ్రమ్మె ॥రా॥

కిలకిల పులుగుల
కల రవమ్ములు సెలగె
తెలిమంచు బిందువుల్
పలు వన్నియల వెలిగె ॥రా॥

విరియ బారిన విరుల
తొరగి తేనియ లురలె
పురివిచ్చి నెమలులు
నెఱి నృత్యముల గెరలె ॥రా॥

కొక్కొరో కోయని
కుక్కుటమ్ములు కూసె
కోయని కోయిలల్
కొసరి గానము చేసె ॥రా॥

ఈ కీర్తనముతో వీరు స్వామిమేలుకొలుపు లుపచరించిరి. ప్రకృతియంతయు నవనవోన్మేషముతో హాయిగూర్చుచున్నది. ఈశ్వరా యిట్టి ప్రశాంతమధురవేళలో కరుణించి నను బ్రోచుటకై వేవేగరావా దేవా యనివీరు విరియబారిన విరులుతేనియల దొరగించు వేళలో దేవదేవు నీస్వాదుగీతమున నాహ్వానించుచున్నారు. తూచితూచి కొసరికొసరి పదములను వాడుకొందురని వీరి రచనల యెడపైకొనిన ప్రఖ్యాతి యీకూర్పునను కానంబడుచునేయున్నది.

వీరి కొమరిత్తయైన ఊటుకూరి లక్ష్మీకాంతమ్మయు రచనామర్మములెఱిగిన చదురాలై 'ఆంధ్రుల సరస్వతి' యని భావుకలోకముచే

వాసిగాంచినదే. ఆయమ కావించిన సృష్టియందలి యొకపూజాసుమమై 'ఆంధ్రకవయిత్రుల చరిత్ర' యను గ్రంథరాజము శారదాదేవికి ప్రీతి పాత్రమైనది. తెలుగుసోదరులామెతమ యాడపడుచని యాదరమున సంభావించుకొందురు. ఎఱిగియెఱుంగని అల్పవివేకముతో నామె పరమహంసుని జీవితగాథా విశేషములను కావ్యసుమమాలగా గ్రుచ్చి వాగ్దేవికి పూజోపహారముగా సమర్పించుకున్నది, యావదంధ్రము నుపన్యాసపువేదిగానిల్పి విజయపతాకను సుప్రతిష్ఠితమొనర్చి ఆదర గౌరవముల నందగల్గిన అదృష్టశాలిని.

చేయితిరిగిన రచనాసౌమనస్యముతో వీరుకావించిన కీర్తన సృష్టియు ప్రశంసాత్మకమైనదే యనిపెద్దలాశీర్వదించియుండిరి.

ప్రవిమలానందరూపియగు ప్రాణేశునితో నిత్యైక్యమును భావించి సంప్రార్థనమొనర్చు నీమెయుత్తమాశయమును గాంచుడు:-

నీలోని మార్దవమునేనై
నాలోని విభవమ్ము చెలువమ్ము నీవై
నిఖిలమౌ భువనాలు
నిండివెల్గెదమోయి ఈశ ॥నీ॥

జడధిలోతులు తఱచి
కడలవెల్లలు చఱచి
ఆర్ద్రమై రసార్ద్రమై
భావభర మది శబలింప
సంభ్రమించెదమోయి
విభ్రమించెద మోయి
విధివిరామము లేకఈశ ॥నీ॥

చూపు చూపులు లేక
పలుకు పలుకులు లేక
నిశ్చలమౌ నీరవమౌ
నిబిడ హృత్సీమలతో

నిలిచి పోదమటోయి
పిలుచు కొందమటోయి
విపుల జగతీసారము ఈశ ॥నీ॥

అంతయును ఏకమై
అన్నియును ఒకటియై
అంతరంగము నుండి
అంతర్ముఖులమై

అనంత పదసీమ
ఆనంద ధామాలు
అల్లుకొందమటోయి ఈశ ॥నీ॥

ప్రకృతిమయుడైన ప్రభూత్తమునుద్దేశించి 'ఓ ప్రభూ ఈ కాయము సాపాయము క్షణభంగురము ఆలసింపక ఏలుకొనగా రావేల నోయి' యనిపలవించి పలవించి యాహ్వానించు ఆహ్వానగీతి యింకొకటి.

చదలేటి మిలమిలలు
సంతరించిన సంధ్య
సెలయేటి గలగలలు
సెలగిపోయినసంధ్య ఇదియె

చల్లచల్లన రావేరస్వామి
మెల్లమెల్లన రావేరస్వామి

మధువుదోసిట బూని
మందార హృదయమ్ము
బ్రతుకు దోయిలిబూని
ప్రార్థనా హృదయమ్ము
పిలిచెనే పల్మారు స్వామి
పలుకవా మాతోడ స్వామి ॥చ॥

క్షణికజీవమ్మురా
ప్రకృతి సౌందర్యమ్ము
చిటిక జితియించురా
జీవ మాధుర్యమ్ము
ఆలసించెదవేర స్వామి
అందుకోగదరా స్వామి॥

ఇటులున్నది వీరి యీకీర్తన రచనము. ఇట్టివింకను పెక్కులు రచించిరి.

ఇట్లు భక్త్యావేశముపైకొనగా నింకను పెక్కురిట్టి భక్తికీర్తనల రచించినవా రగపడుచున్నారు. ఇంతవఱకు బ్రహ్మోపాసకులగు వాగ్గేయకారులనుగూర్చి ముచ్చటించియుంటిమి.

బ్రహ్మోపాసకులే కాకున్నను నీయుగమున భక్తికీర్తనల రచించిన వారింకను కలరు. అట్టివారిలో ముఖ్యముగా పేర్కొనదగిన వారు శ్రీయల్లాపంతుల జగన్నాధం పంతులుగారు.

వీరి భజన కీర్తనలలోని సంస్కృత వాణీగ్రథనము :-

"త్వాదృశ దేవం సహజానే కృష్ణ సదానివసమే హృదయాబ్జే
యువతీ ధన యోర్మోహ మపనీయ శోషయ కామబీజమిహ
రాధేకృష్ణ॥

కర్మహి గగనం కాగతి శ్చేత్తుం, హి అనంగశస్త్ర
మిహరాధేకృష్ణ॥
తిష్టసిదేవ మేహృత్కేదారే పాలయభక్తి సస్యమిహరాధేకృష్ణ
చోరయమేహృది ప్రేమదధిహరే-రాధాగోపాల ఏహ్యేహి
మోహన కృష్ణ॥
స్థాపయమేహృత్ఫలకే తావకీన చరణకమలయుగ్మ మిహరాధే
కృష్ణ॥

నారాయణతీర్థుల తరంగములను తలంపునకు తేజాలిన రచనా సౌభాగ్యమిందు కన్పట్టును.

తెలుగునందును వేదాంత భావములను బోధించుచు నామసంకీర్తనము నొనర్చుచు కీర్తనలు రచించిరి.

వేదాంతభావములతోడి కీర్తనము:-

"కృష్ణభజనమే మనస్వధర్మము మఱువకు మిదితండ్రీ
నీవెన్నడు మఱువకు మిది తల్లీ॥

స్థూలదేహమను చిన్నితెప్పపై నెక్కిబద్ధజీవుండు
త్రోవరేవులేనట్టి భవాంబుధిపై ని
సాహసమున విహరించును మఱువకు ॥కృష్ణ॥

చ. అంతః కరణమె తెడ్లు తనదుస్వేచ్ఛాప్రవృత్తిచుక్కాని
తానేమాలిమికాడయి నీదుసంద్రమున
సంగమను లంగరి వేయును మఱువకు ॥కృ॥

ఇట్లీయాధునికకాలమున భజనకీర్తనలు వ్రాసినవార సంఖ్యా కులుగ నున్నారు.

ముఖ్యముగ భరతఖండ దాస్యవిమోచనోద్యమముపట్ల నీ కీర్తనలమూలమున జరిగిన ప్రచారమును సహాయమును నింతంతయని చెప్పనలవికానిది.

భరతఖండమున నంతటను గలిగిన ఈ సంచలనమున పాల్గొనిన తెలుగునాడునగూడ ముమ్మరముగ నీకీర్తనల రచనయు ప్రచారములును జరిగినవి. పద్యముకంటె పాటయే ఎక్కువశక్తికల ప్రచారాయుధమనుమాట అందరెఱిగినదేకదా. ఆ సమయమున జరిగిన ఈ ఉద్యమ సందర్భమున నెందఱో పదకర్తలు. మహాకవులును జాతీయోద్యమ భావసంభరితులై నెన్నిపద్యములనో పాటలనో రచించిరి. అట్టివారిలో శ్రీగరిమెళ్ళ సత్యనారాయణగారు చాల ప్రఖ్యాతిని గనియుండిరి. వారు రచించిన "మాకొద్దీతెల్లదొరతనము బాబు ॥మా॥"

ఇట్లు ప్రజలకు బ్రిటిషువారి ఘోరకిరాతక కృత్యములను గూర్చి తెలియజేయుచు ఆప్రభుత్వముపై నేవముపుట్టించుచు స్వాతంత్ర్యసంపాదనావాంఛను రేకెత్తింపజేయుచు వ్రాసిరి. అట్టి శ్రేణిలోనిదే.

"మఱువకు డార్వ్యులారా పంజాబివధలు" అను కీర్తనయును ఇందు చరిత్రప్రసిద్ధమైన బ్రిటిషువారి జలియన్‌వాలాబాగు కాల్పులు హృదయ విదారకముగా వర్ణించియున్నారు. ఇట్టిప్రచారకీర్తనలనేకాక

"నూలువడికే విధముతెలియండీ జనులార
మీరావిధముతెలిసీ లాభమొందండీ.
నూలువడికే విధముతెలియక
సాలుకరువదికోట్లరూకలు
వ్యర్థముగాను పరదేశాల పాలుసేయకను ॥నూ॥

ఇట్టి రాట్నప్రయోజనమును తెలియజేయు కీర్తనలనుగూడ రచించిరి.

కొల్లాయిగట్టితేనేమి
మాగాంధి కోమటైపుట్టితే నేమి
యను ప్రసిద్ధ కీర్తనకు బసవరాజు అప్పారావుగారు కర్తలు.

ఇట్టివే యింకను విద్యాప్రచారకీర్తనలు ముఖ్యముగా వయోజన విద్యాప్రచార కీర్తనలు మున్నగునవి కూడావెలిసినవి.

ఇట్టికీర్తనలలో స్వతంత్రాంధ్రరాష్ట్రముకావలెనను నాందోళనము నాంధ్రజాతీయ కీర్తనలను రచించి ప్రబోధము గావింప మొదలిడిరి. ఆతెగకుచెందిన కీర్తనలనుండి శ్రీపైడిపాటి సుబ్బరామశాస్త్రిగారిదొక్క కీర్తన నుదాహరింతును.

"తెలుగుదేశం మనదేనోయ్
తెలుంగులంటే మనమేనోయ్ ॥తె॥
మధురం మధురం మధురం ఆంధ్రమ్మంటే అతిమధురం
రాయలు మనవాడోయ్ పండితరాయలు మనవాడోయ్
కలంతిక్కన ఖడ్గతిక్కన గణపతిదేవులు మనవారోయ్.

ఈవిధంగా ఆంధ్రజాతియొక్క చారిత్రక ప్రసిద్ధి నుదాహరించుచు ఆంధ్రజాతినుత్సాహపూరితుల నొనర్చికార్యోన్ముఖుల గావించుట యీ కీర్తనల యుద్దేశము.

"శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మున్నగు ప్రసిద్ధ వాగ్గేయకారులు సినిమాలలో ఉత్తమ సంగీతమునిచ్చుచుకొంతవఱకీ యపవాదమును తొలగింప యత్నించుచుండిరి. సినీమా సంగీతకళ యింత ప్రచారము నొందినను అదియేమంత శాస్త్రీయపద్ధతులలోనిది కాదని

పండితులు ఆకళనాదరింపకపోవుచుండిరి. కేవల ప్రచారము కొరకు ఉద్దేశింపబడినను సత్యాగ్రహోద్యమ కీర్తనలు మున్నగునవియే శాస్త్రీయ రాగతాళ పద్ధతులకు కట్టుబడి యున్నవి. సినీమా సంగీతకళ మాత్రము కేవలాకర్షణ గుణప్రధానత కలదగుటచే కర్ణాటక సంగీత శాస్త్ర మర్యాదలలో మాత్రమే యిమిడియుండ జాలకపోయెను.

ఇంకొక శ్రేణికి చెందినకీర్తనలున్నవి. అవి భావకవిత్వ శాఖకు దగ్గరగానుండును. ఈ తెగ కీర్తనల కాదిపురుషునిగా శ్రీనండూరి సుబ్బారావుగారిని పేర్కొనవచ్చును. వీరి యెంకిపాటలు జగత్ప్రసిద్ధములు. గుండెగొంతుకలోన కొట్లాడికొట్లాడి తుదకు వీరియెంకి గొంతుసవరించుకొని తెలుగులయెదుట గానముపచరింప నేతెంచి వాడవాడల తన ప్రణయగాధ విన్పించినది.

నాగరకులగు విద్యాధికుల నాకర్షించిన నండూరివారి యెంకి నాయుడు బావల నాయకమును దిలకింపుడు.

ఎప్పుడో నాయుడుబావ యెంకితో చిలిపిగా గిల్లికజ్జా పెట్టు కొన్నాడు.

"ఉత్తమా యిల్లాలినోయి న
న్నుసుము పెటితే దోసమోయి ॥

అని పిల్లిశాపనార్ధములు పెట్టి బెదిరించి అలిగి నాయుడుబావను పలకరించుటే మానివైచినది. కల్మషమెఱుగనివాడు నాయుడుబావ. ఇంకొకనాడు ఎంకి కనబడకపోగా ఎంకినిగూర్చి ఎట్లుతలపోయు చున్నాడో ;

"ఎంకివొంటి పిల్ల లేదోయి లేదోయి
ఎంకి నావొంకింక రాదోయి రాదోయి
కతలు సెప్పిందంటె కలకాలముండాలి.

ఒక్క నవ్వేచాలు వజిర వైడూరాలు ॥ఎం॥
తలపోసి తలపోసి వాపోయి నాడేకదా ! పాపము॥
"తొలిపూస పెరిగింది
తులసమ్మ వొరిగింది"

ఏమిఅశుభము జరిగెనో యనికళవళపడి కాటుక కళ్ల కడివెడు నీళ్లు నించినది.

ఇట్టి అకృత్రిమ ప్రణయగారవముతో ఒకళ్లొకళ్ల పాయలేక అనగిపెనగి ఇరువురు నొకటియై, అనపాయులై ఆధునికాంధ్రగేయ సారస్వతమునకు ఎంకి నాయుడుబావలు ఆదిమ దంపతులైనారు.

నండూరి సుబ్బారావుగారు మున్నగువారు విద్యాగంధ మెఱుగని వారు కాదు. సంగీత విజ్ఞాన మర్మము లెఱుంగలేకకాదు; ఇట్టి తీరు రచనములకు మనసిచ్చి కావలెనని యీ అభినవ రసలోకమును నిర్మించినవారు. అందుచే ఈశాఖలోని అందఱను కాకున్నను నీ గేయ వాఙ్మయ స్రష్టలగు వారిని నందు ప్రధానులగు వారిని గూర్చియొక్కింత తడవుటసంగతము కానేఱదు.

ఇట్లు పరామర్శించుటకు మొదలిడగనే పడుచు ప్రాయముననే పరలోకమునకేగి తనకావించిన గీతిమయ మధురసృష్టి తెలుంగుల కొక శాశ్వత నందనవన పరిమళ పారిజాతము కాగా యశోజీవియై వెలుగొందిన కళామూర్ధన్యుడగు బసవరాజు అప్పారావు స్మృతిపథమున దగులుచున్నారు.

నిజముచెప్పవలెననిన ఆధునిక గేయకారులకు వెలుగుబాటలు వెలయించిన మార్గదర్శకు డీయనయే-

ఈయనగేయములు పలుకరించినవారికి పలుకరించినవిధమున భావములనిచ్చి యలరించునవి.

పరవళ్ళుద్రొక్కు భావావేశము ఉరవడియుడిగిన యుపచార భావము, ప్రశాంతతోడి పవిత్రభావము దీప్తిమంతమగు ఉజ్జ్వల భావమును కలిగి వీరి కవితాలేఖిని యమృతనిష్యందినియై నటించినది.

ఒక జోలపాటయే కానిండు అందుండి యొకకమ్మని కవితా మరీచి ఘుమఘుమ యనుచు గుబులుకొనును.

"దినదినము పాపణ్ణి దీవించిపొండి
దేవలోకములోని దేవతల్లారా ॥ది॥

మాపాప నిదురలో నవ్వుకొంటాడు
వెఱ్ఱిలోకము చూచి వెక్కిరిస్తాడు

కన్నయ్య నిదురలో కన్నుగిలిపేనూ
హాస్యకాలాడెనో అచ్చరలతోనూ

అమాయకుడైన పసినిసుగు నిదురయా విమలభావుకున కెన్నెన్ని తలంపులకు జీవముపోసినదో చూచితిరే కదా.

మఱి మహాకవియైన విశ్వనాథ సత్యనారాయణ గారును "కిన్నెరసానిపాటలు" రచించి యీ శాఖకు చేరిన వాగ్గేయకారులే యైనారు.

ఇంత ప్రతిభ కల కవి పండితు లాదరించిన యీ నవకవిత్వో న్మేషమును విస్మరించుటెట్లు? వీరినే ఆధునిక గేయవాఙ్మయకర్త లనవలెనేమో –

ఈకోవకు చెందినవారే ఏలూరు వాస్తవ్యులు శ్రీ కొనకళ్ల వెంకటరత్నంగారు.

వీరు వివిధశాఖలకు చెందిన గేయముల రచించిరి. అందు జాతీయగీతములు, రాష్ట్రగీతములు, సిపాయిగీతములు (పోలీసుశాఖతో

పరిచయ సంబంధములు కలవారుకావున వారికై (వ్రాసిరేమో) జోల పాటలు మున్నగునవి కలవు. ముఖ్యముగా వీరు రచించిన శృంగారాత్మకమైన 'బంగారిమామ' పాటల కెక్కుడు ప్రశస్తి చేకూరినది.

వీరు బంగారిమామపాటలు రచించిన క్రొత్తలో శ్రీ శివశంకర శాస్త్రిగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, శ్రీ నండూరి సుబ్బారావు గారును వీరిని సమ్మానించి ప్రశంసించిరి. శ్రీ నటరాజ రామకృష్ణ బి.వి. నరసింహారావుగారు మున్నగు ప్రముఖ నృత్యకళావేత్తలు వీరి గేయములలోని సుకుమారరేఖావిలాసములకు ముదమంది వారి నృత్యాభినయగీతికలుగ గైకొని సంభావించిరి.

ఇట్టి యీ సుప్రసిద్ధ వాగ్గేయకారుని ప్రసిద్ధగేయములగు 'బంగారిమామ' పాటలలో నొకటి

"మొక్కజొన్నతోటలో ముసిరిన చీకట్లలో
ఘుమ ఘుమలను మీటే
కొత్తిమేర చేలుదాటి
కోరికతో వస్తే నను
గోషపెట్ట బోకురా
ఏడ దాగున్నావోయి దొరా నీ
జాడ తెలిసె లేవోయి కదలిరా.

వీరుకాక ఈ యుగమున మాధుర్యగుణమునకు పేరుమోసిన కీర్తనకవితలల్లిన వారిలో ముఖ్యులింకొరు శ్రీ వింజమూరి శివరామారావుగారు. వీరు శ్రీ కృష్ణశాస్త్రిగారివలెనే పీఠికాపుర నివాసులు. వీరును శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారును బందుగులని వారి కీర్తనా రచనమును గమనించినపుడు సహితము తెలియుచునే యుండును.

తెలుగు రాష్ట్రోద్యమ ప్రచారసందర్భమున పతాక ప్రతిష్ఠాపన గేయములోని వారిరచనము:-

"నిలుపరా నిలుపరా నీ తెలుగుజెండా
దూరాల తారా లతాంతాలు కైసేయ ॥ని॥
తరుణ భాస్కరకోటి కిరణాల కాంతిలో
కమనీయతర శరత్కౌముదీశాంతిలో ॥ని॥
ఉదయాస్తమయశైల విదిత సానువులపై ॥ని॥
మగధపై, మధురపై, ధగధగామెరిసింది ॥ని॥

నన్నపార్యుని వారసత్వమును పుణికిపుచ్చుకొనినవని చెప్పక చెప్పు సంస్కృతరమణీయ సమాసమాలా గ్రథనములే సాక్ష్యములు.

ఆధునిక కవిత్వరచనాచార్యులైన శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారి "ఏదేశమేగినా, ఎందుకాలిడినా, ఎవ్వరెదురైనా పొగడరా నీ తల్లి భూమి భారతిని."

వీరి "శ్రీలు పొంగిన జీవగడ్డయు
పాలుగారిన భాగ్యసీమయు

... ... ....

భక్తిపాడర తమ్ముడ ॥ అను ఆంధ్రరాష్ట్రీయ జాతీయతా గేయములును శ్రీతల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి గేయనాటకములును నీ పట్టున స్మరింపదగినవే-

కాని యిట్లే మధుపమన శీలములైన కీర్తనలను రచింపగల ప్రజ్ఞాశీలియగు శ్రీ బాలాంత్రపు రజనీ కాంతారావు గారినిగూర్చి ప్రసంగింపక యీ యధ్యాయమును ముగింపరాదు.

'ఏకాంతసేవ' 'కావ్యకుసుమావళి' మున్నగు సరసకావ్య శ్రేణీజనకులైన వేంకట పార్వతీశ్వరకవులలో నొకరగు బాలాంత్రపు వేంకటరావుగారు శ్రీ రజని కాంతారావుగారికినిజనకులు. కవికుమారులైన వీరికి కవిత్వము వారసత్వముగ లభించినపెన్నిధియైనది.

సంగీతాభిలాషలతో ననగిపెనగిన చేతనతోవారు 1938 వ సంవత్సరమున వాల్తేరులోఉండగా ప్రథమ గేయనాటికగా "చండీదాసు"ను విరచించిరి. అప్పుడే "సహజయానపంథీ"అను పేరున శ్రీ శివశంకర శాస్త్రిగారును వారి చండీదాసునుకూడ విరచించిరి. తరువాత శ్రీ రజనీ కాంతారావుగారి రేడియో ఉద్యోగ నిర్వహణమున దివ్యజ్యోతి, మేఘదూత, మధురానగరి. లకుమాదేవి, విశ్వవీణ, రాసలీల మున్నగు గేయనాటికల నెన్నింటినో విరచించిరి. ఇంకను విడివిడిగా రచించిన గేయములనుకూర్చి "శతపత్రసుందరి' యనునొక గేయప్రబంధమును ప్రచురించిరి. అందొక్క "దివ్యజ్యోతి' నాటిక యందలి పాటలు మాత్రమే నిబంధింపబడినవి. కడమ పదునారు గేయనాటికలనుచేర్చి "విశ్వవీణ' యను సంపుటమును వెలువరించిరి.

ఇంక విశేషించి వీరినాటికలలో వంగదేశకథ యగుటచే "చండీదాసు" నందుమాత్రము వంగ సంగీత రీతుల యనుస్వృతికానగును. మిగతనాటికలలో కర్ణాటకపంథా సంగీతమే.

అంతేకాక యింకొక ముఖ్యవిశేషమేమన శతసహస్రాధిక గేయములు రచించి వర్తమానమున ప్రసిద్ధగాయకులైన ఘంటసాల వింజమూరి సోదరీమణులు మున్నగువారి యభిమానమునకు పాత్రుడైన కవిసత్తముడీయన, సినీమారంగముననేకాదు, గ్రామఫోను

రికార్డుల మూలమునసేకాదు వీరి గేయములకు గలిగినంత బహుళవ్యాప్తి మఱియెవ్వరి గేయములకును లభింపలేదనుట అతిశయోక్తికాదు.

సూక్ష్మమైన రచనతో విపులార్ధ గంభీరములైనవి వీరి కీర్తనలు 'కలగంటి కలగంటి చల్లగాలిలో యమునాతటిపై, శతపత్రసుందరీ ఒహో-శత....'మున్నగు ప్రసిద్ధ గేయములెన్నోవీరి రచనలై యున్నవి.

ఇంతటితో నవభావుకులై గేయపద్ధతిని రచన మొనర్చినవారిని పరామర్శించుట పూర్తియైన దనవచ్చును,

ఏమైనను ఆధునికుల గేయరచనయందు లలితములగు పదముల కూర్పుపట్ల విశేషమగు పనితనమును శ్రద్ధను చూపుట కాననగును. భావ ములలోని క్రొత్తదనముమాట సరియే.

## హరికథలు

ఇంతవఱకు నడచిన కీర్తనవాఙ్మయ మొకయెత్తును హరికథా వాఙ్మయ మొకయెత్తునై యున్నది హరికథలయందు వచనములు, దరువులు, కీర్తనలు, చూర్ణికలు, రగడలు, ద్విపదలు మున్నగు నన్నివిధ ముల రచనలుండును. అవసరమునుబట్టి కందార్ధములు యాలలుకూడ చేర్చవలసియుండును. సర్వవిధ గేయరచనల కాకరమైనది హరికథా రచనము.

వీరేశలింగముపంతులు గారికి కొంచెము ముందుకాలమున మాడ భూషి వేంకటాచార్యులనువారు హరికథలనురచించినట్లు వినికిడి. వీరే కాదు సుదర్శన రామానుజదాసు అనువారొకరు హరికథలు రచించిరని వెనుక చదివియున్నాము. హరికథారచనము నిట్లిరువురు మువ్వురొనరించియుండిరి. పరాంకుశదాసు 'కృష్ణజయంతి' యను హరికథను

వ్రాసెననితెలిసికొనియుంటిమి, ఆధునికులలో వాగ్గేయకారరత్న శ్రీహరి నాగభూషణముగారు హరికథారచయితలనునదియు తెలిసిన విషయమే.

ఆదిభట్ల నారాయణదాసు గారింకను సరిగా గజ్జెకట్టని కాలమున బి. బాలాజీదాసు అనువారు హరికథలు చెప్పుచుండెడివారు. వారికథలును ఆ కథలలోని కీర్తనలును చాలా సామాన్యములుగా నున్నవి. అయినను వారికిదేశమున చాల ప్రఖ్యాతికలదు. ఇంకెవ్వరునులేని కాలమున వీరే చాలా గొప్పగా చెప్పుకోబడియుండవచ్చును. వీరి ప్రశస్తికి వేరేకారణము నుండియుండవచ్చును. అదివీరి పిట్టకథల పాండిత్యము.

వీరివి కుశలవవిజయం, గయోపాఖ్యానము, ప్రియంవదాచరిత్రము హరిశ్చంద్ర చరిత్రము మున్నగు పదునైదు, పదునారు కథలుకలవు, ఇదిపాల సుదర్శనదాసుగారి కుచేలోపాఖ్యానమొకటి కనబడుచున్నది. వీరి హరికథా రచనయందు వచనము డోరా, కీర్తనలు నగపడు చున్నవి. రచన సామాన్యము-

ఇంక హరికథా సార్వభౌముడైన శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారి రచనా విశేషముల నారయుదము.

ఆదిభట్ల నారాయణదాసుగారు విజయనగర సమీపముననున్న అజ్జాడ గ్రామవాస్తవ్యులు. బాల్యమునుండియు వీరు అత్యధిక ప్రతిభా సంపత్తితో కావ్యాదులను రచించిరి. వీరు హరికథాకాలక్షేపముల నొనర్చుచు దేశాటనమొనర్చుచు మైసూరు మహారాజావారిచే నత్యధికముగ బహూకృతులైరి. పిదప విజయనగరమునకు తిరిగివచ్చిన కొన్నినాళ్ళకు కొందరాప్తమిత్రుల సహాయమువలన ఆనందగజపతి మహాప్రభువులవారి దర్శనము లభించి వారి యాస్థానమున స్థానము లభించెను. సాహిత్యమునందును, సంగీతమునందును వీరికి గల అసమాన పాండిత్యము ప్రభువుల కచ్చెరువు గల్గించినది. ఆశుకవిత్వ

ప్రజ్ఞావిశేషములు కలవారై అష్టావధానాదుల నొనర్చెడువారు. సలక్షణముగ కావ్యములు వ్రాయగల్గెడువారు. అనేకశాస్త్రముల మర్మ మెఱిగి ప్రౌఢతనముతో చర్చలను, వాదములను, గోష్ఠులనుసలిపి జయ మందెడువాడు. సంగీత శాస్త్రమున నిష్ణాతృకత్వము కలవారై పల్లవి నవ్యాహతముగబాడి సదస్యుల ప్రశంసలందెడివారు. ఎన్నియో అపురూప రాగములలోను, ఎన్నియో విశేషతాళములతోను కీర్తనలను రక్తిగా సుఖావహముగా రచించినవారు. అంతేకాక తాళములను ప్రద ర్శింపగల్గిన తాళావధాన అభినయవిద్యలో వారికిగల నైపుణ్యమద్వి తీయము. మిక్కిలి సమున్నతమై, ఆజానుబాహువైన విగ్రహపుష్టికల వారయ్యును, కాలికిగజ్జెకట్టి శాస్త్రోక్తముగ మిక్కిలి లఘుతరముగ నాట్యమొనర్చి అభినయము ప్రదర్శించి హాస్యముగ పిట్టకథలు చెప్పి హరికథలను రక్తికట్టించెడివారు. మిక్కిలి వృద్ధాప్యమునందును వీరిట్లే కడులఘుతరముగ నృత్యాభినయములను ప్రదర్శించుచుండ చూచువారద్భుతమొందెడి వారు ఇట్టి నిరుపమాన ప్రజ్ఞాధురీణునిగాంచి విద్యాభిమానియు, పోషకుడగు ఆనంద గజపతి యభిమానించి ఆదరించెనన్న అబ్బురమేమి ?

వీరు రచించిన హరికథలు శతాధికములుగనున్నవి. వీరికంటె కొంచెముముందు వాడగు బాలాజీదాసుమున్నగువారు కూడా వీరి కీర్తనల నానందముతో స్వీకరించెడివారు.అంతేకాదు వైణికవిద్వాంసులైన పేరి రామమూర్తిగారు మున్నగుకొందఱు విద్వాంసులు వీరనిన మిక్కిలి యభిమానించి వీరికి కుడిభుజముగ నుండి సహకార మొనర్చెడువారు వీరు ఏ దేశమేగినను నచట ఈర్ష్యాసూయలతోకూడిన సంగీత సాహిత్య విద్వాంసుల విప్లవములు నెదుర్కొనవలసివచ్చెడిది.అయినను కాలిడిన చోట జయమేతప్ప వీరపజయమనునది ఏనాడు నెఱుంగరు. నిత్య సరస్వతీ ప్రసన్నలాలితులై అపజయమను శబ్దమెరుంగక అఖండ

దివ్యప్రభలతో, జేగీయమానముగా జీవితమును నిర్వహించిన సంగీత సాహిత్య వీరావతారుడీ మహానుభావుడు. పొడవైన విగ్రహము, విగ్రహమునకు దగినట్లు పొడవైన విద్య, విద్యకు దగినట్లు పొడవైన ప్రతిభయు ముప్పిరిగొనగా సరస్వతి పుంభావ మాశించి యిట్లుదిగెనా యని చూపరులు విస్మయ చకితులయ్యేడువారు.

ముఖ్యముగ వీరి జానకీశపథము,మార్కండేయచరిత్ర, సావిత్రీ చరిత్రము, రుక్మిణీకల్యాణము, రామాయణము మున్నగునవి మిక్కిలి ప్రకర్షాదాయకములై యున్నవి. అచ్చతెలుగున గైరమ్మపెండ్లి సంస్కృతమున కృష్ణజననము నిట్లే వాసికెక్కినవి. ఇవియన్నియు నొక్కొక్కటి యొక్కొక్కగుణమున పేరెన్నికగన్నది.

జానకీ శపథమున అపురూపరాగముల కీర్తనలు శతాధికముగనున్నవి

రుక్మిణీ కల్యాణమున - పదసాంప్రదాయము ననుసరించి వ్రాసినకీర్తనలు

సావిత్రీ చరిత్రము - రాగముల పేర్లు కీర్తనల తుదినిజెప్పుటొకటి. నర్తకి, మంజరి మున్నగు పద్యములకు పాటల సాంప్రదాయమిచ్చుటొకటియు విశేషము.

మార్కండేయచరిత్రము - విశేషతాళములతోడిది. ఇందును విశేషగతులు చూపబడినవి.

రామాయణము- రామాయణమునందలి హనుమత్సందేశము, సుగ్రీవమైత్రి మొదలగునవి.

నవవ్యాకరణసంగీత శిరోమణి యను బిరుదమునకు తగినట్టు బిగువు పోకడలతో రచింపబడినది.

ఈ హరికథల కీర్తనలరచనయందు కీర్తన పల్లవి, అనుపల్లవి యైనవెనుక మామూలు, కృతియందలి చరణములవలె చరణములుండక డోరాలు. పద్యములు కందార్ధములు, నుండుట కాననగును. ఇదియొక రీతి హరికథా కీర్తనరచనము–

ఇక వీరువాడిన విశేషరాగములలో కొన్ని ఘంటారవము సామవరాళి, నాగానందిని, ఝంకారధ్వని, ధవళాంబరి, నీతిమతి, సుచరిత్ర, నవనీత, కోసలము, గవాంభోధి, కామోద, రఘుప్రియ, నాసికాభూషణి,గాంగేయభూషణి, తానరూపి మున్నగునవి పెక్కులు.

అపురూపరాగములైనను, శాస్త్రోక్త విధానమునకు భంగము రాకుండ మనోరంజకముగ కీర్తనలు రచించిరి. కీర్తనలలోని సాహిత్యము సామాన్యమే. కాని వచనములు రెండో మూడోయున్నను వాని యందలి సాహిత్యము మాత్రము మిక్కిలి వైదుష్యమును వెల్లడి సేయునదియైయున్నది.

మార్కండేయచరిత్రమునందలి విశేషగతులకు నిదర్శనము – భైరవి, మంజుగతి.

వినుడీ మార్కండేయునిచరిత్రము వినిపించెదమీకున్ ॥హాయా
ఘనుడు భక్తితోదలచిన గానవచ్చున్ నాకున్

2. మునుపు మృకండుండను మునికృతయుగమున దేజంబలరారెన్
మేదినిసురులకు దొడవగుచునతడు ధాత్రినతుల యశమున
మీరెన్॥

ఇది దేశీయచ్ఛందములలో, మార్గచ్ఛందములలో విశేషపద బంధములు వానినిట్లు కీర్తనలుగా వీరుకీర్తించుట కాననగును.

ఈ హరికథయందిట్టివి పెక్కులుకలవు

కీర్తన రచనయు నుజ్జ్వలముగా నున్నది.

మలయ మారుతము రూపకము

ప॥ అమరద్యుతి-చామీకరద్యుతి ॥అ॥

అ॥ప॥ కోమలాకృతి శ్యామలా ప్రతి ॥అ॥

చ. పతిమాటలకెదురాడదు పరులమోమునుచూడదు
అతులగుణవతి హంసికాగతి ॥అ॥

నాదనామక్రియలోని ఇంకొకకీర్తన

"తొలిజన్మమున నేనే దోస మొనరించినానో
తలపనాకిపుడింత తడబాటువచ్చెనాథ ॥తొ॥

చ. కడగియావును దూడనెడబాటు చేసినానో

చ. అడరి యేపుణ్యాత్మురాలి కుసురిడినానో
తొడరి నేనిపుడింత దుఃఖింపవలసెనాథా॥

సావిత్రీచరిత్రము నందలిసి మంజుగతి, నర్తకి మున్నగు ఛందముల రచనకన్పట్టును. కీర్తనలును చక్కని నడక యొయ్యారము కలవిగా నున్నవి.

వీరు సంగీత సాహిత్యములలో ప్రబలులయి నిరంకుశముగ దేశదేశములయందు నత్యధిక స్వాగతసత్కారములను బిరుదముల నందుచు విద్వద్వీరవిహారములు సల్పుచుండ వీరి కసంఖ్యేయులగు శిష్యగణము నలుమూలలా నేర్పడిరి. ముఖ్యముగ హరికథలయందే పెక్కురు వీరిని ప్రత్యక్ష పరోక్షభావముల ననుసరించిరి. కొందఱు వీరికి ఏకలవ్యసమాన శిష్యులైరి. ఇప్పటికిని ప్రతిహరిదాసుడును తాను నారాయణదాసుగారికి శిష్యప్రశిష్య వర్గములోని వాడనని చెప్పి కానియే బ్రతుకుతెరువు గడియించు కొనుచుండును. హరికథయన్న

దాసుగారి హరికథ యనియే ప్రఖ్యాతి. అంత యప్రతిమాన ప్రతిష్ఠ నార్జించి ధనరాసులు కొల్లలుగగుత్తగైకొని యావద్భారతఖ్యాతినాంధ్ర మాతకు సేవోపాయనముగా నర్పించి మాత్ర్యాణమీగిన శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారాంధ్రులగుట ఆంధ్రుల భాగ్యవిశేష మనవలెను.

వీరేకాక పరిమి సుబ్రహ్మణ్యదాసుగారు, పెదపాటి కృష్ణమూర్తి భాగవతార్ గారు, పెంటపాటి సర్వేశ్వరరావుగారు, ములుకుట్ల పున్నయ్య శాస్త్రిగారు, తిరునగరి శేషదాసుగారు, కోసూరి భోగలింగదాసుగారు, కొమ్మూరిబాల బ్రహ్మానందదాసుగారు, తెల్లాకుల వేంకటేశ్వరగుప్త గారు మున్నగువారెందఱో హరికథలను రచించిరి. వీరిరచనములలో కేవల భగవత్కథాగానమేగాక సత్యాగ్రహోద్యమచరిత్ర. పూజ్య బాపూజీచరిత్ర, నేతాజీచరిత్ర, జవహరుచరిత్ర, పొట్టి శ్రీరాములు చరిత్ర, ఇంకా లౌకిక గాధలు ఎన్నియో కలవు. అయినను వీనికిని హరికథలనియే పేరు.

ఇక ఈ హరికథారచనమున వీనుమిగిలినవారి నొక్కరిని పరిచయపఱచి విరమింతును.

వారు పాతూరి మధుసూదనరావుగారు. వీరు గుంటూరు మండలమునగల భట్టిప్రోలు వాస్తవ్యులు. సనాతనధర్మావలంబులైన శ్రీపాతూరి సుబ్రహ్మణ్యముగారు తండ్రి. భగవత్పూజా తత్పరత్వమున జీవితము గడిపిన కనకరత్నమ్మగారుతల్లి. వీరు క్రీ. శ. 1908 సౌమ్యనామ సంవత్సరమున జననమందిరి.

13 వ ఏటనే దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి బోధలనాలించి ఆంగ్లవిద్యకు తిలాంజలి నొసంగి, సత్యాగ్రహోద్యమమునచేరి దేశ సేవకులై 1929 వ సంవత్సరమున ఉప్పుసత్యాగ్రహ మొనర్చి ఆలి పురము క్యాంపుజెయిలులో కఠినశిక్షకు పాల్పడి యచ్చటనే కవిత్వా భ్యాస మొనర్చి హరికథలు రచింపనారంభించిరి.

1943 లో మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ఆధిపత్యమున జరిగిన మహాసభలో గండెపెండెర మందుకొనిరి. మచిలీపట్టణమున వాగ్గేయకారరత్న శ్రీహరి నాగభూషణముగారు 'పండిత హరిదాసహంస' అనుబిరుదమిచ్చి గౌరవించిరి. ఇట్లు సమకాలము వారల ప్రశంసలనందిన భాగ్యశాలివీరు.

వారణాసీ నగరమున వల్లభరామసాలగ్రామ సాంగవేద విద్యానిలయమున తదధ్యక్షులగు పండిత శ్రీ రాజరాజేశ్వరశాస్త్రిగారి ఆధిపత్యమున "పార్వతీ పరిణయమ" ను సంస్కృతగేయ ప్రబంధమును గానముచేసి విశ్వేశ్వరున కంకిత మొనర్చిన పుణ్యవ్యక్తి.

సంస్కృతాంధ్రములలో కవిత్వముచెప్పి హరికథలు రచింపగల నేర్పుతో పార్వతీపరిణయము, భక్తరఘునాథచరిత్ర, శివపూజ, భక్త శ్రీయాల, జైమినీభారతము, (14 భాగములను), శ్రీకృష్ణలీల (7భాగములును) పౌరాణిక ప్రబంధములను రచించిరి. అంతేకాక చారిత్రాత్మకముగ ఝాన్సీ, శివాజీ, అనువానిని గ్రామస్వరాజ్యము, సత్యపరిపాలనము అను సాంఘిక, రాజకీయకథలను కూడ రచించిరి. ఇక పద్యాత్మకముగ'భావతరింగిణి' యను ఖండకావ్య సంపుటినొకటి రచించిరి.

శైవవైష్ణవ భేదభావములు సహింపక సర్వసమతను వీరు రచనలలోచూపి ప్రబోధించిరి,

ఇట్లు మహనీయ పుణ్యప్రతిభా విశేషములతో నెందరో వాగ్గేయకారులు ఆంధ్ర సరస్వతిని తమ కీర్తన రచనతో పూజించియుండిరి. అట్టివారెందరో మహానుభావులు అందఱకూ వందనము.



# అనుబంధము

ఆధునిక వాగ్గేయకారులలో 'గాయక వైణిక సార్వభౌమ' పేరి రా: మూర్తిశాస్త్రిగారు స్మరింపదగినవారు. వీరు విజయనగర వాస్తవ్యుల విశేషించి విజయనగర సంగీతకళాశాలా ప్రధానాచార్యులుగ పనిచేసియున్నార వీరి సంగీత విద్యా పరిశ్రమము మిగుల కొనియాడదగినది. వీరు శ్రీమదజ్ఞా ఆదిభట్ల నారాయణదాసుగారి మిత్రులై వారికి కుడిభుజమువలె నుండెడివారు

వీరు తానవర్ణములు, తిల్లానాలు, కీర్తనలు, కృతులు మున్నగున శతాధికముగ రచించియుండిరి. మిక్కిలి గమకముతో కూడిన విజయనగర: బాణీ వీరి వాదనమునందును, రచనలయందును ఉట్టిపడుచుండును. వీ: 1880 ప్రాంతమున జన్మించిరి.

మిక్కిలి నిరాడంబరజీవనులై తనునేర్చిన నాదవిద్యను పెక్కుర శిష్యులకు నిష్కల్మషముగ బోధించిన గురువరేణ్యులు; వీరు 'రాధాకృ మందిరము' అనుపేర నొక భజనకూటమును స్థాపించి జీవితాంతమున నా గోపాలస్వామి సేవతో ప్రొద్దుబుచ్చిన మహానుభావుడు.

అఠాణాయందు జంపెతాళమున వీరు రచించిన వర్ణము స్వరసాహిత్య ములు సంపూర్ణముగా కలదియై, మిక్కిలి ప్రసిద్ధికెక్కిన ఘన రాగ వర్ణమ లలో నొకటియగు శంకరాభరణ వర్ణమును తలపించునదిగా నున్నది.

ఇట్టివి పెక్కులు వర్ణములు గలవు. శంకరాభరణములోని

''శివశంకరా హరా భవసంకట హరా॥

కావవేరా సేవజేతు దేవ నన్ను ప్రోవరా॥

చ॥ నిగమవినుత సుగుణచరిత నగధరసుత కావర ॥శి॥

ఇట్టి కీర్తనలును బహుసంఖ్యాకములుగ నున్నవి.

విజయరామ గజపతిపై వీరు స్వరజతులొనర్చిరి; విజయనగర ప్రాంతములయందు బహుప్రచారముననున్న భజన కీర్తనలు చాల వ్రాసెను.

ఇంతేకాక 'ప్రహ్లాద గర్వభంగము' అను నొక గేయప్రబంధమును రచించెను.

"హరిహరి హరియనవే ఓమనసా" సింధురాగము నందలి భజన కీర్తనము. "రాధాకృష్ణ రారవేగ, నీదు పాదము నమ్మినాడ" అను మాండ్ రాగములోని భజనకీర్తనమును నోటికిరానివా రాప్రాంతమున నరుదు.

అంతేకాక పూర్వుల కీర్తనల కన్నింటికి చిట్టస్వరములు వ్రాసిరి. విజయనగర వాస్తవ్యులే పట్నాయక్ సీతారామయ్యగారను వారును కీర్తనలు వ్రాసిరి.

## పదములు : జావళీలు

జానపద గేయవాఙ్మయమున ప్రజాహృదయ మాధుర్యము అచ్చుపడి యున్నట్లు జావళీలయందును, పదములయందును సామాన్య ప్రజాహృదయ మచ్చుపడియున్నది. అంతేకాక శృంగారసంబంధమైన కీర్తనలగుటచే వీని యందలి భావసౌకుమార్యము, భాషామార్దవమును మఱింత వన్నెవాసి కలిగి యున్నవి. ఈ పదములలో వాడినంత అకృత్రిమమైన జానుతెనుగు మఱి యెచ్చటను కానబోము.

ఈ విషయమై ఈవఱకే కొందఱు వాగ్గేయకారులను పరిచయపఱచి యుంటిమి. ఈ అనుబంధమున మఱికొందఱు కీర్తనకర్తలను, మఱికొన్ని రచనలను పొందుపఱచెదను.

ఘట్టుపల్లివారి పదములు. కురంజిరాగము—

తలచుకొంటె తాళజాలనే యాడదాని జన్మమిక చాలునే॥

లలనవానికి సతమాయెనే కైలాసపతి యిందురాడాయెనే॥

చ॥ మగువ ప్రేమతో చేరవచ్చెనే ఆకుమడుపు మోవిపంటనొక్కి
యిచ్చెనే సొగసుకెమ్మోవి యావనిచ్చెనే వానిచూడచూడ
తమిహెచ్చెనే ॥త॥

ఇందు వెనుకటి నాయకానురాగమును తలంచుకొని నాయిక బాధ జెందుట కాననగును. "మోవి పంటనొక్కుట సొగసుకెమ్మోవి" మున్నగు ప్రయోగములీ వాఙ్మయమునకు తఱుచైనవి. వీరికి సంకేతికమైన ముద్ర యేమియు లేదు.

## బొల్లవరపువారి పదములు

జల్లిమాటకు నేనొల్ల మ్రొక్కెదనన్న యిల్లువెళ్లవుదాని॥
ఒల్లవేమో బొల్లవరపు వేంకటరాయా నాసామిదాని ॥జ॥

మిక్కిలి వెగటు శృంగారముతో నున్నవి. వీరి పదరచన ముద్ర యుండుట గమనింపదగును.

## శోభనగిరివారి పదములు

"చెలియ నీతోపొందు" మున్నగు వీరి కీర్తనముల యందును నిషేధింపదగిన శృంగారమే. శోభనగిరి ముద్రకలదు.

## వీరభద్రయ్యవారి పదములు

లలనా విరహమోర్వగలనా॥
ఎలమి శ్రీవరదవేంకటేశ్వరుని రమ్మనె ॥ల॥
మారుడు తానుబల్ క్రూరుడుగాను
సారెకు విల్వంచి పొంచి సాహసమొనరించెనే"

నాదనామక్రియలోని

అలెల్లా హలెల్లా
కృష్ణ యేలర నాతో వట్టి యావగలెల్ల॥

అను పదమును వీరివి. వీరిదివరదవేంకటేశ్వరముద్ర. రచన జాతీయముగ నుండును.

మాతృభూతేశులవారి పదములు:

చలము సేయనీకుమేరా చక్కనిసామిమ్రొక్కెరా
వెలయు దామెర కుమారా వేంకట భూపాల ధీరా
కలకలమని యలచిలుక బలుకగ
చలమున నాతో హలహలిజేయుచు
పలుమరు నిను మదిలో దలచుచు
బాలకడు మరులైనదిరా............॥చ॥

అనుదానియందును,

ఇంతిచక్కదన మింతింతయనుచు నెన్నతరముగాదురా
మంతునకెక్కు త్రిశిరగిరిని వెలసిన మాతృభూతేశ గిరినివాస॥
అతివ పలువరుస వజ్రపుబంతి యలతొలకరిమెఱుపు మేనికాంతి॥

అను దానియందును నాయికానాయకుల విరహావేశయందలి బావస మున్నిద్రత వర్ణింపబడినది.

జటపల్లివారి పదము

మగవారికి ధర్మమేడదే మగువ వారల నమ్మకూడదే
మొగిసి చేతులెత్తిమ్రొక్కుదు రెంతో మోహమున్నరీతి జొక్కుదురు
తగులేల దక్కరే పగలునేమారక వగలుజేతురు ఎంతచుల్కన జూతురు

ఈ పదమునందు నాయకుని కొఱకై నిరీక్షించి నిరీక్షించి విసిగిన నాయికయొక్క దెప్పరములు ప్రస్తావింపబడియున్నవి.

ఈతడు ప్రతాపభూపాలునిపై చెప్పిన పదములలో
"చిన్నది నీపైమరులుకొన్నది సొక్కిసోలుచునున్నది
యతివేగమె రమ్మన్నది సామిరారా"
అను కాంభోజి రాగములోని పదము బాగున్నది.

ఇనుకొండవారి పదము :— రేగుప్తిరాగము

"నీవె యోడితె నెలత నాదానవు నేనోడితే నైన నీవాడను
భావముతెలిసి యిటుపందెమువేయను రావేసొగటాలాడ రాజీవనేత్రి"

అను కీర్తనయందు పందెము పైపందెములతో నాయకుడు నాయికను సొగటాలాడరమ్మని చెయ్యిపట్టి రెచ్చగొట్టి యాహ్వానించుటగపడును.

శివరామపురమువారి పదములు

ఏమి చేయుదు నిమిషమేడాయెనే॥
రామపురమయ్య ఇటురాడాయెనే చెలీ
కలకాలమీరీతి కరకరికిలోనైతి
నెలనాగ నాభాగ్య మిట్లుండెగా
వలదనుచు సరివారు చెప్పిన బుద్ధి
జలజముఖి యదినేడు సరివచ్చెనే॥

యని విరహోత్కంఠితయగు నాయిక చెలితో మొఱ్ఱవెట్టుకొనుచున్నది.

"చెలికాడ తోడితెచ్చేవా
చానలార వినరే
సరసిజాక్షిరో వినవే"

మున్నగు వీరి కీర్తనలలోని రచన యింపుగ నున్నది. అతి శృంగారాత్మకమగుట విమర్శనీయములు కావు.

"పదవే అలవానిచెలిమి బలవంతముగదవే
సదయుడైన మా మదనగోపాలుని చనవందఱకును దొఱకనే దొఱకదే
ఆటప్రాయమునాటి మక్కువయది మఱువకయుండేది యెక్కువ
నేటికి విడనాడేది యెక్కువ నెలతరో వినవె యెవ్వరికి యెక్కువ॥ప॥"

అనుపదమున నాయిక తన వలపులొకరిపై సహజముగ ప్రసరించుచుండగ నెవరి బలవంతముననో ఇంకొకరికి తన మనస్సు నర్పించవలసి వచ్చెనని కుందుచు చెలియతో వలపోసికొనుట కాననగును.

యువరంగని పదములు

చెయ్యిబట్టి నాసిగ్గు చెఱుపవలెనా చిత్తమురా నడువనా
నెయ్యమున ననుగూడ నిపుడువేళ గాదోరయ్యలు
యువరంగేశా నలుగురిలో ॥చె॥

ప్రొద్దుజారి నల్దిక్కుల చీకటి పొడమిన వెనుక రారాదా
సద్దుసేయకిరు సందెఱుగక సతులీగతి నడచువారుశేరా
కద్దా యీయారడి వగలనతగిలినవెనుక కనుగొన్న నగుబాటు గాదా
వద్దురా నిను చూచినవారెల్ల నీవు నాతో కద్దనుచు గుసగుసలు
బలికే రద్దిలీసుద్దిమీద॥

సాటివారు మన అరమరికలు లేని ప్రేమలుచూచి యేమేమో అనుకొని దృష్టి పెట్టేరు. కాపున యొక్కింత కనుమఱుగుగా నుండుటమేలని నాయిక నాయకుని వేలంవెఱ్ఱి చేష్టలను వారించుచుండుట యిందు కనుంగొనగలము.

మన్నారురంగని పదములు బహుసంఖ్యాకములుగా నున్నవి.

మగవాడు వలచితే సుఖము
మగువలే మగవారి మాయల మరగి తిరిగిన నేమిఫలమమ్మా

చ॥ సకలవిద్యలు నేర్చిన సౌందర్యవతియైన
నొకని వలలోజిక్కితేను యీవూరట చెల్లుచెల్లునో
నకట నీవెంతజంతవు నాయకుని నడవడికలు దెలియువేళ
నదియొక్క మేలా॥

చ॥ చెల్ల ప్రాయపుచెలులులేరా వారెల్లనీవలె తిరిగేరా
చెల్లునా యిదినీకు మానమే సొమ్మ నామాట నమ్మ ॥చె॥

అని యొక యనుభవజ్ఞురాలు నాయకునకు ముందుగా తన ప్రేమ నర్పించు కొన్న ముద్దరాలిని మందలించుచున్నది. వీరి పదములలో హెచ్చుగా నీభావమే కన్పట్టుచున్నది.

'గానకళాచంద్రిక'లో ఘనం సీనయ్య పదముగా పేర్కొనబడిన మిక్కిలి ప్రసిద్ధమగు "శివదీక్షాపరురాలనురా" అను పదము మన్నారు రంగ ముద్రతోనుండుట గమనింపదగినది.

"మోము మోమునబట్టి చేర్చకురా నీ
నామముతోడ బూతి గూర్చకురా
వేమరుతోడ భిక్ష వేడకురా పోపో
రా మన్నారు రంగ మల్లాడకురా ॥శి॥

తుదియందలి ఈ చరణమున మన్నారు రంగ ముద్ర స్పష్టముగా గన్పట్టు చున్నది.

పరిమళరంగ పదములు

పరిమళరంగని పదములసంఖ్యాకములుగా నున్నవి. ''పదరి మోడి చేయక బాలరనేనైతే'' "వలపు కనుగొంటినే తెలియక వనితరో ఏమిసేతునే" అను ప్రసిద్ధ కీర్తనలు వీరివే. వీరి కీర్తనలలో ఎన్నివిధముల నీ శృంగార వాఙ్మయమున భావములు కనుబఱచ వీలగునో అన్ని విధములగు పదము లున్నవి. ''ఇల్లాలిగా నేలబుట్టించె విధి యిందు కేమందునె చెలియా" అని ఇల్లాలు తన యిల్లాలిజన్మనే నిందించునంత చరమస్థితికి చేరినదీ రసికత.

ఇక యీ వాఙ్మయమున ప్రసిద్ధుడైన సారంగపాణివారి పదములు కొంచెము హెచ్చరిక తెలుపునవియై యున్నవి.

"మోసపోవద్దురా వేశ్యలమోహము వట్టిదిరా
కాసుపోమూలమిదేరా చెలికాడ యింతటనైన మేలుకోరా॥
''పూసలలో దారమువలె నెంతచేసెనే నమ్మినందుకు''

కొన్ని మామూలు పద్ధతిలోనే యున్నవి.

"పిలచిననాడెల్ల బింకాలుపోయి ఇలుజుట్టి తిరిగేవేమో లజ్జమాని"
వీరిది 'వేణుగోపాలముద్ర'

"ఇందుకా నీకు పంచాంగము చెప్పింది ఇన్నాళ్లను గురించి''
"నీ పప్పేమి చిమిడిందిపుడు-కోపగించుకొనేవు॥
పాపాత్మురాల వేణుగోపాలుడు నమ్మించినందుకు ॥నీ॥
"బొట్టుపేలు సున్నమైతే అంతలో బొర్లపడేవేమెతాను ॥బొ॥

ఈ ఎత్తుగడలను బట్టియే యీకీర్తనలయందలి భావవైవిధ్యమగపడును. ఈ శాఖావాఙ్మయమున సాహిత్యవిమర్శ చేయుట సరియైనదికాదు. ఇట్టి వింకెన్నో పదములు కలవు. ఇంతట నిట ముగింతము. ఇంత భావసంపదకు మాత్రము జోహారు లిడవచ్చును.

కోసలపురివారి సంస్కృత కీర్తనలు కలవు.

మచ్చునకొక్కటి బేగడరాగములోనిది కాంచుడు.

కమలనయన యదువర మాంపాలయ కపటకోపడింభా
కమనీయ గుణాభిరా వధూ సంఘటిత పరీరంభా॥

చ॥ చరణ నిహితశకటాసుర నిగుపమశౌర్యసమారంభా॥
కరికర నిభదోస్తంభా, ఆర్యుతజిత కాళీయసౌరంభా
మురహరి జంభారిముసంభాజ రోషమదడంబా—హంకృతి
విరచిత హితముని వరసేవ్యమకరికావిలసితరాధాకుచకుంభా ॥క॥

ఇట్లే శబ్దాలంకార భూయిష్ఠమైనది వీరి రచన. వి్రకాల నరసింహాచార్యులవారి తిరునామ సంకీర్తనములు కలవు. ఊరక వైష్ణవనామముల పట్టికలవి. కీర్తన వాఙ్మయకారులలో కూడ ఎన్ని విధములగు వారుకలరు? అని చూపుటకు నిదర్శనముగా పేరిచ్చితిని. ఇవి క్షేత్రయ్య, త్యాగయ్యలతో మొదలిడిన శాఖల కనుబంధములు.

## స్త్రీల కీర్తనలు

ఆధునికులలో శ్రీ సనాతన ధర్మమండలి కార్యదర్శినియగు ఇప్పగుంట వేంకమాంబగారు 'భజనతరంగిణి' యనుపేర కీర్తనలు ప్రచురించిరి.

కీర్తనలు సామాన్యముగా నున్నవి.
ఆనందభైరవి లోని
'గురుకృపగనవే ఓ మనసా నీవు
తిరముగల్గి తెరపుదెలియనెంతయు సద్గురుకృప॥
మునుగకే మోహాబ్ధియందు నీ
మూఢసంసారము ముంచునిన్నిందు ॥గు॥
మను సర్వకర్మలయందు రాముని భక్తిచే
జేయనపరె నీపొందు ॥గు॥
దార ధనాదులుకల్లా యంత
దవ్వుచేరిన నంతదగు చింతకొంత
పారములేనిది సుంత ॥గు॥

తుర్లపాటి అన్నపూర్ణమ్మగారి శ్రీ శివరామకృష్ణ గానామృత కీర్తనలు" అనునది యొక ప్రచురణము కలదు.

శ్రీరాగమునందలి—

"ఎటునన్నేలెదో యేమి సేతువే
యెన్నాళ్ళిటువలె జరిపెదవో
పటుతరముగ నీపాదమె గతియని
తటుకున నామది స్ఫుటముగ నమ్మితి ॥ఎ॥

ఉపసంహారము

సృష్టికి సహజ లక్షణమైన గానమును గూర్చియు ఆ విద్యయందు కీర్తన రచన కావించిన వాగ్గేయకారులను గూర్చియు తెలుసుకొనియుంటిమి.

సెలయేళ్లు ముర్మురధ్వనులతో గానమొనర్చుచున్నవి. పండుటాకులు గలగలమనుచు పాటపాడుచున్నవి. శుకపికములు కుహూకుహూరవములతో సంగీతముపాడి కొసరికొసరి రసజ్ఞుల నానందపరవశుల నొనర్చుచున్నవి. ఆవుల యంభారవమున నొక స్వాదుతర కమనీయసంగీత మిమిడియున్నది. పసిబిడ్డ యాక్రందనమున నొక మధురగానము సమ్మిశ్రితమైయున్నది. ఎచట లేదు సంగీతము! ప్రకృతి యంతయు నాదబ్రహ్మావృతమై గాన శోభతో కల కలలాడుచు ప్రణయరాగమున ప్రాణేశుని కీర్తించి నర్తించుచున్నది.

సహజమైన యీ రాగశోభకు విజ్ఞానియైన మానవుడు తన కృషిచే మరియొకింత మెఱుగులు దిద్దినాడు.

అజ్ఞానియైనను జడుడైనను అప్రయత్నముగ అనధ్యయనముగ నీకళ నాశ్రయింపకతప్పదు. ఉబుసుపోకకో, ఉదరపోషణమునకో. ఉచితరీతులలో ప్రాణికోటి గానము నాశ్రయించియే బ్రతుకుచున్నది. ఒకటిన్నీ రెండు మూడూ, మూడూ, మూడూ = ఆరూ అని లెక్కలు వ్రాసికొను సాధారణ వ్యక్తి అఠాణారాగమున నాయాసంఖ్యలను పునరావృత మొనర్చుకొనుచు పాడుటలో ఆ లెక్కల శ్రమను మఱచి తన్మయీభావము నెందుటను మన మెఱుంగుదుము. పెద్దపెద్ద పండితులైనవారు, కవులైనవారు, వచనమున

ప్రసంగములు వ్రాసి సభాంగణముల నిలిచి పాటలవలె పాడుచు చదువుట అందఱెఱింగినదే.

ఇట్లు ఆబాలవృద్ధమూ పండితపామరులు ఎఱింగియో ఎఱుంగకయో సంగీతము నాశ్రయింపక తప్పకున్నది.

అట్టియెడ విజ్ఞానులైన మహానుభావుల సంగీత పరిశ్రమమునుగూర్చి యేమి వ్రాకువ్వగలము?

'ముఖేముఖే సరస్వతీ' యనినట్లు తీరుతీరులుగా రాగసుధల నావిర్భవింపజేసి గానకళను పెంపొందింపజేసి జగన్మాన్యులైనారు వాగ్గేయకారులు.

అందును మన తెలుగుభాషా మాధుర్యమునుబట్టి మన తెలుగువాగ్గేయకారుల శ్రమము బంగారమునకు తావియబ్బినట్లు మఱింత వాసికెక్కి శోభించినది. తాళ్లపాక అన్నమాచార్యుల మొదలు నేటివఱకుగల శతసహస్రాధిక వాగ్గేయకారుల గానకళా సమర్చనమే తెలుగులపాలిటి భాగ్యరాశియైనది. తెలుగువారి వాఙ్మయమునకు పెన్నిధియైనది.

అన్నమయ్య ఆధ్యాత్మిక సంకీర్తనమును, మధుర భావభక్తి పూర్వకమగు శృంగారవచనములను నొనర్చినవాడు.

పిమ్మట క్షేత్రయ్యయు నా మార్గముననే శృంగార సంకీర్తన మొనర్చినవాడు. అంచనడల బెడంగున కోయిలమ్మ కూజితములవలె సుకుమారములై వారి పదరచన హాయినింపినది.

అటుపిమ్మట సుబ్రహ్మణ్య కవీంద్రుని అధ్యాత్మ రామాయణకీర్తన రచనా పద్ధతి యొకమాదిరిదై వచనములను తలపించు పెద్దచరణములతో నిండియున్నది.

తెలుగువారి ఉద్రేక స్వభావమునకు మూర్తియై నిలిచి గొంతెత్తి ఉగ్రభక్తితో రామచంద్రుని తెగడియు పొగడియు మెప్పించిన రామదాసుని ఫణితికి మఱల ఈడేలేదు. ఇంతవరకు జరిగిన రచన సాహిత్యప్రధానము.

సందులు దూరక చక్కని రాజమార్గమున కృతిరచనా రథమును సింహ గమనముతో సాగించిన వాగ్గేయకార సార్వభౌముడు త్యాగయ్య తత్వగుణము కొఱపడినపుడు అవరూపరాగముల కీర్తనల రచించిరన్న అవి 'పిల్ల వసు చరిత్ర' లట్లు అల్ప కీర్తిమంతములగునేకదా! దీని వింతతో విడిచిపుత్తము.

క్షేత్రయ్యనుండి ప్రధానముగా బలుపునెందిన శృంగార పదరచన త్యాగయ్యకు పిమ్మట కేవల లౌకిక శృంగారగతమై జావళీలపేరుతో ప్రత్యేక శాఖగా వెలసినది.

ఇక తత్త్వవాఙ్మయమునందును రామకృష్ణాది పరదైవతముల భజన కీర్తనముల నొనరించిన వాగ్గేయకారులు నగపడుచున్నారు. పోతులూరి వీర బ్రహ్మంగారి కాలజ్ఞానవచనములతో నారబ్ధమై యిది యాధునికులవఱకును వ్యాపించియున్నది, ఇందలి గూఢార్థములుకల సంకేతపదరచన యొకటి కీర్తన వాఙ్మయమున విశిష్టస్థానము నందియున్నది. దూదేకుల సిద్దప్ప, వీరయ్య, గోవిందమ్మల రచనలును ఇంక కొందఱ రచనములు నుజ్జ్వలములై యున్నవి.

త్యాగయ్యనుచూచి అటువలె కీర్తనలు రచించుటలో సరియైన శిష్యులని పించుకొన్నవారు పట్నం సుబ్రహ్మణ్యయ్య, వీణ కుప్పయ్య మున్నగువా రెందఱోకలరు. త్యాగయ్య సమకాలముననే త్రిమూర్తులనబడిన ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రిల కీర్తనసేవయు ప్రశంసింపదగినదేకదా. శ్యామశాస్త్రి కుమారుడు సుబ్బరామశాస్త్రియు ప్రసిద్ధవాగ్గేయకారుడే.

త్యాగయ్యకు పిమ్మట నాతీరు కీర్తనములు రచించిన వాగ్గేయకారులు తప్ప తక్కిన తత్త్వవాఙ్మయకారులును, సంకీర్తన వాఙ్మయకర్తలును మఱల సాహిత్యప్రధానతనే పాటించిరి. కాని నాదప్రధానతాగుణమును పాటింపరైరి.

ఇట్టి సంకీర్తనకారులలో నొకడగు తూము నరసింహదాసుడు మున్నగు వారు రచించిన మంగళహారతి కీర్తనలును బూజంబంతి బంతులాట పాటలును మిగుల ప్రసిద్ధి కెక్కినవి. అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య మున్నగు సుప్రసిద్ధులును నీ వాఙ్మయశాఖను వెలువరించినవారే.

ఇట్టి కీర్తనలలో స్త్రీల పరిచయము ప్రశంసింపదగినది. గిడుగు లక్ష్మీ కాంతమ్మ, పులుగుర్త నరసమాంబ, గుడిపూడి ఇందుమతీదేవి గార్ల రచనా సంవిధానము గమనింపదగినదే.

ఇవి యిట్లుండ బ్రహ్మసమాజ మతవాసనా సంపూర్ణమగు భక్తికీర్తనల ప్రాబల్యమొకవంక తరుముకొని వచ్చినది. ఇయ్యవియును సాహితీప్రధాన రచనములే యైనను నీ శాఖయందలి సాహిత్యరచన అనన్యమైనది. కొమ్మపై నెక్కి కోయిల క్రొత్తగా కుహూకుహూరావముల కొనసరించునట్లు, ఆకుపై ఉదయసంధ్యను మంచుబిందులు మిలమిల మెఱసినట్లు, ప్రసవగర్భమునుండి నవమధువులు తొంగిలొల్కాడి ప్రవహించినట్లు అతిమంజుల భావశయ్యలతో దీనాతిదీనముగా, నార్తిపూర్వకముగా సర్వేశుని ప్రార్థించుటయందు కాననగును. తీయతేనియజాలువలె, కలకండపలుకువలె పదములను మలచి వాక్యవిన్యాస మొనర్చిరీ అక్షరశిల్పులు!

ఇప్పగుంటవారు, వద్దాది సుబ్బారాయుడు, ఆదిపూడి సోమనాథము, చె. సూరన్న, దేవులపల్లి కృష్ణశాస్త్రి గార్ల కీర్తన గతి ప్రసారములు ప్రత్యేక స్తుతిపాత్రములు.

ఇంతేకాక కీర్తన ప్రచారబలము నెఱింగి దీనినొక వజ్రాయుధముగ గ్రహించి గరిమెళ్ల సత్యనారాయణ మున్నగువారును "మాకొద్దీ తెల్లదొర తనము" మున్నగుకీర్తనలను రచించి రవి యస్తమింపని మహాసామ్రాజ్య పీఠమును మూలమట్టుగ గ్రక్కదలించిరి.

ఈ సత్యాగ్రహోద్యమ కీర్తనలను స్మరించినపుడు ఒకప్పు డాదికాలమున శైవమతానుయాయులును, వైష్ణవులును దమతమ మత ప్రచారములకు కీర్తనల నుపయోగించియుండుట జ్ఞప్తికిరాగలదు.

# ఆంధ్రుల కీర్తన వాఙ్మయ కళా సేవ

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

జననము :—1917

జననీజనకులు :—

శ్రీమతి నాళము సుశీలమ్మ

మధురకవి శ్రీ నాళము కృష్ణరావుగారు

భర్తగారు :—

శ్రీ ఊటుకూరి హయగ్రీవగుప్తగారు ; అడ్వకేటు.

రచయిత్రి కళాప్రపూర్ణ

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

ఇతర రచనలు

1. అఖిలభారత కవయిత్రులు
2. శ్రీ కన్యక సుప్రభాతము
3. దేవీస్తవ తారావళి.
4. జాతిపిత
6. ఆంధ్రుల సంగీతవాఙ్మయ సేవ
6. మనసాహితి—మధుభారతి
7. కాంతిశిఖరాలు
8. కన్యకమ్మనివాళి
9. మహిళా విక్రమ సూక్తము
10. లజ్జా కిరీటధారిణి
11. ఒక్క చిన్నదివ్వె
12. పదుక్తిమంజరి
13. నా తెలుగుమాంచాల
14. ఆంధ్ర కవయిత్రులు ఇత్యాదులు.